# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## కిరాయి యుద్ధ వీరులు
రచన: శ్యాంబాబు

## వలచి వచ్చిన వనిత
2 రచన: వసుంధర

## మాయమైన గూఢచారులు
రచన: సుజనశ్రీ

## ప్రేతం ప్రేమ
రచన: ఏ. పి. మోహన్రావ్

"ఖైదీ" సీరియల్ - 13 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—18
జూన్, 1975
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్--36959

# కిరాయి యుద్ధవీరులు

శ్యాంబాబు

ఆ గదిలో మేడమ్‌రసూలీ, మెకిన్స్ కాకమరో ఇద్దరు కనిపిస్తున్నారు. మెడమ్‌రసూలీ వెనగ్గా బూతద్దాలు పెట్టుకొన్న ఓ నీగ్రో గదితలుపుదగ్గర గొరిల్లా లాంటి మరోనీగ్రో వున్నారు. ఒకసారి సిగరెట్ పొగపీల్చి వదలి మేడమ్‌రసూలీ వైపుచూశాను.

"లుక్ మాడమ్! మనం ఎంతత్వరగా బిజినెస్‌లోకి వస్తే అంతమంచిది!"— అన్నాను. మెకిన్స్ కూడా సిగరెట్ వెలిగించి నవ్వుతూ నావైపుచూశాడు. "ఆల్‌రైట్ కల్నల్! విషయం చెపుతా వినండి"— అన్నాడు గొంతుసవరించుకొంటూ.

ఆఫ్రికాఖండం పశ్చిమతీరాన వున్న ఓ చిన్నరాజ్యంలో

ఆ రాచకపు ప్రభుత్వాన్ని పడతోసి విప్లవ ప్రభుత్వాన్ని అధికా రంలోకి తీసుకరావాలి. దానికి మీసహాయం కావాలి''— అన్నాడుమెకిన్స్ సూటిగా నావైపుచూస్తూ.

ఒకక్షణం ఆలోచిస్తూవుండి పోయాను నేను...''చూడండి మేడమ్! అయామె మెర్సినరీ! అంటేడబ్బుకోసం యుద్ధాలుచేసి పెట్టేమనిషిని! మీతరపున ఒకసైన్యాన్ని తయారుచేసి. ఎవరి మీదన్నా యుద్ధం చెయ్యమంటే చెయ్యగలను... అంతేకాని రాజకీయాలలో నేను జోక్యం కల్పించుకోనని మీరు తెలుసు కోవడం ముఖ్యం''— అన్నాను నేను గంభీరంగా, చివరకి.
మేడమ్‌రసూలి నావైపు నవ్వుతూ చూసింది. ''మీరు చెప్పిన విషయాలు అర్ధమైనాయి కల్నల్ బాబీ !రాజకీ యాలలో మీకు సంభంధం వుండదు''— అన్నది నిశ్చలంగా.

''మరోవిషయం! భారతదేశానికిగాని. భారతమిత్రదేశాలకు గాని, వారి విధానాలకు వ్యతిరేకంగా' హానిజరిగేలా వుండే యుద్ధాల్లో నేను పాల్గొనను అనేవిషయం కూడామీరు తెలుసుకోవడం మంచిది. మీరు నన్ను జయించమని అడుగు తున్న ప్రభుత్వం భారతదేశానికి మిత్రదేశమైతే నేను డీల్‌లో నుండి ఇప్పుడే విరమించుకొంటాను''— అన్నానుమళ్ళీ!

నాకు జీవితంలో డబ్బేకాదు, కొన్నిసిద్ధాంతాలుకూడా ముఖ్యమని వాళ్ళకు ఇప్పుడే తెలియజెప్పడం మంచిదనిపించింది ఆ క్షణంలో

మొట్టమొదటి సారిగా మేడమ్‌రసూలి అంగరక్షకుడు ముంబా కళ్ళజోడు ఓసారి సర్దుకొని నావైపుచూశాడు. మనిషి పిట్టలావున్నా అతని గొంతు చాలాగంభీరంగా వుంది.

కల్నల్ బాబీ! మాదేశంతో భారతదేశానికి. గానీ ఇతర భారతమిత్ర దేశాలకుగాని ఏ రకమైన సంబంధంలేదని.

మనచర్యలవల్ల ఏ హాని కలగదని నేనుహామీనివ్వగలను''— అన్నాడుముంబా.

అవునన్నట్లు తలవుపారు రసూలీ, మెకిన్స్‌లు.

''అయితే చెప్పండి! కానిమరోవిషయం. పూర్తివివరాలు తెలిసేవరకు నేను మీకేమాటా ఇవ్వలేను''— అన్నాను సిగరెట్ ఆర్పేసి మరోటివెలిగిస్తూ.

''ఏగ్రీడ్!—అన్నది మెడమ్‌రసూలీ,

''ఆఫ్రికాఖండం పశ్చిమతీరాన 'కంగారూ'అనే చిన్నదేశం వుంది. నైతికంకాగాని, ఆర్థికంగా గాని ఏరకమైన ప్రాముఖ్యత లేదు. దేశం మొత్తంజనాభాఇరవైలక్షలకు మించి వుండదు ప్రజలుదాదావు అనాగరికులు ఆఫ్రికన్ అడవిజాతి మనుషులు అడవుల్లోనూ. కొండలచుట్టూ వుండే మైదానంలో చిన్నచిన్న గూడాల్లో నివసిస్తూవుంటారు.

**కాంబో** పట్టణం మాదేశానికి రాజధాని. దేశం మొత్తం మీద చెప్పుకోదగిన వూరు అదొక్కటె. ఎందుకంటె పోర్చు గీసువాళ్ళు మాదేశాన్ని స్లేవ్ కాలనీగా వుంచి పరిపాలించి నప్పుడు వాళ్ళసైనిక శిబిరాలు, కాలనీగవర్నరు, బ్యాంకు, విదే శస్తులు ఎవరైనా వుండడానికి హోటలు మెదలయిన వన్నీ కాంబోలోనే ఏర్పాటు చేశారు. కంగారూలో ఎక్కడయినా నాగరి కత కనిపిస్తుందా అంటె అది కాంబోలోనే కనిపించాలి. మరొక్క విషయం—సైనిక అవసరాలకోసము ఆరోజుల్లో పోర్చుగీస్‌వారు చిన్నవిమానాశ్రయం కాంబో పట్టణసరిహద్దు ల్లో నిర్మించారు.

కంగారూ రాజ్యం మొత్తం వైశాల్యం వెయ్యిచదరపు మైళ్ళు వుంటుంది. పశ్చిమాన సముద్రం. మిగిలిన మూడుదిక్కులు దట్టమైన అడవులలో నిండిన పర్వతశ్రేణులు వుండడంవలన

నాగరికతలో ఈదేశానికి హెచ్చు సంభంధం లేకుండాపోయింది. వేట, కలప కొట్టడం ప్రజల ముఖ్యవృత్తి. కొంతమంది వ్యవసాయం చేసి వరిపండిస్తారు. అనాగరికత, విద్యాహీనత, బీదరికం ప్రతిచోట ప్రబలి పోయివుంది.

అప్పట్లో కంగారూలో బంగారం గనులుండేవి. అగనుల్లో ఖనిజం ఉత్పత్తి ఆగిపోగానే పోర్చుగీసువారు కంగారూను స్వతంత్రరాజ్యంగా ప్రకటించి వెళ్ళిపోయారు.

స్వతంత్రకంగారూ దేశానికి జనరల్ నిషాన్ మొట్టమొదటి అధ్యక్షుడయ్యాడు. ఇక్కడ జనరల్ నిషాన్‌ను గురించికొంత చెప్పకోకతప్పదు. జనరల్ నిషాన్ ఆఫ్రికన్ జాతులకు చెందిన 'తునీష్' జాతిమనిషి. పోర్చుగీసుసైన్యంలో వున్న ఆఫ్రికన్‌ల దళానికి కమాండరు. కంగారూలో ఏదోరకంగా పోర్చుగీసువారికి దగ్గరగా వున్న వారుతప్ప విద్య నాగరికతలకు దూరంగా వుండి పోయారు అందుచేత నిషాన్ లాంటివారే కంగారూలో విద్యా వేత్తలు, నాయకులనిపించుకొన్నారు.

ప్రభుత్వం లేని రాజ్యంలో అలజడులు రేగుతాయనే భయంతో పోర్చుగీసువారు వెళ్ళిపోతూ తమకు విశ్వాస పాత్రుడయిన జనరల్ నిషాన్‌కు ప్రభుత్వాధికారాన్ని అప్పగించి వెళ్ళిపోయారు. ఇప్పటికి జనరల్ నిషాన్ పదవిలోకివచ్చి పదేళ్ళు కావస్తుంది. కంగారూ రాజ్యం మరింత అనాగరికతకు' పేదరికానికి దిగజారిపోయింది.

జనరల్ నిషాన్, అతనిఅనుచరులైన సైనికులు, బందిపోటు దొంగల్లా వ్యవహరిస్తూ అమాయకులైన ప్రజల్నిపీడిస్తూ, పన్నులు వసూలుచేస్తూ వాళ్ళ ఆనందంలో తేలిపోవడమేగాని, దేశాన్ని అభివృద్ధి చెయ్యాలనే విషయాన్ని పూర్తిగా మరిచి

పోయారు అసలు దేశ పరిపాలన అంటే ఏమిటో వాళ్ళకు తెలియదు. ఎంతో అయిదేళ్ళనడిస్తే కంగారూ శతాబ్దాల క్రితం వున్న ఆఫ్రికాఖండంస్థితికి దిగజారుతుందం టేఅతిశయోక్తి లేదు.

ఇలాంటి స్థితిలో కంగారూ ప్రజలు అదృష్టంకొద్దీ డాక్టర్ రసూలీ కంగారూలో ఓ ప్రజా ఉద్యమం బయలుదేరదీశాడు. డాక్టర్ రసూలీ చిన్నతనంలోనే తల్లిదండ్రులతో పాటు ఓ బానిసగా అమెరికా తీసుకపోబడ్డాడు. కాని కాల్రకమేణా అమెరికాలో పరిస్థితులు మారడంవల్ల ఆయన అక్కడ విద్యనభ్యసించ డానికి వీలయింది. తన ముప్పై అయిదవఏట పొలిటికల్ సైన్స్‌లో డాక్టరేటు పుచ్చుకొన్న రసూల్‌కి ఎందుకో తన మాతృదేశాన్ని ఓసారిచూడాలని పించివచ్చాడు.

కంగారూలో పరిస్థితులు డాక్టర్ రసూలీ హృదయాన్ని కదిలించాయి. ఎలా అయినా కంగారూలో పరిస్థితులు మార్చాలని డాక్టర్ రసూలీ నిర్ణయించుకొన్నారు. దాని ఫలితంగానే కంగారూలో ప్రజావిప్లవం మొదలయింది.

శాంతి యుతంగా తమ ప్రయోజనాన్ని సాధించాలని' ప్రజాసామ్య పద్ధతిద్వారానే ప్రభుత్వాన్ని ఏర్పాటుచెయ్యాలని డాక్టర్ రసూలీ ప్రయత్నించారు. కంగారూలో ప్రవహించే ఒకే ఒక నదికి ఆనకట్టలు కట్టి వ్యవసాయాన్ని వృద్ధిచేసి, ప్రజల జీవన ప్రమాణం పెంచమని డాక్టరసూలీ, నిషాన్‌కు చేసిన విజ్ఞప్తులు ప్రదర్శనలు వ్యర్థమయ్యాయి. ఆయుధ విప్లవం చేపట్టాలని డాక్టర్ రసూలీ తన అనుచరులతో నిర్ణయించేశారు. ఆరాత్రి నిషాన్ అనుచరులు డాక్టర్ రసూలీని, ఆయన ముఖ్య అనుచరుల్ని బంధించారు."— మెకిన్స్ ఒక క్షణం చెప్పడం ఆపి సిగరెట్ వెలిగించాడు.

నేను చెప్పింది మనసులో నెమరు వేసుకొంటూ, మనసు

లోనే ఆఫ్రికాఖండం మ్యాపులు పరిశీలిస్తున్నాను. మరోసిగరెట్ వెలిగించి చెప్పమన్నట్టు తలాడించినారు.

"ఇదీ మాకంగారూ దేశపరిస్థితి. మేడమ్‌రసూలీ' భార్య అని మీకు అర్థమయే వుంటుంది. మిస్టర్‌లుముంబా. డాక్టర్ రసూలీ కుడిభుజము. ఆరోజురాత్రి వేరే పనిమీద వుండటం చేత నిషేన్ సైనికులకు దొరకలేదు. సోకల్నల్ బాబీ, కంగా రూలో వున్నసైనికప్రభుత్వాన్ని పడగొట్టి. అభివృద్ధి కాముకు లైన డాక్టర్‌రసూలీని మీరు పదవిలోకి తీసుకరావాలి."— అన్నాడు మెకిన్స్.

నేను నిముషం పాటు మేడమ్‌రసూలీ వైపు దీర్ఘంగా చూస్తూవుండి పోయాను. చివరకి, " ఒక్క విషయం నాకర్థ కావడంలేదు— జనరల్ నిషేన్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి మీరు నాలాటివాళ్ళను ఎందుకు ఏరుకొన్నారు. ఏఇరుగుపొరుగు రాజ్యాల సహాయమో తీసుకోవచ్చుగా? లేకపోతే ఏఅగ్రరాజ్యాన్ని ఆశ్రయించినా మీపని జరిగేదిగదా? వై మీ? మార్కెట్‌లో ఎన్నోవందలమంది మెర్సినరీలు వుండగా పనిగట్టుకొని ఇండి యాలో వున్న నన్ను సంప్రదించడం దేనికి?"— అన్నాను ఒక్కొక్క ప్రశ్నవత్తిపలుకుతూ.

మేడమ్‌రసూలీ క్షణంపాటు నావైపు దీర్ఘంగా చూసింది. " మీకు అర్థమయి వుంటుందను కొన్నాను కల్నల్‌బాబీ! కంగారూ చాలాచిన్నదేశం. ఎవ్వరికీ ఏరకంగాను ఉపయోగపడని దేశం. అరాజ్యాలు తమ గ్లోబల్‌స్ట్రాటజీకి ఉపయోగపడే దేశాలకు తప్ప, మిగతా వాటి విషయాల్లో జోక్యం కలిపించుకోవని మీకు తెలుసు.

అయినా మేము ప్రయత్నించాము. ప్రయోజనం లేక పోయింది. కంగారూ ఎవరికీ ఇంట్రస్ట్ కలిగించలేదు. మా

పొరుగురాజ్యాలూ మాకన్నా కాస్త మెరుగ్గా వున్నాయి. అంతే. ఆఫ్రికన్ దేశాల పరిస్థితులు మీకు తెలియనిదేముంది? అంచేత కాండో, ఆమన్, జాంబియా మొదలయిన రాజ్యాల్లో మెర్సినరీలను ఉపయోగించి మాలక్ష్యాన్ని సాధించదలచు కొన్నాము. వెంటనే నా మాతృదేశమైన అమెరికాలో, మరికొన్ని చోట్లా నిధులు ప్రోగుచెయ్యడం మొదలు పెట్టాము. ఒక అమెరికన్ దాత మాకుకావలసిన నిధి సహాయం చేస్తానన్నాడు మిష్టర్ మెకిన్స్ ఆయన రిప్రజెంటేటివ్. ఇకపోతే మీదగ్గ రకే ఎందుకు రావలసి వచ్చింది.

మొదటికారణం విషయాన్ని రహస్యంగా వుంచడం. మీరు ఒప్పుకోకపోయినా మాప్లాట్ బయటికి రాదనే ధైర్యం. రెండ వది ఈఫీల్డులో యుఆర్‌బెస్ట్ అని తెలుసు కొన్నాము''— అంది చివరివాక్యం చిన్ననవ్వుతో ముగిస్తూ.

నేనుఅయిదు నిమిషాలసేపు దీర్ఘంగా ఆలోచిస్తూ వుండి పోయాను. గదిలో ఆనలుగురు నేనేంచెబుతానో అని కాచుకొని కూర్చున్నాను.

''చెప్పండి కల్నల్‌బాబీ! మీనిర్ణయం ఏమిటి?''— అంది పెదప్రెసిడెంట్.

నేనొకసారి గట్టిగా ఊపిరి పీల్చివదిలాను. ''నిర్ణయం చెప్పకముందు. అంతకన్నా ముఖ్యవిషయం మరొకటుంది. కేవలం మీరిచ్చే డబ్బుకుఆశపడి నేను యస్ అన్నందువల్ల ప్రయోజనంలేదు. ముందు అసలు కంగారూ రాజ్యాన్ని సైనిక దాడి జరిపి స్వాధీనం చేసుకోనే అవకాశం ఎంతవరకు వుంది అనే విషయాన్ని తేల్చుకోవాలి. అవకాశంవుంటె ఏరకంగావుంది. ఎంతమంది మనుషులు అవసరం, ఏరకమైన ఆయుధాలుకావాలి. ఏరకంగా దాడి జరపాలి,— మొదలయిన విషయాలు నిర్ణయిం

చాలి. ఈ పాసిబులిటీస్ చూసింతరువాతగాని, నారేటునిర్ణయం చెయ్యను. పనినిబట్టి జీతంకదా!"—అన్నాను

"అయితే ఈ విషయాలు తేల్చుకోవడం ఎలా?"—

"అది స్పెషలిష్టుపని. సైనిక వ్యూహం తెలిసిన మనిషి ఇవన్నీ నిర్ణయించాలి"— అన్నాను.

"కల్నల్ బాబీ! ఇండియన్ ఆర్మీ అపరేషనల్ స్కీమ్స్ విభాగానికి మీరు ఒకప్పుడు అధిపతి అని మాకుతెలుసు. ఆ పని మీరే ఎందుకు చేయగూడదు".— అన్నది మెడమ్‌రసూలీ.

నేను ఒక్కక్షణం ఆలోచించాను. "ఆల్‌రైట్ మెడమ్ రసూలీ! ఆపరేషన్ కంగారూ, ప్రాజెక్ట్ మీకు ఇవ్వడానికి పదివేలడాలర్లు అవుతుంది . ఖర్చులు మీవే"— అన్నాను సిగరెట్ ఆష్‌ట్రెలో ఆర్పేస్తూ.

లుముంబా. మెకిన్స్, రసూలీ ముగ్గరు క్షణం పాటు కళ్ళతోనే మాట్లాడుకొన్నారు. ముగ్గరూ నావైపున నవ్వుతూ చూశారు.

"ఆల్‌రైట్ కల్నల్! మీరు పనిప్రారంభించండి ... ఈరోజే మీపేరున స్విట్జర్లాండ్‌లోని నేషనల్ బ్యాంక్‌లో డబ్బుజమకడతాము"—అన్నది రసూలీ లేచి నిలబడుతూ

# 2

కంగారూ దేశానికి ఏయిరోప్లేన్ సర్వీస్ ఏమీ లేదని తెలుసు కొన్నప్పుడు ఆశ్చర్య పోలేదు నేను. మెకిన్స్ చెప్పిందాని బట్టి అసలు కాంబోఎయిర్రోడ్రమ్ సరియైన కండిషన్లో వుందో లేదో అనేది అనుమానాస్పదం. కాని అతి త్వరగా కంగారూ చేరాలంటే ఏదో ఓ రకంగా ఆకాశంలో ప్రయాణించడం తప్ప మార్గం లేదు

అంచేతే బొంబేనుండి జాంబియాకు ఎయిర్‌ఇండియా ఫ్లైట్‌లో వెళ్ళి, అక్కడినుండి ఓ ప్రయివేట్ డకోటా

విమానాన్ని అద్దెకు తీసుకొన్నాను. జాంబియాలో విమాన సర్వీసు నేషనల్ లైజేషన్‌చెయక పోవడం నాఅదృష్టం. విమానంలో నుండి మొట్టమొదటిసారి కంగారూ దేశంలో ప్రవేశించినప్పుడు నా ఆశ్చర్యం వర్ణనాతీతం

మైళ్ళకొలదీ దట్టంగా పెరిగిన అరణ్యాలు,అక్కడక్కడా ఇరవై ముప్పయ్యేసి వున్న గుడిసెల గుంపులు, కంగారూ నాగరికతకు చాలా దూరంగా వున్నదన్న విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి, జాంబియాలో బయలుదేరిన నాలుగు గంటలకు కాంబో సరిహద్దులకు చేరుకొన్నాను.

'నీ స్థానంలోనేనుంటే క్రిందికి దిగడంకాదుగదా, కనీసం తొంగిచూసే ప్రయత్నం కూడా చెయ్యను మిస్టరు''—అన్నాడు విమానం పైలట్.

''ఎడ్వెంచర్లు చెయ్యడమంటె నాకిష్టం!''—అన్నానోసారి చిత్రంగా భుజాలెగరేసి.

''నీ ఇష్టం! ఇక నుండి రోజూ నీకోసం ప్రార్థన చేస్తాను!'' అన్నాడు పైలట్ నవ్వుతూ.

కాంబో ఎయిరోడ్రమ్ చూడ్డానికి పెద్దదిగా కనిపిస్తోన్నా, ఎక్కడా జన సంచారం మాత్రం లేదు. ట్రాఫిక్ లేక పోవడం వల్ల. బహుశా కంట్రోల్ రూమ్ వుండి వుండదు. పైలట్ రెండు సార్లు ఎయిరోడ్రమ్ చుట్టూ తిరిగాడు అప్రోచ్ కోసం చూస్తూ. ఎయిరోడ్రమ్ బిల్డింగ్ పైకి చాలా మంది సైనికులు వచ్చి విమానం వైపు చేతులు వూపుతున్నారు. మూడవ టర్న్‌లో పైలట్ విమానాన్ని క్రిందకు దించాడు.

మైంటెనెన్స్ లేక పోవడం వల్ల, ఉపయోగం తెలియకుండా ఉపయోగించడం వల్ల రన్‌వే సాఫీగా లేదు. పైలట్

విమానాన్ని ఆపాడు. ఇంజన్ మాత్రం ఆపలేదు.
"ఫ్రెండ్! ఇప్పటి కయినా మార్చు కొంటే వెనక్కి తిరిగి వెళ్ళిపోదాము. రిటర్న్ జర్నీ ఫ్రీగా చేద్దువు గాని"—అన్నాడు పైలట్.
నేను సూట్‌కేసూ, ట్రావెల్ బాగ్ తీసుకొని నిలబడ్డాను.
"థాంక్స్! వచ్చేవారం మళ్ళీ ఇదేసమయానికిరావాలి!" అన్నాను.
"గాడ్ బి విత్ యు!"—అన్నాడతను నా వెనకే వచ్చి తలుపు మూసేస్తూ.

నేను డకోటా నుండి దిగి ఎయిర్‌పోర్ట్ బిల్డింగ్ వైపు నడవడం మొదలు పెట్టాను. ఒక్క నిముషం ఆగి వెనక్కి తిరిగి చూశాను. పైలట్ విమానాన్ని వెనక్కి తిప్పుకొని పైకి తీసుకెళ్లి పోతున్నాడు. వెనక్కి తిరిగి ఎయిరోడ్రోమ్ బిల్డింగ్ వైపు నడకసాగించాను. ఈ పదేళ్ళలో బహుశా ఒక్క విమానం కూడా ఈరన్‌వే మీద పరిగెత్తి వుండదు.

ఎయిరోడ్రోమ్ లోనుండి నీలం రంగు యూని ఫారమ్‌లో వున్న వ్యక్తులు నా వైపు గుంపులు, గుంపులుగా పరిగెత్తి వస్తున్నారు. బహుశా జనరల్ నిషేన్ సైనికులు అయివుండాలి.
"ఏయ్ ఎవరునువ్వు?"—అరిచాడు వాళ్ళలో ఒకడు 'తునీష్' భాషలో

తునీష్, ఆఫ్రికన్ భాషల్లో ఓ ముఖ్యమైన భాష కాంగో యుద్ధంలో పాల్గొనడం వల్ల నాకు తునీష్ మట్లాడం వచ్చును. అయినా అర్థం కానట్లు వుండి పోయను. దాదాపు యాభై మంది వుండారు వాళ్ళు, నా చుట్టూ గుంపుగా నిలబడ్డారు. అందరూ గోలగా ఓ వింత మనిషిని చూస్తున్నట్లు చూస్తున్నారు నావైపు.

సైనికుల కుండాల్సిన క్రమ శిక్షణగాని, పటుత్వంగాని వాళ్ళదగ్గర వున్నట్లు నాకనిపించలేదు. వాళ్ళ నీలం రంగు యూనిఫాంలు మాసిపోయి, చెమటతో తడిసి వున్నాయి. వాళ్ళ భుజాలమీద' చేతుల్లోనూ వ్రేళ్లాడుతోన్న. 303 రైఫిల్సు దుమ్ము కొట్టుకు పోయి క్లీన్‌చేసి ఎన్నో సంవత్సరాలయినట్లుగా కనిపిస్తోన్నాయి.

నేనెవరయి వుంటానో వాళ్ళలో వాళ్ళు తునీష్‌లో చర్చించుకొంటూ అరుస్తున్నారు. పోర్చుగీస్ అని ఒకడు, గనులుతవ్వే మనషినని మరొకడు, బానిసల వ్యాపారినని మరి కొందరూ ఎవరికి ఇష్టం వచ్చి నట్టు వాళ్ళ అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నారు. వాళ్ళలో నుండి ఒకడు ముందుకు తోసుకు వచ్చి నాముందు నిలబడ్డాడు.

వాడి నీలం రంగు యూనిఫాం షర్ట్ షోల్డర్ లూప్స్ మీద మూడు చిలుం పట్టిన ఇత్తడి బొత్తాలు కుట్టి వున్నాయి, అంటే మిగతా సైనికుల కన్నా వీడికి కొద్దిగా రాంక్ ఎక్కువ వుంటుంది. దాదాపు నా అంత పొడుగున్నాడు. నా ముందు నిలబడి ఓసారి కోపంగా చూశాడు. సైనికుల్లో ఒక్క క్షణం నిశ్శబ్దం అలుము కొంది. చెమటలు కారుతోన్న వాళ్ళ నల్లని ముఖాలు నన్నే చూస్తున్నాయి.

"ఎవరు నువ్వు ఆ విమానం ఎవరిది?"—అరిచాడు వాడు తునీష్‌లో...

నేనుఅర్థంకానట్లు కళ్ళుచిట్లించి చూశాను.

"చెప్పవేరా పంది లం...కొడకా!"—అన్నాడు వాడు మళ్ళీ ఉరుముతున్నట్లు

చుట్టూ వున్న సైనికు లందరూ గొల్లున నవ్వారు. వెనక నుండి ఈలలు, చప్పట్లు మ్రోగాయి.

నేను వాళ్ళుమాట్లాడుతున్నది అర్ధంకానట్లువిత్తరపోయి చూశాను..."టూరిస్ట్!...అమెరికన్..."—అన్నాను వాడి వైపే చూస్తూ...

నిముషం పాటువాడు నావైపునిశితంగాచూస్తూ వుండి పోయాడు. సైనికుల్లో కొందరు 'డాలర్స్' అంటూ ఏదో మాట్లాడు కొంటున్నారు.

"సో యు అర్ ఏన్ అమెరికన్ టూరిస్ట్?"—అన్నాడు వాడు చివరికి ఒక్కొక్క పదాన్ని వత్తి వత్తి పలుకుతూ ఇంగ్లీషులో.

ఈసారిఆశ్చర్య పోవడంనావంతయింది. ఈ మారుమూల అనాగరిక దేశంలో ఇంగ్లీషు మాట్లాడ గలిగిన వాళ్ళు వుంటారని ఎవరు వూహించ గలరు!

"యస్! అయామ్ బాబీ సింప్సన్!"—అన్ననుచేతినిముందుకు చాపుతూ.

"గ్లాడ్టు మీట్యు మిష్టర్ సింప్సన్! అయామ్ కెప్టెన్ ట్రూమా!"—అన్నాడు వాడు.

అక్కడినుండి సంభాషణంతా ఇంగ్లీషులోనే సాగి పోయింది. నేను అమెరికన్ని అని ట్రూమా గాడు తెలుసు కొన్న వెంటనే వాడి ప్రవర్తన లోని మార్పుకు కారణం వాడికి ప్రఖ్యాత పారిశ్రామిక సంస్థ ఇంజనీర్ననీ,కంగారూలో పరిశ్రమలు స్థాపించడానికి వున్న అవకాశాలను పరిశీలించడానికి వచ్చాననీ చెప్పాను. ఆశ్చర్య పోయినట్లు కనిపించాడు డాలర్ల విలువతెలియడంవల్లనే నన్ను కంగారూ ఎందుకొచ్చావని అడిగాడుకెప్టెన్ ట్రూమా.

"కంగారూలో పరిశ్రమలా?"—అన్నాడు నామాట నమ్మ లేనట్లు.

"యస్! మీ దేశంలో కలప, విస్తారంగా ధొరుకుతుందని విన్నాను. అలాగే రబ్బరు. ఆధునిక యుగంలో కొన్ని ప్రత్యేక రకాలైన కలపకు, రబ్బరుకు విపరీతమైన వుపయోగాలు వున్నాయి. లాభసాటిగా ఇక్కడ వుత్పత్తి చేసే అవకాశం వుంటే, మీ ప్రభుత్వానికి, మాకు కూడా లాభదాయకంగా వుండేట్లు ఓ ఒప్పందానికి రావచ్చు."—అన్నాను.

అంతా విని చిత్రంగా భుజాలెగరేశాడు. "అదంతా పరిశ్రమల మంత్రికి, ప్రసిడెంటుకి సంభంధించిన విషయం. కాని ముందుగా కాంబోలో ప్రవేశించాలంటే టూరిస్ట్ టాక్స్ కట్టాలి?"—అన్నడు ట్రూమా.

"ఎవరికి? ఎక్కడ కట్టాలి?"—అన్నాను

"నాకే! నగరంలో కొచ్చే కొత్త వాళ్ళనందర్నీ సోదాచేసి, వాళ్ళ వల్ల ప్రమాదం లేదని మేము అనుమతి ఇస్తే తప్ప మిమ్మల్ని నగరంలో తిరగ నివ్వరు..."—అన్నాడు ట్రూమా.

"ఆల్‌రైట్! ఎంత?"—అన్నాను.

"వంద అమెరికన్ డాలర్లు"—అన్నాడు కెప్టెన్ ట్రూమా

# 3

కాంబో పట్టణాన్ని ఓ దేశానికి రాజధాని అంటే ఎవరూ నమ్మరు. మామూలు పట్టణంలా వుంది. రోడ్ల నిండా ఎక్కడ చూసినా రైఫెల్స్ పట్టు కొన్న సైనికులు తిరుగుతూ వున్నారు. దేశంలో ఎక్కడా సివిల్ అడ్మినిస్ట్రేషన్ వున్నట్టు కనిపించలేదు. ప్రసిడెంట్ తాలూకు టాక్స్ కలెక్టర్లు మాత్రం తమ ఇష్టం వచ్చినట్లు ప్రజల దగ్గర డబ్బు వసూలు చేసి, తాము మిగుల్చు కొన్నది మిగుల్చు కొని మిగిలింది ప్రసిడెంట్‌కు కడుతున్నారు.

ఊరు పెద్దగా వున్నా అన్నీ పాత ఇళ్ళే కనిపిస్తున్నాయి. కొత్త కట్టడాలనేవి లేవు. నేను అమెరికనన్ని చెప్పు కోవడం వలన, డబ్బు కాస్త విచ్చల విడిగా డాలర్లలో ఖర్చు పెట్టడం వలన, కంగారూలో పరిశ్రమలు పెడతానని చెప్పడం వలన. జనరల్ నిషాన్ ప్రభుత్వంలోని ముఖ్య ఉద్యోగులకు త్వరగానే పరిచయం అయ్యాను. ముఖ్య ఉద్యోగులు అంటే వాళ్ళు ఏవో కార్యాలు నిర్వహిస్తారని కాదు, తనను సపోర్ట్ చేసే మనుషులను నిషాన్ అలా నియమించాడు అంతే!

రెండు రోజులు వున్న తరువాత కంగారూలో నేను చూడవలసింది, తెలుసుకో వలసింది ఏమీ లేదనిపించింది. ప్రభుత్వ అధికారుల్లో, పరిశ్రమల మంత్రి అని పిలువబడే ఓ తునిష్ జాతి మృగంతో పరిచయాలు ఏర్పడం వల్ల, ప్రసిడెంట్ పాలస్ కూడా క్షుణ్ణంగా చూసే అవకాశం లభించింది. ఇదివరకు పోర్చుగీసు గవర్నరు బంగళానే ప్రస్తుతం అధ్యక్షుడి కార్యాలయంగా, నివాసంగా వాడు తున్నారు.

ప్రసిడెంషియల్ పాలస్‌కి ఓ అరమైలు దూరంలో 'కంగారూ' ఆర్మీ హెడ్ క్వార్టర్స్ భవనం వుంది. ఈ భవనంలోనూ, చుట్టూ వున్న మట్టితో కట్టినమిద్దెల్లాంటి బారకాసుల్లోనూ ఓ నాలుగు వందల మంది వరకూ సైనికులు వున్నారు.

కాంబో సముద్ర తీరాన వుండడం వలన, చిన్న రేవు కూడా వుంది. ఓడలు లోపలకి రాదగిన రేవుకాదు. కానీ లాంచీలు లాంటివి ఆపవచ్చు. కంగారూమొత్తం సైనికదళం వెయ్యి మంది కన్న ఎక్కువ వుండదని అంచానా వేశాను. నగరంలో వున్న ఆరు వందలూ కాక మిగిలిన వాళ్ళు, దేశం అంతటాన్నారవై ముప్పయిచొప్పున తిరుగుతూ పన్నులు

వసూలు చేస్తువుంటారట.

ప్రసిడెంట్ పాలస్‌ను స్వాధీనం చేసుకో గలిగితే, కంగారూ దేశం స్వాధీన మైనట్లే అనిపించింది. జనరల్ నిషాన్, దేశంలో తిరుగు బాటు మొదలయి నప్పటి నుండి పాలస్ వదలి బయట రావడం లేదు. పాలస్ లోపలే వున్న అండర్ గ్రౌండు జైలులో డాక్టర్ రసూలీ, అతని అనుచరులు బంధింపబడి వున్నారని తెలుసుకొన్నాను.

నగరం మొత్తం మీద పదంటె పది మోటారు వాహనాలు వున్నాయి. అందులో నాలుగు రెండవ ప్రపంచ యుద్ధం కాలంనాటి పాత ట్రక్కులు' ఒక్క జీపు, మిగతా వాటిలో రెండు ప్రసిడెంట్ కార్లు, మిగిలినవి ఉన్న రాధికారుల వాహనాలు. విమానాలు గాని, టాంకులు లాటివి గాని వున్నట్లు కనిపించ లేదు. పాలస్ ప్రహరీ గోడపైన మాత్రం 30 యమ్ యమ్ ఫిరంగి ఒకటి కనిపించింది. అది పని చేసే స్థితిలో వుందో లేదో చూసే అవకాశం నాకు లభించలేదు.

నా పరిశోధన పూర్తయిన తరువాత మిగిలిన నాలుగురోజులు, బయిటికి పోకుండా ప్రసిడెంట్ పాలస్‌లో నాకిచ్చిన గదిలో గడపాను. ఇక్కడ వున్న పరిస్థితుల్లో బయట తిరగడం అంతక్షేమం కాదనిపించింది.

వారం చివర ఏయిరో డ్రామ్‌లో డకొటాను చూసే ప్పటికి నాకు ప్రాణం లేచివచ్చింది. కంగారూ పరిశ్రమలు మంత్రి ఎయిర్‌పోర్ట్ బిల్డింగ్ వరకూ నాతోవచ్చాడు. ''మి.స్టర్ సింప్సన్! మీరు త్వరలోనే ఏదో పరిశ్రమ ఇక్కడ ఏర్పాటు చేస్తారని ఆశిస్తున్నాను, మరిచి పోకండి''— అన్నాడు నవ్వుతూ.

నేను పరిశ్రమ పెడితే ప్రతి ఏటా ఎవ్వరికీ చెప్పకుండా అతనికి పదివేల డాలర్లు మా కంపెనీ తరుపున ఇస్తానని ఆశపెట్టాను.

"తప్పకుండా! బహుశా వచ్చే నెలలోనే మా ఇంజనీర్లు పని ప్రారంబిస్తారు లెండి"—అన్నాను విమానం వైపు నడుస్తూ...

"మరి నా...."—గొణుగుతున్నాడు పరిశ్రమల మంత్రి. కోటు జేబులోనుండి పది వంద డాలర్ల నోట్లు బయిటికి తీశాను. అతని చేతులో పెడుతూ.

"మా కంపెనీ ఇక్కడ ఉత్పత్తి మొదలెడితే మీకు ఇంకా గిట్టుబాటవుతుంది"—అన్నాను, పరిశ్రమల మంత్రి ఆనందంగా నవ్వాడు, నేను డకోటా వైపు పరుగు తీశాను.

# 4

నారిపోర్టు రెండు, కాపీలుగా తయారు చేశాను. ఒక కాపీ మేడమ్ రసూలీ, రెండో కాపీ మిగిలిన ఇద్దరూ చాలా ఆతృతగా చదివారు. వాళ్లు చదువుతున్నంత సేపూ నేను వరసగాసిగరెట్లు తగలేస్తూ, స్కాచ్‌సిప్ చేస్తూ కూర్చున్నాను.

"కంగారూను స్వాధీనం చేసు కోవడం మీరు చెప్పినంత తేలిగ్గా జరిగి పోతుందా?"— ఆశ్చర్యంగా అడిగింది మేడమ్ రసూలీ

చిన్నగా తల వూపాను నవ్వుతూ."యస్ మాడమ్! కంగారూలో వుండే కొన్ని ప్రత్యేక పరిస్థితుల వల్ల అది సాధ్యమయ్యే అవకాశం వుంది. ఏ దేశంలో నైనా ఆర్మీ అంత ఘోరంగా వుంటుందని నేను ఇది వరకెప్పుడూ ఊహించలేదు. కంగారూలో వున్నది సైన్యంకాదు. తుపాకులు పట్టు కోవడం చాతెన ఓ దొంగల గుంపు, ఓ పర్ధకం

ప్రకారం, మెఱుపులా జరిగే ఆధునిక సైన్యం దాడికి వాళ్ళు తట్టుకో లేరు.''—అన్నాను.

''ఐమస్ట్ కాంగ్రాట్యు లేట్ యు కల్నల్ బాబీ! యుడిడ్ ఎ ఫైన్ జాబ్!''—అన్నాడు లుముంబా నవ్వుతూ నా వైపు చూసి,

''థాంక్ యు!'' అన్నాను గ్లాస్‌లో స్కాచ్ పూర్తి చేస్తూ.

''కల్నల్ బాబీ! ఇరవై మంది సైనికుల సహాయంతో మీరు జనరల్ నిషాన్ భవానాన్ని స్వాధీనం చేసుకొని, కంగారూని స్వాధీనం లోకి తేగలనంటూరా?''-అన్నాడు మెకెన్స్ సూటిగా,

''యస్! ఇటీజ్ పాజిబుల్! సరైన ఆయుధాలు, మందు గుండు, పథకంలోలా ఇరవై మందితో నేను ఆ పని చెయ్యగలను,''—

''ఎన్ని రోజుల్లో చెయ్యగలరు?''—

రోజులా? సారీ! రోజులో జరిగే పనికాదిది, కనీసం రెండు వెలల టైమ్ కావాలి?'' అన్నాను అతని అజ్ఞానానికి ఆశ్చర్య పోతూ.

''రెండు నెలలు ఎందుకు? ఇరవై మందికి ట్రైనింగ్ ఇవ్వడానికా?''—అడిగింది రసూలీ!

నేను మరో సిగరెట్ వెలిగించి వారందరి వైపూ క్షణంసేపు పరిశీలనగా చూశాను, ''నో మై డియర్ ఫ్రెండ్స్! ఆ ఇరవై మందికి నేనిచ్చే శిక్షణ ఏమీ వుండదు నాళ్ళందరూ ఇదివరకే అనేక యుద్ధాల్లో ఆరితేరిన సైనికులు—అంటే నాలాంటి మెర్సినరీలు' వాళ్ళను కలుసుకొని, సమీకరించడం పెద్ద పనికాదు. కాని మరో విషయం

మరిచి పోతున్నారు మీరు, యుద్ధానికి శిక్షణ పొందే సైనికులు ఎంత అవుసరమో పటిష్టమైన ఆయుధాలూ అంతే అవుసరం

అయుధాలు అంత తేలిగ్గా మనకు దొరకవు. ప్రపంచంలో గుర్తింపబడిన దేశమైతే తనకు కావలసిన అయుధాల్ని ఏ మిత్రదేశందగ్గరో, ఏ అగ్రరాజ్యం దగ్గరో, అప్పు మీదో, కాష్ టరవ్ప్‌మీదో కొనుక్కుంటుంది. దానికి ఏ రకమైన అభ్యంతరం ఎదురుపెట్టలేరు. కాని యుద్ధాల్లో వుపయోగించే మారణాయుధాలు మాములు వ్యక్తులకు అమ్మరు. వాటిని సంపాదించటం పైగా మనకు కావలసిన అన్ని రకాలయిన ఆయుధాలు ఒకచోటే వుండవు. వున్నా అమ్మరు. అంచేత ఈ రెండు నెలల్లో దాదాపు నలభైరోజులు ఆయుధసేకరణకే సరిపోతుంది''— నా మాటలు వింటుంటే మిష్టర్‌లుముంచా తెల్లగుడ్లు చిత్రంగా మెరిసాయి.

"అయితే మనకు కావలసిన ఆయుధాలేమిటి? వాటిని ఎక్కడ సంపాదించాలి?''—అన్నాడు మెకిన్స్ అతృతగా.

"సారీ ఫ్రెండ్! అయుధాలు ఎక్కడ దొరుకుతాయి, ఎలా దొరుకుతాయి, అనేది ట్రేడ్ సీక్రెట్. ఇక పోతే ఏ రకమైన ఆయుధాలు కావాలి అనేది మీ తరఫున యుద్ధం చేసే కమాండరు చెపుతాడు. మీరు నన్నింకా మీ తరఫున యుద్ధం చెయ్యమనలేదు ''— అన్నాను నవ్వుతూ.

మెడమ్ రసూల్ ఒకక్షణం చెయ్యి పైకెత్తింది. "ఆల్‌రైట్ కల్నల్ బాబీ! మీరు మా తరఫున కంగారూను స్వాధీనం చేసుకొంటారా? ''—

"ష్యూర్! ష్యూర్!''— అన్నాను ఉత్సాహంగా,' "నా రేటు మీకు తెలిసే వుండాలి ''—

" చెప్పండి !"—అన్నాడు మెకిన్స్.

మీా తరపున అన్ని పనులు నిర్వహించి, కంగారూను జయించడానికి మిగిలిన ఖర్చులుకాక నా ఒక్కడి జీతం......... వారానికి నాలుగువేల డాలర్లు అవుతుంది. "—అన్నాను.

" మిగతా ఖర్చులు ఏమిటి? "—

" ఆయుధాలు కొనడానికి డబ్బు, మిగతా మెర్సినరీలకు జీతాలు, ప్రయాణ ఖర్చులు మొ॥ "—

" అంటే అంతా ఎంతవుతుంది? "

మనసులోనే లెక్కలు వేశాను. " వన్‌మిలియన్ ట్వంటి థౌంజడ్ డాలర్స్ ! "—అన్నాను చివరికి.

" మైగాడ్ ! పదిలక్షల ఇరవైవేల డాలర్లు ! ఆ నోట్లన్ని టితో ప్రసిడెంట్ పాలస్ తగలబెట్టోచ్చు"—అన్నాడు లుముంబా!

నవ్వాను నేను" మైడీయర్ ఫ్రెండ్స్ ! నా జీతాన్ని మించి నేను ఒక డాలర్ ఎక్కువ తీసుకోనుబ్లాక్ మార్కెట్‌లో కొరికే ఆయుధాలు తక్కువ ఖరీదులో దొరకవు అలాగే మెర్సినరీలు చవగ్గా దొరకరు. "—అన్నాను.

" కాసేపు ప్రక్క గదిలో కూర్చోండి ! మేము చర్చించు కోవాలి "—అన్నది మేడమ్ రసూలీ.

నేను నవ్వుతూ ప్రక్క గదిలోకి నడిచాను. త్వరలో మలో యుద్ధం అనే భావం నరాల్లో ఏదో తెలియని ఉత్సాహన్ని పెంచుతుంది. అరగంట త్వరాత మళ్ళీ లోపలకు పిలిచారు నన్ను.

" ఆల్‌రైట్ కల్నల్ బాబీ ! మీాషరుతులకు మేము అంగీ కరిస్తున్నాము.

" రేపటినుండి అరవై రోజుల్లో కంగారూ దేశాన్ని స్వాదీనం చేసుకొని మాకు అప్పగించే బాధ్యత మీాది. వెంటనే

పని ప్రారంభించండి. ఇకనుండి మెకిన్స్ తప్ప మేమెవరమూ మీకు కనిపించం. డబ్బు విషయం మెకిన్స్ చూస్తాడు. లెటజ్ విష్ అవర్‌సెల్వ్స్ సక్సెస్ ''—అన్నది. మేడమ్ రసూలీ నాతో చేయికలుపుతూ...

''ఐ విష్ ది సేమ్ ''-- అన్నాను నవ్వుతు. ఆరోజు మార్చి పధ్నాలుగవ తారీఖు.

# 5

''ఆరోజు—మార్చి పదహారు—స్పెయిన్ దేశపు రాజధాని మాడ్రిడ్‌లోని పాలస్ హోటల్ రెస్టారెంట్‌లో సాయంత్రం ఆరుకావస్తోంది. వివిధ దేశాల్లోవున్న నా మెర్సినరీ మిత్రులు నలుగురికి వెంటనే బయలుదేరి నన్నిక్కడ కలుసుకోమని కబురు పెట్టాను.

దాదాపు పదంగుళాల పొడవున్న గ్లాసులోని షెర్రీని సిప్ చేసి టైమ్ చూసుకొన్నాను. అరయింది. బిల్లీమార్టిన్ నవ్వుతూ నా ముందుకొచ్చి కూర్చున్నాడు.

''హి బాబీ ! లాంగ్‌టైమ్ నోసీ !'' నా చేతిని పట్టుకొని ఊపేస్తూ అన్నాడు.

ఈ నాలుగేళ్ళలో బిల్లీమార్టిన్ ఏమి మారలేదు. కాస్త సన్నబడ్డాడు అంతే. ఆరడుగుల పొడవు.వెడల్పాయిన నుదురు సాఫీ జుట్టు' చిన్నకళ్ళు, చదరంగా వుండే దవడ ఎముకలు సూది ముక్కు, నవ్వుతు వున్నట్లుండే బిగించిన పెదిమలు... పందనయాపైసల అమెరికన్ బిల్లీమార్టిన్. కొరియా యుద్ధంలో కెప్టెన్‌గా మూడేళ్ళు వర్కుచేశాడు.

''హౌ ఆర్‌యు బిల్లీ !''— అన్నాను ఆప్యాయంగా అతనిచేతిని నొక్కుతూ.

''ఫైన్ ! ఏమిటి విషయం ! అర్జెంటుగా రమ్మని

కేబుల్ పంపించావు. ''—అడిగాడు. బిల్లీ సిగరెట్ వెలిగిస్తూ...

" నాట్ దట్ ఫస్ట్ ! తొందరలేదు. ! ఇంకా మనవాళ్ళు రావాలి...అందరూ వచ్చింతర్వాత చెపుతాను. ''—అన్నాను బేరర్‌కు మరో రెండు గ్లాసుల షెర్రీ తెమ్మని సైగ చేస్తూ.

" నో షెర్రీ ! షెర్రీ తాగితే జ్వరం వస్తుందినాకు... విస్కీ ఫర్ మి ! ''—బిల్లీ నవ్వుతూ అన్నాడు.

" ఇంకెవరు వస్తున్నారు? ఎనీ యాక్షన్? ''—

" మొజాస్కీ, డాబు, మార్క్...వస్తున్నారు. ఇక యాక్షన్ అంటావా...దే రీజ్ ప్లెంటీ అఫ్ ఇట్''—అన్నాను నవ్వుతూ...

పోలండ్ నుండి మొజాస్కీ, లండన్ నుండి మార్క్ సింప్సన్ వచ్చేప్పటికి పన్నెండు దాటింది. నా హోటల్ రూమ్‌లో నలుగురం సమావేశం అయ్యాము. లైలోజీ నుండి డాబూ అబ్రహామ్ రేపటిగ్గాని రాలేనని కేబుల్ పంపించాడు. చేతిలో టైమ్ ఎక్కువ లేదు గనుక వెంటనే ఎవరి పనులు వాళ్ళకు అప్పగించదలచుకొన్నాను.

" ఫ్రెండ్స్ ! థాంక్యూ వెరీమచ్ ! కబురుపెట్టగానే వచ్చినందుకు కృతజ్ఞుణ్ణి. టైమ్ వేస్ట్ చెయ్యడం అనవసరం గనుక ఉపోద్ఘాతం లేకుండా చెపుతున్నాను. వారానికి రెండు వేల డాలర్ల జీతం మీద రెండు నెలల పాటు పని చెయ్యడం మీకిష్టమేనా? ''—అన్నాను.

ఏంపనో వాళ్ళకు నేను వేరే చెప్పనక్కరలేదు. " ఎక్కడ? వివరాలేమిటి? ''—అడిగాడు మార్క్.

" సారీ ! ఇటిజ్ సీక్రెట్ ! చివరివరకు చెప్పను ! ''—

" అంత రహస్యమా? ''—

" అవును ! ఇష్టంలేని వాళ్ళ విమా ఖర్చులు, ఎలవెన్స్

తీసుకొని ఈ క్షణమె వెళ్ళిపోవచ్చు. !''—

గదిలో రెండు నిమిషాలపాటు నిశ్శబ్దం అలుముకుంది. చివరికి అందరూ మౌనంగా తలలు వూపారు. వారానికి రెండు నేలు మామూలుగా ఇచ్చేదానికన్న రెట్టింపని వాళ్ళకు తెలుసు.

''థాంక్స్! యాక్షన్ సరిగ్గా ఈ రోజునుండి రెండు నెల లోపల మొదలవుతుంది. ఈలోగా మీరు ముగ్గురూ చెయ్య వలసిన పనులు కొన్ని వున్నాయి. ఇన్స్ట్రక్షన్ వివరంగా మీకు తరవాత చెపుతాను. ''—ఎవ్వరూ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా సిగరెట్లు పీలుస్తూ వుండిపోయారు.

బల్లమీది బ్రీఫ్‌కేస్ తెరచి మూడువందల డాలర్‌నోట్ల కట్టలు బయటికి లాగాను. ముగ్గురి ముందు మూడు పెట్టాను.

''అవి ఒక్కొక్కరికి రెండు వారాల జీతాల అడ్వాన్సులు...'' అన్నాను. ముగ్గురూ మౌనంగా వాటిని లోపల పెట్టుకొన్నారు.

''రైట్! ఫస్ట్‌బిల్! నీవు ఉదయమే ఫస్ట్ ప్లేన్‌కి గ్రీస్ వెళ్ళాలి. పదిరోజుల్లోపున వర్కింగ్ కండిషన్లో వున్నది. కాని పాతదైన ఒక ఓడని కొనాలి. నువ్వు అన్నీచేసి పెట్టిం తరవాత నేను వచ్చి ఎమౌంటు చెల్లిస్తాను. పాతది, అనుమానం రాకుండావుండేది, కానీ తుఫానులనైనా తట్టుకొనే శక్తిగలది ముప్పై, నలభైమంది పట్టేదయితే చాలు. వీటికయ్యే ఖర్చులు ఎయిర్‌పోర్ట్‌లో 'ఎయిర్ ఫ్రాన్స్' కౌంటరులో వుంటాయి అన్నాను.

''మోజాస్కీ! నీవు మనకు కావలసిన ఆయుధాల, విషయం చూడాలి. యుగోస్లావియా మార్కెట్‌లో 'బజూకా' రాకెట్లు, గ్రెనేడ్ లాంచర్లు, గ్రెనేడ్లు కొనాలి.''—

"ఏవేవి ఎన్నికావాలి? యూజర్ సర్టిఫికేట్ ఎవరి స్తారు?"—అన్నాడు మొజాస్కీ.

"బజూకాలు ఓ ఇరవై కావాలి. గ్రెనేడ్ లాంచరు ఓ అర డజను గ్రెనేడ్స్ రెండుపుల్ బాక్స్‌లు. బెల్‌గ్రేడ్ ఆర్మనెంట్ స్టోర్స్‌లో దొరుకుతాయని నీకు తెలుసు. ఎండ్‌యుజర్స్ సర్టి ఫికేట్ మరో వారం రోజుల్లో నీకు పంపిస్తాను. ఏ విషయం నాకు వెంటనే తెలియాలి"—

"ఓకే!"—అన్నాడు మొజాస్కీ.

"రైట్! నౌ మార్క్! నువ్వు ఇటలీ వెళ్ళాలి, సెకండ్ వరల్డ్‌వార్ తాలూకు జర్మన్ 8 యమ్. యమ్. మెషిన్‌పిస్టల్స్ ఇంకా మార్కెట్‌లో వున్నాయని నీకు తెలుసు. మనకో వంద కావాలి. అమ్మ్యునేషన్‌తో సహా డెలివరీ నేపుల్స్‌లో ఇవ్వాలి. ఇవే నీ పని"—మార్క్ సింప్సన్ మౌనంగా తలవూపాడు.

"ఓకే ఫ్రండ్స్! మీరందరూ ఉదయమే బయలుదేరి వెళ్ళిపోండి. పదిరోజుల్లోపల నాకు ఈ విషయాలు తెలియ జేయాలి. ఎవ్వరికి ఈ విషయం తెలియకూడదు. అంతా రహ స్యంగా జరిగిపోవాలి. ఎవరడిగినా మీరు కేవలం ఏజంట్లుగానే వ్యవహరిస్తున్నామని చెప్పండి. మీదగ్గర నుండి రిప్లయిస్ రాగానే నేను ఎమౌంట్‌తో వచ్చి మిమ్మల్ని కలుసుకొంటాను. మీ రిప్లయిలు మ్యాడ్రిడ్ సెంట్రల్ పోస్టాఫీసుకు 'జానీస్మిత్' పేరున వ్రాయండి. స్టాండర్ట్ పి వన్ కోడ్ వాడండి. ఎనీ డౌట్స్?"—అన్నాను.

ఎవ్వరూ మాట్లాడలేదు.

"రైట్! గుడ్‌లక్!"—అన్నాను లేచి నిలబడుతూ.

## 6

ఉదయమే బ్రెక్‌ఫాస్ట్ చేసి ఒక్కసారి ఇంతవరకూ చేసిన

పనుల్ని నెమరువేసుకున్నాడు. అప్పుడే ఆరవై రోజుల్లో రెండు రోజులు అయిపోయాయి. సరిగ్గా ఈరోజునుండి యాభై ఎని మిదవ రోజునకాంబోలో ప్రసిడెన్షియల్ పాలస్ స్వాధీనం చేసు కోవాలి. ఈ రోజు మార్చి పదిహేడు. మార్చి 27కల్లా వాళ్ళ ముగ్గురి దగ్గర్నుండి జవాబు వస్తుంది. ఏప్రిల్ ఇరవై లోపున అన్ని వ్యవహారాలు పూర్తిచెయ్యాలి. స్పెయిన్ నుండి కంగారూ ఓడమీద వెళ్ళడానికి కనీసం ఇరవై రోజులు పడు తుంది. అంటే మే పదికల్లా కంగారూ సరిహద్దుల్లో వుండాలి. ఆ అయిదు రోజులు సెక్యూరిటీ టైము. ఏ కారణాల వల్ల నయినా ఆలస్యం జరిగితే ఈ అయిదు రోజులు సేఫ్టీమార్జిన్ గావుంటాయి.

టెలిఫోన్ మ్రోగింది. ఎయిర్‌పోర్టునుండి డాబూ అబ్రహామ్ ఫోన్ చేశాడు. వెంటనే హోటల్‌కు రమ్మని చెప్పాను.

డాబూ అబ్రహామ్ ఆఫ్రికన్ అని అతని నీగ్రోయిష్ ముఖ లక్షణాలు చూస్తే అర్థమవుతుంది. కాంగో యుద్ధంలో నాకమాండ్‌లో సెకండ్ లెఫ్టినెంట్‌గా వుండేవాడు. ఆరడు గుల నాలుగంగుళాలు పొడుగు విశాలమైన బాడి కండలు తిరి గిన శరీరం ఇచ్చిన ఆజ్ఞను తు. చ. తప్పకుండా నేర్పుగా, చురుగ్గా చేసుకుపోగల ప్రజ్ఞవుంది డాబూకు. కాంగో యుద్ధం అయిపోయింతరావాత, కుచియాలోనూ, నికియాలోనూ, వాడి షియాలోనూ నూనెగనుల కంపెనీలకు, వజ్రాలగనులకూ, ప్రయివేట్ అర్మీలు తయారుచేసి, వాళ్ళకు ట్రైనింగ్ ఇస్తు న్నాడు. గదిలోకి రాగానే నవ్వుతూ స్మార్ట్‌గా సెల్యూట్ చేశాడు నాకు.

"హలో కల్నల్! ఏమిటి హడావిడి? మళ్ళీ యుద్ధమా?" అన్నాడు జబ్బలు చరుచుకొంటూ నా

ముందున్న సోఫాలో కూలబడుతూ.

"అవును!"—అన్నాను షెర్రీపోసి అందిస్తూ.

"ఫైన్ థాంక్యూ!"—అన్నాడు డ్రింక్ అందుకొంటూ

డ్రింక్ తీసుకొంటూ విషయాన్ని చెప్పాను. మిగిలిన వాళ్ళకు చెప్పినట్లే. రెండు వారాల జీతం తీసి అతని ముందు పెట్టాను.

"అయామ్ రడీ!"—అన్నాడు నోట్లను ప్యాంటు జేబు లోకి తోసేస్తూ.

"రైట్ డాబూ! నువ్వు చేయాల్సిన పని ఒకటుంది. నీవు తప్ప ఎవరూ చేయలేరు. కనుకే నీకు అప్పగిస్తున్నాను. మనతో పాటు ఆపరేషన్లో పాల్గొనడానికి ఓ పదిహేను మంది సురక్షితులైన సైనికులు కావాలి. ఆఫ్రికన్లయితే మరీమంచిది. నీ ప్రయివేట్ ఆర్మీలో మనకు పనికొచ్చేవాళ్ళను తీసుకురాగలవా?"—

డాబూ నా వైపు నవ్వుతూ చూసాడు. అతని నల్లని ముఖంలో తెల్లని పళ్ళు చిత్రంగా కనిపిస్తున్నయ్.

"నో ప్రాబ్లమ్! జీతం ఎంత?"—

"మే ఫస్ట్‌కు వాళ్ళు మనకు కావలసి వుంటారు. అప్పటినుండి మూడు వారాలు. మూడు వారాలకు త్రీ థౌసండ్... ప్లన్ పని సక్సెస్ అయితే మీకు రెండువేలు బోనస్. పేమెంటు డాలర్లలో..."—

"ఆ రేటున కొన్నివందల మందిని తేగలను!"—అన్నాడు నవ్వుతూ.

"ఐ వాంట్ ఓన్లీ ది బెస్ట్! కమాండ్‌కు లోబడే వాళ్ళే కావాలి"—

"డాబూ ట్రైయినింగ్ అంతా తేలిగ్గా చూడకు కల్నల్!"—అన్నాడు డాబూ నవ్వుతూ.

"నెవర్‌మైండ్! వాళ్ళకు అడ్వాన్సులు ఇవ్వడానికి కావలసిన డబ్బు, నీ ఖర్చులకి రెండ్రోజుల్లో నైరోబి బాంక్‌లో వుంటుంది. మనిషికి అయిదొందల చొప్పన అడ్వాన్సు ఇయ్యి. నే ఒకటికి నైజీరియాలోని 'లాగోస్'రేవులో అందర్నీ సిద్ధం చెయ్యి."—అన్నాడు మనసులోనే లెక్కలు వేసుకొంటూ.

డాబూ అబ్రహామ్ వెళ్ళిపోయాక టాక్సీ తీసుకొని మాడ్రిడ్ డ్రస్‌మేకర్స్ స్ట్రీట్‌కు వెళ్ళాను. ఆర్మీ అండ్ నేవీ స్ట్రీట్ మధ్యలో ఓ పెద్ద బిల్డింగులో వుంది. షాపులోకి వెళ్ళి తిన్నగా మెనేజరు రూమ్‌లోకి వెళ్ళాను.

"ఈ సైజుల్లో ఓ వంద ఖాకీయూనిఫారమ్‌లు కావాలి. ఓ నలభై హేట్స్ ఫరేషేడ్, నలబై జతల బూడ్సులు, బెల్టులు కావాలి"—అన్నాను లిస్ట్ అతని ముందు పెడుతూ.

నేనిచ్చిన పొడుగాటి లిస్ట్ చూడగానే అతనికి నా మీద ఎక్కడ లేని గౌరవం పుట్టుకొచ్చింది. అతివినయంగా నన్ను పలకరించడం మొదలుపెట్టాడు.

"ఇవన్నీ మాదగ్గర రడీమెడ్‌గా వున్నాయి సార్! వెంటనే తెప్పిస్తాను!"—అన్నాడు.

"నో! నాకు ఆర్డర్‌మేడ్ కావాలి! స్పెషల్ స్టిచ్చింగ్ విత్ ఎక్స్ట్రా పాకెట్స్. షర్ట్‌ఛాతికి, బుజాల దగ్గరా డబుల్ లైనింగ్ వేసి కుట్టాలి"—అన్నాను.

"ష్యూర్ సర్! కాని ఖరీదు కాస్త ఎక్కువవుతుంది,"—

"నెవర్‌మైండ్! ఎప్పటిలోగా ఇవ్వగలరు?"

"హోమ్ డెలివరి కావాలా? లేక మీరేవచ్చితీసు కెళతారా?

"నో...నేను మళ్ళీరాను. పదిరోజుల్లో మొత్తానికి నీ

బాంక్‌లో డబ్బు కట్టేస్తాను. ఏప్రిల్ ఇరవైకల్లా ఫ్రాన్స్‌లోని మెర్సెల్లీడ్ పోర్టుకు వాటిని పంపించాలి.''—

మేనేజరు నా వైపు ఆశ్చర్యంగాచూసాడు. "అలాగేసర్''— అన్నాడు వినయంగా.

అక్కడనుండి బాంక్‌కువెళ్ళి, తరవాత తిన్నగా ఎయిర్ పోర్ట్‌కు వెళ్ళాను. రెండుగంటలకు ఎయిర్ ఫ్రాన్స్ కార్‌వెల్లీ సర్విస్ వుంది ఫ్రాన్స్‌కు. ఒక ఫస్ట్‌క్లాస్ టికెట్ బుక్ చేసుకొని రెస్టారెంట్‌లోకి వెళ్ళి కూర్చున్నాను. ఆలోచిస్తూంటే మే 15కి పనులన్నీ చెయ్యగలనా అని అనిపిస్తోంది.

ఫ్రాన్స్ చేరుకొనేప్పటికి అయిదయింది. ఎయిర్‌పోర్ట్ నుండి తన్నగా పారమౌంట్ స్ట్రీట్‌కి వెళ్ళాను.

'డిఫ్రాంకొ బొట్స్, — నే నాగిన బిల్డింగ్ ముందు కట్టిన బోర్డుమీద పెద్ద పెద్ద అక్షరాల్తో వ్రాసివుంది. స్వింగ్‌డోర్సు తోసుకొని లోపలకు వెళ్ళాను.

పెద్ద ఎయిర్ కండిషన్‌హాలు... కాళ్ళక్రింద కాశ్మీర్ ఉన్నితివాసీ మెత్తగా తగుల్తోంది. హాలు గోడల చుట్టూ ప్రత్యేకంగా అమర్చిన స్టాండ్లమీద రకరకాల మోటారుబోట్ల మీనియేచర్ మోడల్సు పెట్టివున్నాయి.

"కెన్ ఐహెల్ప్‌యు మాంసుయర్?''— అన్నాడోవ్యక్తి నాముందుకు వచ్చి.

"ష్యూర్! మీడియం‌సైజ్‌లో, వేగంగాపోగల బోట్ కావాలి!''— అన్నాను.

ఓ మూలగావున్న బోట్ మోడల్సు దగ్గరకు. తీసుకెళ్ళాడు నన్ను.

"దిసీజ్ ప్రాకొస్టార్ 202 మోడల్, మీడియం‌సైజు. పదిహేను అడుగుల పొడవుంది. తేలిగ్గా ఎనిమిదిమందిని ఎకామ

డేట్‌చేస్తుంది. ఇంజన్— మెర్సిడిస్ పోర్‌హార్స్ పవది డ్రైవింగ్ కాబిన్‌లోను, సెలూన్‌లోనూ రెండు స్లీపింగ్ బంక్సు కూడా వున్నాయి...''— అన్నాడు.

''నో! నాకు అవుట్‌బోర్డు ఇంజన్ వున్న బోట్ కావాలి. సెలూన్ అక్కరలేదు· ఇంజన్ ఎక్కువ సౌండ్‌రాగూడదు. అండర్‌వాటర్ సౌండ్ మఫ్‌లరీలు ఫిట్‌చేసి వుండాలి,''— అన్నాను.

''ఓ ఎస్! అయితే ఇలారండి!''— అని మరో మోడల్ దగ్గరకు తీసుకెళ్ళాడు ''జెనిత్ 1200— లేటెస్ట్ మోడల్ లైట్ మోటార్‌బోట్... కాని మీడియంకాదు. చిన్నది. అయిదుగురికన్న ఎక్కువ పట్టరు''—

నేను బోట్‌మోడల్ వంక పరీక్షగా చూశాను. చాలా సింపిల్‌గావుంది. అంతా డ్యూరబుల్ ప్లాస్టిక్‌తో చేసినది. ఎక్కడ కొయ్యనాడలేదు. బిన్నచుక్కాని, పుట్‌బోర్డు మీద ఇంజన్‌కు పెట్టివున్నాయి. డ్రైవరుసీటుకాక బాడీలో మరొక నాలుగు సీట్లువున్నాయి.

'' ఇంజన్ పెర్‌ర్మెక్స్ ఎలావుంటుంది?''—

''ఎక్సలెంట్! క్రిబ్లర్‌త్రా పాయింట్‌ఫైన్. అండర్ వాటర్ ఎగ్జాస్ట్‌లు, సౌండ్‌మఫ్‌లరీలు అమర్చివున్నాయి''— అన్నాడు అతను.

''ధరఎంత?''—

''టెన్‌థౌసండ్ డాలర్స్,''— అన్నాడతను ఎంతో కారు చవకయినట్లు.

''డెమాన్స్ట్రేషన్ ఇవ్వగలరా?''— అడిగాను.

సేల్స్‌మెన్ ముఖం దీవిటిలా వెలిగింది. ''ష్యూర్‌సర్! మీకు ఎక్కడ డెలివరీ కావాలి?''—

"మేర్సెల్లీస్‌లా! ఎప్రిల్ ఇరవై కల్లా కావాలి,"—

"తప్పకుండాసార్! గివ్‌యువర్ బాంక్‌రిఫరెన్స్"— అన్నాడతను నన్ను లోపల ఆఫీస్‌లోకి తీసుకెళుతూ...

"డోన్ట్‌వర్రీ! డిమాన్ స్ట్రేషన్ ఏర్పాటు చెయండి వెంటనే"— అన్నాను కుర్చీలో కూలబడుతూ...

రెండు గంటల తర్వాత జినిత్ 1200 మీటర్ బోటుకు ఆర్డరిచ్చి బయట పడ్డాను.

# 7

"హలో కల్నల్! ఎంతవరకూ వచ్చాయి మీఏర్పాట్లు?"— అడిగాడు మెకిన్స్ నవ్వుతూ.

"దాదాపు పూర్తయినట్లే! రేపు బయల్దేరుతున్నాము కంగారూకు. నేను సేకరించమన్న విషయాలు తెలుసుకున్నారా?"— అడిగాను సిగరెట్ వెలిగిస్తూ.

సమాధానంగా నవ్వి తలవూపి బ్రీఫ్‌కేస్‌లోనుండి కొన్ని కాగితాలు బయటకు తీసివారికిచ్చాడు.

కాంబోలో నైట్‌లైఫ్ ఎమీవుండదు. వున్న ఒక్క నైట్ క్లబ్‌ని, వేశ్యాగృహాల్ని సైనికులు, ప్రభుత్వాధి కారులు తప్ప ఎవ్వరూ ఉపయోగించరు. రాత్రి పన్నెండు దాటింతరువాత పాలస్ కాపలాసైనికులు, ఆర్మీహెడ్ క్వార్టర్స్ సెంట్రీలు తప్ప ఎవ్వరూ మేలుకొనివుండరు."

"గుడ్! వెరీగుడ్!"— అన్నానుతలవూపుతూ.

"మరి పాలస్‌మీరు స్వాధినం చేసుకొన్నట్లు మాకెలా తెలుస్తుంది?"—

"పాలస్ స్వాధీనం చేసుకోగానే, పాలస్‌తోపాటు అక్కడ వున్నరేడియోస్టేషన్ కూడా మావశమవుతుంది అనే విషయం

మరిచిపోకండి. జనరల్ నిషాన్‌ను బందీచేయగానే కంగారూ రేడియోలో షార్ట్‌వేవ్ తర్టీపాయింట్ ఫైవ్‌మీదడాక్టర్‌రసూలీ ఆధ్వర్యంలో విప్లవకారులు రాజ్యాధికారం హస్తగతం చేసుకొన్నారని ప్రకటిస్తాము. అలాకుదరక పోతేమాషిప్‌లోవున్న రేడియో ద్వారా అదేవేవ్‌లెంగ్త్ మీద మెసేజ్ట్రాన్స్మిట్ చేస్తాము.''—

''వెల్! మే పద్నాలుగు అర్ధరాత్రి దాటిన దగ్గర నుండి మెసేజ్‌కోసం ఎదురు చూస్తూ జాంబియా పోర్టులో వుంటాము. మీ మెసేజ్‌అందంగానే చార్టర్డ్ ఎయిరోప్లేన్‌లో వెంటవే బయలు దేరి వచ్చేస్తాము''—

''షూర్!''— అన్నాను సిగరెట్ ఆర్పేస్తూ.

''గుడ్‌లక్ అండ్ గ్రాండ్‌సక్సెస్!''— అన్నాడు మెకిన్స్ లేచినిలబడి చెయ్యి చాపుతూ. ఆరోజు ఏప్రిల్ పందొమ్మిది!

# 8

ఫ్రాన్స్‌లోని మెర్సెల్లీస్ రేవునుండి ఐ.యస్. జిబ్రాల్టర్ బయలు దేరేప్పటికి చీకటి పడడం మొదలు పెట్టింది.

ఐ. యస్. జిబ్రాల్టర్ ఒక గ్రీన్‌షిప్పింగ్ కంపెని నౌక. ఓర్లీ దాన్ని మూడులక్షల డాలర్లకు కొన్నాడు. పైకిపాతగా, ముప్పఏళ్ళక్రితం మోడల్‌లా కనిపిస్తోన్నా. ఇంజన్‌ను ఎప్పుడగా సరైన పద్ధతిలో మెయిన్‌టైన్ చేయడంవలన, ఏట్రబుల్ లేకుండా కదుల్తుంది. మాక్సిమమ్, పన్నెండ్ నాట్స్ స్పీడు వస్తోంది, కంగారూను ఇరవై రోజుల్లో చేరుకోవడానికిఆమాత్రం వేగంవున్న ఓడ చాలుమాకు.

ఓడ ప్రక్కలమ్మటె నేను కొన్నఅయిదుజెనిత్ 1200 మోటారు బోట్లు కట్టేశాము. డబ్బుకొసం ఏపనయినాచేసే కెప్టెన్‌జార్జ్ మాకుదొరకడం ఓరకంగా అదృష్టమని చెప్పాలి.

ఎక్విప్‌మెంట్ అంతా లోడ్‌చేసింతరువాత జయప్రదంగా బయలుదేరాము.

"డాబూ ఎక్కడ కలుసుకొంటాడు మనల్ని?"— అడిగాడు మొజాస్.

"లాగోస్‌లో!"— అన్నాను నవ్వుతూ.

"మై గాడ్ నైజీరియా అన్నమాట?"— అన్నాడు మార్క్ ప్రశ్నార్థకంగా.

"నో! స్టిల్ ఇటీజె సీక్రెట్! డెస్టినేషన్ అప్పుడే చెప్పను లాగోస్‌లో డాబూ మరో పదిహేను మంది బ్లాక్ సోల్జర్లతో వస్తాడు. అంతే!"—

ఓడ లాగోస్ చేరుకొనేప్పటికి దాదాపు పన్నెండు రోజులు పట్టింది. మే మూడవ తారీఖు ఉదయం నైజీరియా సముద్ర జలాల బయట లంగరువేశాము. మొజాస్ ఓ మోటారుబోట్ తీసుకొని రేవులోకి వెళ్ళాడు. దాదాపు రెండుగంటల తరువాత నలుగురు నీగ్రోసైనికులతో తిరిగొచ్చాడు. ఆ తర్వాత ట్రిప్‌లో మూడుబోట్లూ పంపించి డాబూతోసహా మిగిలినసైనికుల్నందర్నీ జిబ్రాల్టిర్‌లోకి తీసుకొచ్చేశాము. సంఖ్య పెరిగిన కొదీ ఓడ కళకళ లాడుతుంది.

"పర్మిట్ లేకుండా వీళ్ళందర్ని బయటకు తేవడానికి పోర్ట్‌కంట్రోలర్‌కి మనిషికి వందడాలర్ల చొప్పున లంచం ఇవ్వాల్సి వచ్చింది!"— అన్నాడు డాబూ నవ్వుతూ.

వెంటనే లంగరు ఎత్తి ప్రయాణం మొదలుపెట్టాము. ఓడ కెప్టెన్ జార్జికి కూడా మేము ఎక్కడికి వెళ్ళాలో చెప్ప లేదు నేను. ఆఫ్రికాతీరంవెంటే, తీరానికి నలభై మైళ్ళ దగ్గరిగా పోనిస్తూవుండమని చెప్పాను. ప్రతి నాలుగ్గంటలకు ఏప్రాంతంలో వున్నదీ తెలియజేయమని చెప్పాను.

మే పదవతారీఖు; కంగారూ ఇంకో రెండువందల మైళ్ళలో వస్తుందని అంచనా వేశాను. ఇంతకాలం అందరూ ఓడమీద సుఖంగా విశ్రాంతి తీసుకొన్నారు. తెచ్చిన ఆయుధాలను పరీక్షించి, కాస్త ఆ వచ్చిన సైనికుల శక్తియుక్తులు తెలుసు కోవాలిక. తనసైనికుల బలాబలాలు తెలియని నాయకుడికి అపజయం తప్పదనే యుద్ధ ధర్మం నేను మరిచిపోలేదు. అందుకే ఓడను నడిసముద్రంలో ఆపించి అందర్నీ సమావేశ పరిచాను. ఓడ సిబ్బంది తప్ప అందరూ పోర్ట్ డెక్ మీదకు వచ్చారు.

కాకియూనిఫాంలో సైనికులందరూ అటెంషన్‌లో నిల బడ్డారు. అందరికన్నాముందు సీనియర్ ఆఫీసర్ బిల్లీమార్టిన్ నిలబడ్డాడు. బిల్లీవెనకాల వరసగా డాబూ, మొజాన్కా, మార్కా లు నిలబడ్డారు. వాళ్ళ ముగ్గురి వెనకా పదిహేను మంది నీగ్రో సోల్జర్సు నిలబడ్డారు. కమాండింగ్ ఆఫీసర్ స్థానంలో వాళ్ళకు ఎదురుగా నేను నిలబడ్డాను. కంగారూ రాజ్యభవిషత్తు మా ఇరవై మంది చేతుల్లో వుందంటే చాలా మంది నమ్మలేరు.

బిల్లీమార్టిన్ స్ట్రెంగ్త్ రిపోర్ట్ ఇచ్చింతరువాత, సైనిక వందనం జరిగింది. తరువాత మిగతా వాళ్ళనుద్దేశించి మాట్లాడాను నేను. కొన్నికారణాలవల్ల మేము ఎక్కడికెళు తున్నామో ప్రస్తుతం చెప్పలేనని, బహుశా రెండురోజుల్లో ఎక్కడ యుద్ధంచేయాలి, ఎలాచేయాలి, పథకం ఏమిటో చెపుతానని చెప్పాను. తరువాత చాలాసేపు ఆయుధాల టెస్టింగ్‌తో గడిచిపోయింది.

ఆఫీసర్లతోసహా సైనికులందరికీ తలా ఒక మెషిన్ పిస్టల్ ఇచ్చాను.

జర్మన్ మాసుయర్ ఆటోమాటిక్ ఎయిట్ ఎమ్. ఎమ్

మెషన్ పిస్టల్, చిన్నసైజు మెషిన్‌గన్ లాంటిది. గురిచూసి కాల్చడానికి, మోసుకెళ్ళడానికి చాలా అనువుగావుంటుంది. అయిదువందల మీటర్లవరకూ గురిచూసి కాల్చొచ్చు. ఎఫెక్టివ్ రేంజ్ ఒక కిలోమీటరు.

అందరూ ఆయుధాలు వుపయోగించడం తెలిసినవాళ్ళు కావడంవలన సైనికులకు ట్రైనింగ్ ఇవ్వడానికి పెద్ద కష్టమేమీ కాలేదు. పైగా రికాయిల్‌లెస్‌గన్ కావడంవలన గురిచూసి కాల్చడం కష్టమేమీకాలేదు. కాని ఆయిల్ డ్రమ్ముల్ని ఓడ డెక్‌చివర నిలబెట్టి వాటి మీద టార్గెట్ ప్రాక్టీస్ చేశాము. నాలుగైదు మాగజైన్ల గుళ్ళు కాల్చేప్పటికి దాదాపు అందరికీ గన్ ఎలా హాండిల్ చెయ్యాలో అర్థమయి పోయింది.

తర్వాత గ్రెనేడ్‌లాంచర్లు డెక్‌మీద అరేంజ్‌చేశాము. రెండు ఆయిల్ డ్రమ్ముల్ని నీళ్ళలోకి తోసి ఓడనుండి దాదాపు అయిదు వందల గజాలవరకూ కొట్టుకెళ్ళేట్లు చేశాము. గ్రెనేడ్‌లాంచర్లు ఉపయోగించడంలో మార్క్ గొప్ప ఎక్స్‌పర్ట్. తనతోపాటు సహాయానికి మరో ఇద్దరు నీగ్రో సైనికుల్ని తీసుకొన్నాడు.

గ్రెనేడ్‌లాంచరు చూడ్డానికి మోటారు స్పేర్‌వీల్‌మీద మూడంగుళాల వ్యాసంగల నీటిగొట్టం బిగించినట్లు వుంటుంది. గ్రెనేడ్లను ఈ గొట్టంలో వేసి ఫిరంగి గుళ్ళలాగా కాలుస్తారు దూరంనుండి శత్రువుల మీదకు. గ్రెనేడ్లు విసరడానికి ఇది బాగా ఉపయోగపడుతుంది.

దూరానికి సరిపడా లాంచింగ్ ట్యూబ్‌ని అడ్జెస్ట్ చేసి పుష్‌హాండిల్ నొక్కాడు. జుయ్‌మన్న శబ్దం వచ్చింది. మార్క్ సిప్సన్ ప్రయోగించిన మొదటి గ్రెనేడ్ ఆయిల్ డ్రమ్ముకు సరిగ్గా మధ్యలో పడింది. పెద్ద శబ్దంతోపాటు ఆయిల్ డ్రము

క్షణాల్లో కనుమరుగయి పోయింది.

చూస్తున్న అందరూ ఉత్సాహంగా చప్పట్లుకొట్టారు.

''వెల్‌డన్ మార్క్స్! కెప్టెన్!''— అరిచాను వుత్సాహంగా.

మార్క్స్, మిగిలిన ఇద్దరు స్ట్రగాలు కలిసి మరో పాతిక గ్రెనేడ్లు కాల్చారు.

'జాజూకా' రాకెట్లు చిన్న సైజు సర్‌ఫేస్‌టు, సర్‌ఫేస్ ఎటాక్ రాకెట్లు శత్రుస్థావరాన్ని గురిచూచి కాల్చడానికి క్షణాల్లో భస్మీపటలం చెయ్యడానికి చాలా అనువుగావుంటాయి. దాదాపు పదమూడంగుళాల వ్యాసం కలిగివుంటుంది మధ్యలో కొనలో నైట్రోగ్లిజరిన్, పాదరసం కలిసిన ద్రవం వుండడం వలన టార్గెట్ డార్గెట్ కు తగలగానే ఆవస్తువు తునాతునకలయి నామరూపాలు లేకుండా పోతుంది. మామూలుగా యాంటీటాంక్ వెపన్‌గా వుపయోగిస్తారు వీటిని.

మొజాస్కీ నవ్వుతూ నాలుగురాకెట్లను లాంచింగ్ పాడ్ల మీద అమర్చాడు.

మొదట మాక్సిమమ్‌రేంజ్ టెస్ట్‌చేద్దాం— అన్నాడు లాంచింగ్ పాడ్ నుడెక్ మట్టానికి నూట అరవై డిగ్రీల కోణంలో బిగిస్తూ.

మొజాస్కీ ఎప్పుడు లాంచిచే వీల్ త్రిప్పాడో తెలియదు మాకు స్ర్ మన్నధ్వని, పాడ్‌మీద ఎర్రమంట, తెల్లనిపొగకనిపించాయి. అరనిమిషం గడిచింది, దాదాపు రెండు కిలోమీటర్ల అవతల పెద్ద ప్రేలుడు ధ్వని వినిపించింది.

''వెరీఫైన్''— అన్నాడు మొజాస్కీ నవ్వుతూ...

మేరు రెండు రోజాలు ఇలాగే డార్గెట్‌ప్రాక్టిస్ చేసిం తరువాత మళ్ళీ బయలు దేరాము. బయలుదేరిన అరగంటకి అందర్నీ షిప్‌సెలూన్‌లో సమావేశపరచి మేము ఎక్కడికి వెళ్ళు

తున్నది, ఎందుకు వెళ్ళుతున్నది చెప్పాను.

అందరి ముఖాల్లో ఒకక్షణం ఆశ్చర్యం కనిపించింది.

"కాంబో ఇంకా నూట ఎనభై మైళ్ళువున్నది. పదిహేను కన్నాముందే మనం అక్కడికి చేరుకొందాము"— కెప్టెన్ బార్బ్య,

"అవునా. పదిహేనువరకూ కాంబోరేవును తిన్నగా సముద్రంలో నలభై మైళ్ళ దూరంలో లంగరువేసి వుందాము. సమశీతోష్ణ ప్రదేశంలోనుండి వచ్చినమనం, కాస్త ఆ వేడి ప్రదేశానికి అలవాటు పడాలి. సరిగ్గా పదిహేనున మనం దాడి ప్రారంభించాలి... అంటే పధ్నాలుగు అర్ధరాత్రిదాటింతరువాత అన్నాను ఉత్సాహంగా జబ్బలు విరుచుకొంటూ.

# 9

"ఇదీ పథకం!"— అన్నాను కాంబోను వశపరుచు కొవ డానికి నాసైనిక్య వ్యూహాన్ని వాళ్ళనలుగురికీ వివరించిముగిస్తూ.

"ఫాంటాస్టిక్!"— అన్నాడు ఓల్గ...

"నో! ప్రాక్టికల్! నో! మీగడియారాలు సరిగ్గా దిద్దుకొండి ఎనిమిదన్నర అయ్యింది."— అన్నాను

వాళ్ళు నలుగురూ తమ వాచీల్ని సరిదిద్దుకొన్నారు.మళ్ళీ సర్దుపెట్టుకోండి. ఒంటి గంటలల్లా మనం మోటార్ బోట్లలో బయలు దేరాలి. మినిమమ్ స్పీడ్. ఏమాత్రం శబ్దం రాకూడదు. రెండు గంటలకల్లా కాంబోరేవు ఒడ్డుకు చేరు కోవాలి.

మొజాస్కీ! నీవు బోటుదిగిన వెంటనే నీ రాకెట్ లాంచిగ్ పాడ్అమర్చుకొని రడీగావుండు. మార్కో! నీవుకూడా కాస్త ఊలోకినడవాలి. రేవు ప్రక్కనే నడిస్తే ఓ అరమైలు దూరంలో కాస్త ఎత్తయినదిబ్బ మీదకట్టిన ఓ పాడుబడ్డ భవనంవుంది. నీ నాలుగు గ్రెనేడ్లాంచర్లు అక్కడ బిగించు. రెండు

ప్రెసిడెంట్ పాలెస్ మీదికి రెండు ఎయిర్‌పోర్ట్ మీదికి గురి చెయ్యి.

మొజాస్కీ మొదటి రాకెట్ కరెక్ట్‌గా రెండున్నరకు పేలుస్తాడు. ఆ రాకెట్ శబ్దం వినంగానే నీవు గ్రెనైడ్లు వదలడం మొదలుపెట్టు!

బిల్లీ అండ్ డాబూ మీ ఇద్దరివెంట చెరోక అయిదుగురు సైనికులు వుంటారు. బిల్లీ నీవు హెడ్‌క్వార్టర్స్‌లోని సైనికులు పాలస్‌వైపురాకుండా అరికట్టాలి. డాబూ నీవు ఎయిర్‌పోర్ట్ నుండి చావగా మిగిలిన వాళ్ళు పాలస్‌వైపు రాకుండా ఆపాలి.

రైట్! నెక్స్ట్! మార్క్ నువ్వు హాండ్‌గ్రెనేడ్లు వదలటం పూర్తవ్వగానే మిగతా వాటితో, నీ సైనికులతో నన్ను వచ్చి పాలస్ ముందు కలుసుకో. అలాగే మొజాస్కీ నువ్వు గూడా! పదిరాకెట్లు కాల్చడం అయ్యాక నాదగ్గరికి వచ్చేయి. ఏమైనా అన్‌డిస్పాట్ మార్పులుంటె వైర్‌లెస్‌లో చెపుతాము... ఓ. కె..."— అన్నాను గోడమీద వేసిన కాంబో మేప్‌మీద వివిధ స్థలాలు చూపెడుతూ.

అందరి ముఖాలోన్నూ ఒరకమైన టెన్షన్ కనిపిస్తోంది.

ఓ. కె!"— అన్నారు నలుగురూ.

ఆపరేషన్ కంగారూ అమలుపర్చడానికి ఇంకా అరుగంటల వ్యవధివుంది.

# 10

రాత్రి ఒంటి గంటయింది. కంగారూ సముద్రతీరం జిబ్రాల్టర్‌కు అయిదుమైళ్ళ దూరంలో వుంది. చకచక అందరం మోటార్ బోట్లలోకి దిగాము. సైనికులందరికీ ఒక్కొక్కళ్ళకి రెండేసి మిషన్ పిస్టల్స్ ఇచ్చాను. యుద్ధంలో ఒకటి జామ్ అయితే రెండోది పనికొస్తుందని. బిల్లీ దళం

మరోరెండు కేసులు తీసుకొన్నారు.

మొజాస్కీ, మార్క్‌లు ఇద్దరూ చెరోకబోటులో తమ ఆయుధాల్తో ఎక్కారు. మెల్లిగా చలా తక్కువ స్పీడ్‌తో కాంబో రేవుకేసి బయల్దేరాము.

"గుడ్‌లక్ ఫ్రెండ్స్"– అరిచాడు పైనుండి జార్జి....

జీనిత్ 1200 మోటారుబోట్లు నిశ్శబ్దంగా కాంబోకేసి సాగిపోవడం మొదలెట్టాయి. ముందు డాబూ బోటు, తర్వాత నాబోటు, మధ్యలో మొజాస్కీ మార్క్‌లబోట్లు చివర బిల్లీ. బోటుకు బోటుకు మధ్య దూరం యాభై గజాలు... వైర్‌లెస్ సెట్ ఆన్‌చేసి నలుగుర్ని కాంటాక్ట్ చేశాను. క్రొత్త బేటరీలు కావడం వలన చక్కగా పనిచేస్తున్నయి.

సరిగ్గా పదినిముషాలు తక్కువరెండుకు కాంబోరేవులో ప్రవేశించాయి. మాబోటురేవుదగ్గర పడగానే ఇంజన్లు ఆపు చేసి, మిగిలిన యాభైగజాలు తెడ్లువేశాము. 'కాంబోనగరమంతా నిశ్శబ్దంగా నిద్రపోతున్నట్లుంది. చరచర బోట్లను ఒడ్డునేవున్న కొయ్యదిమ్మలకు బిగించేశాము.

మొజాస్కీ రాకెట్ లాంచరును ఒడ్డునేకొద్దిగా ఎత్తుగా వున్న ప్రదేశంలో బిగించాడు. మార్క్ తన అనుచరులు ముగ్గురితో పాడుబడిన భవనం వైపు ఒడ్డమ్మటె వెళ్ళి పోయాడు.

బిల్లీ, డాబూలు ఒసారి మాప్‌ను పరిశీలించి, ఇద్దరూ తమ అనుచరుల్ని ఆర్మీహెడ్ క్వార్టర్స్ దిశగా, ఎయిర్‌పోర్టు వైపు సాగిపోయారు. నేను మొదటి రాకెట్ ప్రేలేవరకూ మొజాస్కీతోనే వుండదల్చుకొన్నాను. నా ఋల్యూమినేషన్ వాచ్‌లో నిముషాలు చకచకా దొర్లిపోతున్నాయి. అమావాస్య రోజులు కావడంవల్లా, రేవుప్రాంతంలో దీపాలులేకపోవడం వలన

చీకట్లో మేము ఎవరికన్నా కనిపిస్తామేమో అనే బాధలేదు.

టైముచూసు కొన్నాను. రెండూపదిహేనుఅయింది. ఈ పాటికి మార్క్ తనస్థలానికి చేరుకొని సిద్ధపడుతూ వుంటాడు బిల్డింగ్ డాబాలు తప్ప ప్రదేశాలు చేరుకోవడానికి మరో అయిదు నిముషాలు పట్టొచ్చు.

ఓరకంగా వాళ్ళపని కొద్దిగా తేలిక. ఎయిర్ పోర్ట్‌నుండి సైనికులు వేగంగా పాలస్‌వైపు వచ్చే అవకాశం చాలా తక్కువ. ఎందుకంటె వాళ్ళకు మోటారు వాహనాలు ఏమీలేవు. అంచేత వేగంగా ఎయిర్‌పోర్ట్ బిల్డింగ్‌వదలి మైలుదూరంలో వున్న ప్రెసిడెంట్ రక్షణకు రాలేరు. పైగా మార్క్ ప్రయోగించే గ్రేనేడ్ల ధాటికి వాళ్ళు ఎయిర్‌పోర్ట్ ప్రాంతంనుండి నగరంవైపు రాలేరు. ఎవరైనా దారితప్పిరావడం సంభవిస్తే వాళ్ళను అంతం చెయ్యడమే పూాదళం పని.

ఇంకా పదినిముషాలుంది. మేమునిలబడిన గుట్టమీదనుండి ప్రెసిడెంట్ భవనం చెట్లమధ్యలో నుండి అస్పష్టంగా కనిపిస్తోంది. మొజాస్కీ లాంచింగ్ పేడ్‌ను ప్రెసిడెంట్ భవనంపైపే గురిచేసి సిద్ధంగావున్నాడు. వైర్‌లెస్ సెట్టు గుయ్‌మని శబ్దం చేసింది.

"యస్! కమాండ్! పోస్ట్!"

"డాబా రిపోర్టింగ్... మేము సిద్ధం"–

"ఓ.కె... వాచవుట్!"–అన్నాను.. ట్రాన్స్‌మిషన్ అగిపో

చెట్లవైపు వస్తున్నారు...''—

''ఆర్ యు ష్యూర్''— అడిగాను...అనుకొన్న టైమ్‌కి ఇంకా నాలుగునిముషాలు వ్యవధివుంది.

''ష్యూర్..., చాలెంజీ చేస్తున్నారు... ఎవరోగంట మ్రోగిస్తున్నారు''...—బిల్లీగొంతులో ఆతృత కనిపిస్తోంది

''ఓ.కె.. అవర్ యువర్‌సెల్ఫ్ అండ్ ఫైర్!''— అన్నాను ఎక్కడో చర్చిగంటలు మోగుతున్న శబ్దం వినిపిస్తోంది. బహుశా హెడ్‌క్వార్టర్స్ అలారం అయ్యుండాలి.

''మార్క్''— పిలిచాను వైర్లెసులో...

''యస్! హియరింగ్!''— అన్నాడు మార్క్ అవతల నుండి.

''ఆర్ యూ రెడీ?''—

''రెడీ!''— దూరంగామెషిన్‌గన్ పేలినచప్పుడువినిపించింది.

''స్టార్ట్ ఫైరింగ్!''— అన్నాను...

''ఓ. కె!''— ట్రాన్స్‌మిషన్ ఆగిపోయింది.

ఆర్మీహెడ్ క్వార్టర్‌దిశగా వరసగా మిషన్‌గన్స్ పేలు తున్న చప్పుళ్ళు వినిపిస్తున్నయ్. ఆనలుగురు తుసీష్‌సైనికుల ఆశ్చర్యాన్ని, హెడ్‌క్వార్టర్స్ బారక్స్‌లో నిద్రపోతున్న సైనికుల కంగారును ఊహించుకోగలను.

''యస్! బాస్''!— అన్నాడు మొజాస్కీ లాంచింగ్‌పిల్ మీదచెయ్యివేసి.

''ఫైర్!''—అన్నాను...

మొజాస్కీ చేతిలో లాంచింగ్‌పిల్ తిరిగింది దూరంగా ఆర్మీహెడ్‌క్వార్టర్స్ పెద్ద పెద్ద పేలుళ్ళు వినిపిస్తున్నాయి. మిషన్‌చప్పుళ్ళు, గ్రెనేడ్ పేలుళ్ళతో హెడ్‌క్వార్టర్స్ వున్న ప్రదేశం మారు మోగుతోంది.

లాంచింగ్ పాడ్‌మీద నుండి మొదటి రాకెట్ ప్రెసిడెంట్ భవనం వైపు దూసుకపోయింది. హెడ్‌క్వార్టర్‌లో శబ్దాలకు ఈ పాటికి పాలస్‌లో అందరూ మేలుకొని వుంటారు... మా నాలుగురి కళ్ళు పాలస్ మీదే వున్నాయి.

మొజాస్కీ గురి అమోఘం. మొదటి రాకెట్ తిన్నగా ప్రెసిడెంట్ పాలెస్ గోపురానికి తగిలింది. మెరుక్యురీ కరిగి పెద మెఱుపు మెరిసింది. చెవులు చిల్లులు పడేశబ్దం వినిపించింది.

"వెల్‌డన్ మొజాస్కీ! ఒక్కొక్క డిగ్రీతేడాలో రెండేసి నిముషాల తేడాలో పదిరాకెట్లు కాల్చేయి. తర్వాత నీలిసి స్టెంట్‌తోసహా మిగిలినరాకెట్లతో పాలెస్ దగ్గర నన్ను కలుసుకో"— అన్నాను నాఅనుచరుడికి సైగచేసి పాలస్ వెళ్ళేదారివైపు పరిగెడుతూ...

కాంబోనగరం నిముషాల్లో అల్లకల్లోలం అయిందని చెప్ప డానికి. మీాకు వినిపిస్తున్న అరుపులు, కేకలుచాలు, ప్రెసిడెంట్ పాలెస్ ఊరుకు ఎడంగా విశాలమైన ప్రదేశంలో కట్టడం మావ్యూహానికి మంచిదయింది. పాలస్ సింహద్వారానికి ఎదు రుగావున్న చెట్ల మధ్యకి చేరుకొన్నాము. అక్కడినుండి పాలస్ స్పష్టంగా కనిపిస్తోంది. నావెనకే ఓ నీగ్రోసోల్జరు స్పేర్‌గ్రెనేడ్ లాంచర్ని, గ్రెనేడ్స బాక్సుని మోసుకొచ్చాడు.

నేను చకచకా గ్రెనేడ్‌లాంచర్ని ఫిట్‌చేసి సిద్ధంచేశాను. పాలస్ మొత్తం ఒక్కసారి మేలుకొన్నట్లుంది. పాలస్‌నిండా లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. జైలుపాలస్ వెనుక అండర్‌గ్రౌండులో వుండడంవలన డాక్టర్‌రసూలికి ప్రమాదం సంభవించే అవకాశంలేదు. పాలస్ లైట్లన్నీ దేదీప్యమానంగా వెలుగుతున్నాయి

"ఫూల్స్!— అనుకొన్నాను మనసులోనే. పాలస్‌గార్డ్సుకి

హఠాత్తుగా మెఱుపులా జరిగిన దాడివల్ల దిక్కుతోచక పోలీస్ గోడమీద, భవనం కప్పుమీద హడావిడిగా ఇష్టంవచ్చినట్లు రైఫుల్స్ పేలుస్తూ అటూ ఇటూ పరిగెత్తడం తప్ప ఏమీ చెయ్యడం లేదు.

మొజాస్కీ వదుల్తోన్న రాకెట్లు అప్పుడే నాలుగు పోలీస్ మీద పడినయ్. రాకెట్ పడినప్పుడల్లా పెద్ద శబ్దంతో ఆ భాగం భవనం బీటలుపడి కూలుతోంది.

పోలీస్ గార్డ్సు భవనానికి చుట్టూ వున్న ఖాళీస్థలంలో ఎడంగా కట్టిన చిన్న బిల్డింగ్‌లో వుంటారు. వైర్‌లెస్ ఆన్ చేశాను.

"మొజాస్కీ! కరెక్ట్ యువర్ టార్గెట్! సేవ్ ఎలివేషన్...రెండు రాకెటు టెన్ ఓ క్లాక్‌కి, రెండు టూ ఓ క్లాక్‌కి–ఒకరాకెట్ ఫైవ్ డిగ్రీస్ ఎలివేషన్, ట్వెల్వ్ క్లాక్‌కి వెయ్యి"–అన్నాను...

"ష్యూర్ కల్నల్!" మొజాస్కీ...

మార్కో! ఎలావుంది?"–అడిగాను.

"మరో అరగంటలో వంద గ్రెనేడ్లు పూర్తవుతాయి"

"గుడ్!కారీఆన్!"–

"బిల్లీ వినపడుతోందా?"–అడిగాను...

"ష్యూర్! మార్కో గ్రెనేడ్లు వెధవల్ని అదరగొడుతున్నాయి. ఆ మొదటి నలుగురు తప్ప మా వైపు ఎవ్వరూ రాలేదు. బారెక్స్ అన్నీ కాళీ అయ్యాయి. దాదాపు రెండు వందల మంది చచ్చి వుంటారు...."–అన్నాడు బిల్లీ వుత్సాహంగా

"గుడ్!అమ్యునిషన్ నివేస్ట్ చేయకండి. పారి పోయే వాళ్ళ వెంట పడొద్దు. పోలీస్ వైపు ఎవరన్నా రావాలని

ప్రయత్నిస్తే మాత్రం కాల్చి పారేయండి''—అన్నాను సంతోషంగా,

అక్కడ వున్న సైనికులలో బహుశా జీవితంలో ఫ్లయింగ్ గ్రెనేడ్స్ చూసిన వాళ్లు వుండి వుండరు.

''కొంత మంది వెనక అడవుల్లోకి పారి పోతున్నారు...'' —అన్నాడు బిల్లీ.

''రైట్ ! వెళ్ళనియ్యి...''—అన్నాను.

''ఓ, కె. —''—

''మార్క్!''—మళ్ళీ పిలిచాను...ఓ నిముషం తరువాత మార్క్ లైన్లోకి వచ్చాడు.

''యస్ కల్నల్''—

ఆర్మీ హెడ్ క్వార్టర్స్ మీదకు గురిచేసిన గ్రెనేడ్ లాంచర్లలో ఒకదానికి ఎలివేషన్ డిగ్రీ పెంచు. వెనక అరణ్యంలోకి చాలామంది పారి పోతున్నారు...''—

''ఓ. కె...కల్నల్!''—

''డాబా!...డాబా! హియర్ మి..,దిస్ జ్ కమాండ్'' పిలిచాను...

డాబా కంఠం వినిపించింది. ప్రక్కనున్న సీగ్రో సోల్జరు నాభుజంతట్టాడు...నేను చూస్తూనే వున్నాను. కొంత మంది నిషేన్ సైనికులు పాలస్ తలుపుకు వున్న చిన్న తలుపు తెరుచుకొని బయటకు వస్తున్నారు...

''హోల్డన్ డాబా!''—అని గ్రెనేడ్ లాంచర్ని తిన్నగా సింహ ద్వారానికి ఎదురుగా త్రిప్పాను., ట్యూబ్ గ్రెనేడ్ వేసి హాండిల్ నొక్కాను...జుయ్ మని శబ్దం...గ్రెనేడ్ తలుపుకు పది గజాల ఇవతల పడి పేలింది. బయటకు వస్తున్న సైనికులు లోపలికి వెళ్ళడానికి పరిగెత్తి ఒకరి

మీద ఒకరు పడి తోసు కొంటున్నారు...

ట్యాబ్‌ను సరిచేసి రెండో గ్రెనేడ్ వదిలాను...కరెక్టుగా తలుపు దగ్గర పడింది. చక చకా నాలుగు గ్రెనేడ్‌లు సింహద్వారంచుట్టూ పడేట్టు వదిలాను...తలుపుకు ఓ ప్రక్క పెద్ద కంత పడింది. ఇంకెవరూ ఆ ద్వారం లోంచి బయట కొచ్చే ప్రయత్నం చేయరు.

మొజాస్కీ వదిలిన రాకెట్లు పెద్ద శబ్దం చేస్తూ పాలస్ కాంపౌండ్‌లో పడుతున్నాయి.

"డాబూ! పొజిషన్ ఎలా వుంది"—అడిగాను...

"ఎక్సిలెంట్ బాస్! నగరం వైపు ఎవరూ వచ్చే ప్రయత్నం చెయ్యడం లేదు...పది మంది సైనికులతో ఓ జీపు మాత్రం ఇటు వచ్చింది..కాల్చి పారేశాము...చచ్చిన వాళ్ళు చావగా మిగిలిన వాళ్ళు ఎయిర్‌పోర్ట్ వెనుక వైపుకు పారిపోతున్నారు..." అన్నాడు డాబూ ఉత్సాహంగా.

శత్రు సైనికులు ఎవ్వరూ ఒక్క గుండు కాల్చిన పాపాన పోలేదు. హఠాత్తుగా జరిగిన మెరుపు దాడి వల్ల కంగారూ సైనికుల కెవ్వరికీ కాళ్ళు చేతులు ఆడలేదు. వాళ్ళు షాక్ నుండి తేరుకొనే లోపలే సగం మంది సైనికులు చచ్చారు, మిగిలిన సగం భయాందోళనలతో దిక్కు తోచక అటూ ఇటూ పరిగెడుతున్నారు.

"గుడ్! కీప్‌యువర్ ఎండ్"—అన్నాను పాలస్ వైపు చూస్తూ...

కొంత మంది కంగారూ సైనికులు కూలకుండా మిగిలి వున్న భవన భాగం మీద ఎక్కి నిలబడి, రాకెట్లు వస్తున్న వైపు రైఫుల్సు నిలబడి కాలుస్తున్నారు. నా ప్రక్కన వున్న సైనికుడిని సైగ చేశాను...ఆదే క్షణంలో మొజాస్కీ

పదో రాకెట్టు ఆ భాగం మీద పడింది...

"బాస్ పది అయి పోయినయ్"—పిలిచాడు మొజాస్కీ...

"ఫైన్ జాబ్! మిగిలిన నాలుగు పాడ్ మీద ఫిక్స్ చేసుకొని ఇక్కడకు వచ్చెయ్యండి. పాలెస్ ఎదురుగా తాడి చెట్ల మధ్య వున్నాను"—చెప్పాను...

"అయిదు నిముషాల్లో వస్తాను"

"బాస్! డిసీజ్ మార్క్"—

"బాస్ హియర్!"—

"మరో పాతిక మిగిలినయ్... హెడ్ క్వార్టర్సులో పురుగు కూడా మిగిలినట్లు లేదు... భవనం సగం కూలి పోయింది. మా వైపు రైఫుల్ త్రిప్పిన వాడు లేడు..."—

"రైట్! ఆ మిగిలినవి ఎయిర్ పోర్టు మీద సగం అడవిలో సగం వేసేసి ఇక్కడకు వచ్చేయండి" పొజిషన్ చెప్పాను.

ధన్ మన్న శబ్దం వినిపించింది.... మాకు పది గజాల అవతల వున్న తాటి చెట్టు విరిగి క్రింద పడింది. ఎవరో సింహ ద్వారం పైన వున్న 30 యమ్. యమ్. ఫిరంగి కాలుస్తున్నారు...చటుక్కున గ్రెనేడ్ లాంచరు ట్యూబును ఆ వైపుకు తిప్పాను...గ్రెనేడ్ వేసి హేండిల్ నొక్కాను...ఫిరంగి, గ్రెనేడ్ ఒకేసారి పేలాయి...మేమి ద్దరం ఎగిరి అవతలకు దూరి బోర్లపడ్డాము...మేము ఇందాక నిలబడిన చోటుకు రెండు గజాల దూరంలో పడింది. ఫిరంగి గుండు. సింహద్వారం పై భాగం మీద నుండి చప్పుడు చేసుకొంటూ ఫిరంగి గుండు క్రింద పడింది.

దుమ్ముదులుపు కొంటూ లేచినిలబడ్డాము...

"హేండ్సప్!"— అన్నారెవరో వెనకనుండి....

ఒక్కసారి గుండె జల్లుమంది... తలమీద చేతులు పెట్టుకొని వెనక్కి తిరిగాను...

టపటప మిషన్‌గన్ పేలింది ఓ ప్రక్కనుండి... ఎవరో గట్టిగా అరిచి క్రిందపడ్డారు...

"బాస్టర్డ్!"— అంటూ నవ్వుతూవచ్చాడు మొజాస్కీ...

అగ్గిపుల్ల వెలుతురులో చూశాను.... కెప్టెన్ ట్రూమా శరీరం తూట్లుపడివుంది. ఎయిర్‌పోర్ట్ దగ్గర్నుండి పరిగెత్తి వచ్చుండాలి.... చెమటతో తడిసిపోయివుంది యూనిఫాం అంతా....

"వాట్ నెక్స్ట్?"— అన్నాడు మొజాస్కీ రొప్పుతూ...

"మొదటి రౌండ్ గెలిచాము... ఇప్పుడు పాలస్‌లో ప్రవేశించాలి"— అన్నాను వైర్‌లెస్ ఆన్‌చేస్తూ...

అందరూ ఫైరింగ్ ఆపేయడంతో అంతా క్షణం నిశబ్దమైనట్లనిపించింది. పాలస్‌లోనుండి విపరీతమైన ఆక్రందనలు రోదనలు వినిపిస్తున్నాయ్...

బిల్లీ, మార్క్, మొజాస్కీ, పదిమంది సైనికులు, మిషన్‌గన్‌లతో సిద్ధంగా వున్నారు. డాబూను వైర్‌లెస్‌లోపిలిచాను...

"డాబూ! మేంపాలస్‌లోకి వెళ్ళుతున్నాం... నువ్వుద పాలస్ వెనక ప్రక్క కవర్ చెయాలి"— చెప్పాను...

పదినిముషాల్లో డాబూ తన సైనికుల్తో, పాలెస్ వెనకవైపు లచ్నేలో పొజిషన్ తీసుకొన్నాడు.

"రైట్ ... మార్క్ మిగిలిన గ్రెన్లేడ్లతో నువ్వు మరోక పోల్జరు వెనకవుండిమీరు కవర్ ఇవ్వండి... మీరువరసగా గ్రెనేడ్లు పేలుస్తుంటె ఎవరికీ ఎదురొచ్చి మీ మీదరైఫిల్ పేల్చెఅవకాశంవుండదు... ఓ. కె...!"— మార్క్ తల వూపి లాంచర్ను సిద్ధం చేయడంలో మునిగిపోయాడు...

"మొజాస్కీ! నువ్వు ఆ మిగిలిన నాలుగురాకెట్లు కాల్చాలి ముందు ఆ సింహద్వారం తలుపులు బద్దలు కొట్టాలి..."—

మొజాస్కీ చకచకా పాడ్‌ని అడ్జస్ట్‌చేశాడు... సిల్‌గ్రరుసి తిరిగింది... సంయ్‌మనివెళ్ళిన రాకెట్టు తలుపుకు తాకింది... పెద్ద ప్రేలుడుతోపాటు సింహద్వారం తలుపులు ముక్కలయి క్రిందపడింది. దాంతోపాటు సింహద్వారం గోడసగంకూలిపడింది అదేక్షణంలో మార్క్ మళ్ళీ గ్రెనేడ్లు వదలడం మొదలు పెట్టాడు.. మొజాస్కీ మిగిలిన రాకెట్లతో గోడంతా పడ గొట్టాడు.

పగిలిన ప్రహరీగోడలోంచి చావగా మిగిలిన వాళ్ళు ప్రాణ భయంతో పరిగెత్తుకు వస్తున్నారు.... టపటప మెషిన్‌గన్లు కాలుస్తూ ముందుకు పరిగెత్తాము ... సింహద్వారం వరకూ వెళ్ళాక వైర్‌లెస్‌లో చెప్పాను.

"మార్క్! ఇక ఆపేయి!"—

రైట్ బాస్!"—

ప్రహరీ లోపల చచ్చినవాళ్ళు, గాయపడిన వాళ్ళు, గుట్ట లుగా పడివున్నారు. మెషిన్ గన్స్ కాల్చుకొంటూ భవనం వైపు పరుగెత్తాము. బహుశా బలవంతుడైన శత్రువునుఎదిరించలేము. అనే నిశ్చయానికి వచ్చారో, లేక మెఱుపుదాడికి, వాళ్ళ మనసులు చెడినయ్యో తెలియదు...కాని ఒకరిద్దరు సైనికులు తప్ప భవనం వైపునుండి ఎవరూ మామీద కాల్పులు జరపలేదు...

జనరల్ నిషాన్ నివాసం వైపు పరిగెత్తాను నేను... మొజాస్కీని ఇంకో నలుగురు సోల్జర్సు అండర్ గ్రౌండ్ జైలు వైపు పంపాను...జనరల్ నిషాన్ వుండే గదులు సగం కూలి పోయి వున్నాయి...వాటిలోనుండి ఎవరో మావైపు రైఫిల్

కాల్చారు...

"మైగాడ్!" అన్నాడు బిల్లీ క్రింద పడుతూ...

నాలుగు మిషన్ గన్లు సోఫాను తూట్లుచేసినయ్...బిల్లీ తొడలో దిగబడిందిగుండు...బిల్లీని ఓ సైనికుడికి అప్పజెప్పి నిషాన్ గదివైపు పరిగెత్తాము...చుట్టుప్రక్కల గదులు కూలి పోయినా నిషాన్ గదిమాత్రం చెక్కు చెదరకుండా వుంది...చటుక్కున తలుపుతీసి ఓ సారి లోపలకు గన్ పేల్చాము...ఏ చప్పుడు లేదు...

మెల్లగా లోపలకు నడచాము...గది మధ్యలో సోఫాలో ఓ అకారాం కనిపించింది. దగ్గరకు నడిచాను...జనరల్ నిషాన్ చలన రహితంగా సోఫామీద వెల్లకిలా పడివున్నాడు. అతని కణత మీద నుండి రక్తం ధారగా కారి సోఫాను తడుపుతోంది. అతని కుడిచేతి వేళ్ళు, రివాల్వర్‌కు ఇంకా బిగుసుకొనే వున్నాయి...

"డర్టీకవర్ట్! మనతో పోట్లాడి చస్తే హీరోస్ ఫ్యునరల్ ఇచ్చేవాణ్ణి వెధవకి"—అన్నాను అసహ్యంగా...

జనరల్‌కు తగ్గచావు కాదది.

"అవును ! జనరల్‌కు తగ్గచావుకాదది. థాంక్యూ వెరిమచ్ కమాండర్!"—గంభీరంగా వినిపించింది...

చటుక్కున అవైపు తిరిగి చూసాను. అప్పటివరకూ అతనక్కడ ఉన్నట్లు మేమెవ్వరం గమనించలేదు. దట్టంగా పెరిగిన గడ్డం, కొద్ది బట్టతల, మొద్దు పెదిమలు, చప్పిడి ముక్కు, వెండిఫ్రేము కళ్ళజోడు...

"హుదహెల్ ఆర్‌యూ!"—అన్నాను మెషిన్‌గన్ అతని వైపు త్రిప్పి...

"రసూలీ! డాక్టర్ రసూలీ!"—అన్నాడతను గంభీ

రంగా.—''మీ రాకెట్లదాడికే అండర్‌గ్రౌండ్ జైలు కప్పు కూలింది....లోపలవున్న వాళ్ళెవరూ నన్ను పట్టించుకోలేదు. ఏలా అయినా నిషాన్‌ని పారిపోకుండా పట్టుకొని ప్రజా న్యాయ స్థానంలో విచారించాలని ఇక్కడకువచ్చా...అప్పటికే ఆత్మహత్య చేసుకొన్నాడు''—అన్నాడతను...

మెల్లగా మెషిన్ గన్‌ని క్రిందకు దింపాను.

''గ్లాడ్‌టుసీయూ డాక్టర్! రండి! ప్రభుత్వాన్ని స్వాధీనం చేసుకొన్నట్లు ప్రకటన చెయ్యండి!''—అన్నాను...

''థాంక్యూ వెరిమచ్‌సోల్జర్స్!''—అన్నాడు రసూలీ లేచి నిలబడుతూ.

—: ఐపోయింది :—

# వలచి వచ్చిన వనిత

వసుంధర

"వాడికి మూడింది"— అన్నాడు శ్రీధరబాబు.

శ్రీధరబాబు ఉద్దేశ్యంలో వాడు అంటే పుల్లారావని నాకు అర్థమయింది.

శ్రీధరబాబుని మాకాలేజీలో మొనగాళ్ళకు మొనగాడని చాలామంది చాటుగాను, కొంతమంది ఎదురుగానూ కూడా అనుకుంటూ, అంటు ఉంటాడు. రౌడీ అన్నపేరు కూడా అతనికి లేకపోలేదు.

అతను క్లాసులో బాగా అల్లరిచేస్తాడు. మేష్టర్లని ఏడిపిస్తాడు. ఆడపిల్లల వెంటబడడమూ, వాళ్ళు వినేలా అసభ్యపదాలు మాట్లాడడమూ అతని హాబీ. ఆడపిల్లలకు

శ్రీధరబాబు అంటే సింహస్వప్నం అనవచ్చు.

నేను బుద్ధిమంతుడిగా పేరు పడ్డానని చెప్పడంకంటె— కాలేజీలో ఒక అనామకుడినని చెప్పకుంటే బాగుంటుంది. నన్నుగురించి— ఆఖరికి శ్రీధరబాబు రూమ్మేటుగా నైనా కూడా ఎంతోమంది ఎరుగరు. అందుకు కారణాలు లేక పోలేదు. నేను రూమ్ వదిలాక సాదారణంగా అతన్ని తప్పించు కుని తిరగడమే జరుగుతుంటుంది. అనవసరపు టనుమా నాలకు లోనుకాగలనన్న భయంతో క్లాసులో అతని ప్రక్కన కూర్చోను నేను. ఆడపిల్లల వెంటబడడం ఊహలో నాకు ఆనందకరంగానే అవిపించే విషయం నిజమే అయినా —ఆపద్ధతి వల్ల వచ్చే చెడ్డ పేరుకు నేను సిద్ధపడని కారణంగా శ్రీధర బాబుతో బయట షికార్లు అట్టే చేసేవాడినికాదు.

అసలు నేనూ, శ్రీధరబాబు హాస్టల్ రూమ్ మేట్సుగా ఆరునెలలు గడపగలడం నన్ను తెలిసిన కొంతమంది స్నేహి తులకు చాలా ఆశ్చర్యంగా ఉండేది. అయితే ఒక్కమాట మాత్రం నిజం. నేనూ, శ్రీధరబాబు నిజంగా స్నేహితులం. ఒకళ్ళ పద్ధతి ఒకరికి నచ్చనట్లు కనపడినా చాలా విషయాల్లో మాఅభిప్రాయాలు ఒకటే! రూమ్‌లో ఉన్నప్పుడు మేమిద్ద రమూ గంటలతరబడి మాట్లాడుకుంటూండే వాళ్ళం. నా పరిజ్ఞానాన్ని అతను మెచ్చుకుంటూండేవాడు. అతని నిర్భయత్వా నికి నేను ఆశ్చర్యాన్ని వ్యక్త పరుస్తూఉండేవాడిని.

ఒకరోజు మాటల ప్రసక్తిలో అతను—'' నీతో. మాట్లాడం కోసం కాకపోతే అసలు నేను రూముకి రావలసిన అవసరమే కనపడదు పంతులూ!,, అన్నాడు. అది నాకు కాంప్లిమెంటు.

నాపేరు పంతులు కాదు. కానీ శ్రీధరబాబు రూమ్మేటుగా

వచ్చిన క్రొత్తలో నన్నలా పిలువడం మొదలు పెట్టాడు. నన్నేడిపించాలన్నది బహుశా అతని అభిమతం అయుండవచ్చు. కానీ నేను ఆపిలుపుకు పలకడం మాత్రమేకాక— "నీపలక రింపులో ఎంతో సాన్నిహిత్యం కనబడుతోంది— బావా!,, అన్నాను. శ్రీధరబాబు ముఖం అప్పుడు అంత బాగాలేదు. అతను నాకేసి అదోకలా చూసి— "బావా అంటున్నావు— నీకు ఇంతకీ చెల్లెళ్ళున్నారా పంతులూ— ,, అన్నాడు.

నేను చలించకుండా— బావా అని పిలవడానికి 'నాకే చెల్లెళ్ళుండాలా— నీకుంటేసరిపోదూ?,, అన్నాను.

భయంకరమైన ముఖం అనే పదానికి అర్థం ఆక్షణంలో నాకు తెలిసింది. శ్రీధరబాబు ఒకసారి కుడిచేతి పిడికిలితో ఎడమ అరచేతిలో ఫట్టిగా కొట్టుకుని— "నేను నిన్ను నిజంగానే ప్రేమతోనే పంతులూ అనిపిలిచాను. కానీ నువ్వు మాత్రం ఉద్దేశ్యం ఏమైనా— బావా అని మాత్రం నన్ను పిలవద్దు. బహుశా నాపదిహేనవ సంవత్సరంలో అనుకుంటాను— నేను హంతకుడు కావలసిన సంఘటన ఒకటి కొద్దిలో తప్పిపోయింది. కారణం తెలుసా"? అని ప్రశ్నార్థకంగా నావైపు చూశాడు.

నిజం చెప్పొద్దూ, నాకాక్షణంలో అతని ముఖం చూస్తూంటే భయమేచేసింది. నేను మరి మాట్లాడలేదు.

శ్రీధరబాబు కూడా ఒకటి రెండు నిముషాలపాటు మౌనంగా ఉండి ఆతర్వాత చెప్పడం ప్రారంభించాడు— "నాకు ఒక్కగా నొక్కచెల్లెలు. పేరు పార్వతి. ఆరుగురు మగ పిల్లలతర్వాత లేక లేక మాఇంట్లో పుట్టినపిల్ల పార్వతి. మగ పిల్లల్లో నేనే ఆఖరివాడిని కావడంచేతనూ, పార్వతికీ నాకు ఏణ్ణర్థం మాత్రమే తేడా ఉండడంవల్లనూ— మాఇద్దరి

అను బంధం ఇంతా అంతాఅని చెప్పలేను. చిన్నప్పట్నించీ ఇద్దరూ ఒకే ప్రాణంగా పెరిగాం''—శ్రీధరబాబు ఆగాడు

నేను కుతూహలంగా వింటున్నాను భయం కూడా కాస్త తగ్గింది.

అతను మళ్ళీ మొదలు పెట్టాడు— ''నాకప్పుడు పదిహేను సంవత్సరాలు. ఫోర్త్ఫారం చదువుతూండేవాడిని. అదే స్కూల్లో పార్వతి సెకండ్ఫారం చదువుతోంది. నాకప్పుడూ కాస్త పెద్దపరిచయాలే. చాలా మంది స్కూల్ఫైనల్ చదువుతున్న కుర్రాళ్ళతో నాకు పరిచయముండేది. అందులో సుదర్శనం అనే అతనితో నేను చాలా తరచుగా తిరుగుతూండేవాడిని. సుదర్శనం గతమూడు నాలుగు సంవత్సరాలుగా అదే స్కూల్ విద్యార్థి నాయకుడిగా ఉంటూ వస్తున్నాడు. ఒకో తరగతి ఒకసంవత్సరం కంటె ఎక్కువ సార్లు చదవుతూ వచ్చినకారణంగా అప్పటికి అతని వయసు ఇరవైకి పైనే ఉంటుంది. ఆకారణంగా అతను క్లాసులోని వయసు సొగసులను మగదృష్టితో చూచివర్ణించగల సమర్థత అప్పటికే సంపాదించాడు. అతని వర్ణనలు విని ఆనందించడం కోసమే నేనతనితో ఎక్కువగా తిరుగుతూండేవాడిని—'' అని ఒకసారి నాకేసి చూసి ''వింటున్నావా''? అడిగాడు శ్రీధరబాబు.

''ఊఁ''అన్నాను నేను

శ్రీధరబాబు చెప్పడం కొనసాగించాడు—'' సుదర్శనమంటే స్కూల్లో ఆడపిల్లలు హడిలి చచ్చేవారు. అతనితో పాటు నేను కూడా ఎన్నోపర్యాయాలు ఆడపిల్లల వెనక పడి నోటిదురద తీరేలా బూతులు మాట్లాడి సంతోషించేవాడిని. ఒకసారి సుదర్శనం నాకు ముందు చూపుగురించి చిన్నలెక్చరు దంచాడు—'' వయసులో ఉన్న ఆడపిల్లలకు తమవెంట

మగవాళ్ళు పడతారని గర్వంగా ఉంటుందట. అందుకని సుమారు పన్నెండు పదమూడు సంవత్సరాల వయసుపిల్లలను మచ్చిక చేసుకుంటే— వాళ్ళు అప్పటికి అమాయకంగా చెప్పిన మాట వినడమేగాక రెండుమూడేళ్ళ తర్వాత అన్నింటికీ పనికొస్తారు. అందువల్ల ఒక అందమైన ఆవయసు పిల్లని ఇప్పట్నించీ పటుకోవడాన్ని ముందుచూపు అంటారని అతను నాకు చెప్పాడు. అంతవరకు బాగానే ఉంది. కానీ''—...

శ్రీధరబాబుముఖం మళ్ళీ కోపంగా మారింది. ఉద్రేకంవల్ల కాబోలు అతని చేతిపిడికిలి బిగుసుకుంది. తడబడతూ అతను''— ''అరోగ్, అఫూల్, అఇడియట్, ఆరాస్కెల్ ఆస్కోండ్రల్— సుదర్శనంగాడు ఉదాహరణగా నాకు నా చెల్లెలిని చూపించి''—మన ముందు చూపుకీ అమ్మాయెలా గుంటుందంటావు!'' అడిగాడు. నేను షాక్ తిన్నాను. అక్షణంలో చటుక్కున పార్వతి నాచెల్లలని వాడికి చెప్పాలని కూడా తట్టలేదు.

నేను గట్టిగా సుదర్శనం చేయి నొక్కి—వెనక్కులాగాను. ''నాతోరా!'' అన్నాను. మా స్కూల్ వెనకాల ఒక పెద్ద తోట ఉంది. అందులోకి వాడిని తీసుకువెళ్ళి—హటాత్తుగా అక్కడ వాడిని గట్టిగా ఒక్కతోపు తోశాను. సుదర్శనం క్రింద పడ్డాడు. నేను ఎగిరి వాడిపొట్టమీద కూర్చుని గొంతు నులవ సాగాను. సుదర్శనం అసహాయుడై తన్నుకుంటున్నాడు. తన చేతులతో నన్ను తొయ్యడానికి విఫలప్రయత్నాలు చేస్తున్నాడు. నా చేతులు అతడి గొంతుకు గట్టిగా బిగుసుకుంటున్నాయి. ఆ సమయంలో ఎవరో నన్నువెనక్కులాగేరు. సుదర్శనం మాత్రం కదల్లేదు. నన్ను లాగినదెవరా అని వెనక్కుతిరిగాను. మాలెక్కల మేస్టారు. ఆయన నాచెంప చెళ్ళుమనిపించాడు....

శ్రీదర్‌బాబు మళ్ళీ ఒక్కక్షణం ఆగి చెప్పసాగాడు.--" పృహతప్పినా సుదర్శనం చావలేదు. నేను హంతకుణ్ణి కాలేదు. కానీ—సుదర్శనమంతటివాడిని దెబ్బతినిపించిన మొనగాడిగా స్కూల్లో నాకు పేరువచ్చింది. నాకూ సుదర్శనానికి శత్రుత్వం ఏర్పడలేదు. మేమిద్దరం ఇంకా మిత్రులయ్యాం. ఒకరి చెల్లెలి జోలికి మరొకరు పోరాదనీ—పార్వతి నా చెల్లెలని తెలియక పొర బాటు చేసినందుకు క్షమించవలసిందనీ—సుదర్శనం నన్ను కోరాడు—"

శ్రీధర్ బాబు చెప్పినదివింటూ నేను ఆలోచిస్తున్నాను. ఇతగాడికి పరాయి ఆడదంటే ఏ మాత్రం గౌరవంలేదు. తను అందరి ఆడపిల్లల వెనుక పడలేడు. కానీ—తన చెల్లెలిని ఎవ్వ రేమన్నా సహించలేడు. ఏమిటీ విచిత్ర మనస్తత్వం?...నిజం చెప్పాలంటే ఒక్క శ్రీధర్ బాబుకే కాదు—ఇటువంటి మనస్త త్వం ఎంతో కొంత ప్రతి మగవాడిలోనూ కూడా ఉన్నదేమో నని నన్ను నేను ఆత్మవిమర్శ చేసుకోవాలనిపించింది.

"వింటున్నావా—నా చెల్లెలని తెలియక సుదర్శనం పొర బాటు చేసినప్పుడే నేను క్షమించలేకపోయాను. అటువంటప్పుడు తెలిసి ఎవరైనా పొల్లుమాటంటే..." శ్రీధర్ బాబు వాక్యం పూర్తిచేయకుండా నాకేసి చూసాడు. అతని చూపుల్లో ఆ తర్వాత వాక్యం కనిపించింది.

నేనుకాస్త నెమ్మదిగా అన్నాను—"చావంటే నాకు భయం లేదు. అలాగని కోరి చావుని ఆహ్వానించను. కానీ ఒక్క సందేహం ప్రతి ఆడది నీ చెల్లెలిలాంటిదేనని ఎందుకు భావించవు?"

శ్రీధర్ బాబు సినిమా విలన్లా వికటాట్టహాసంచేసి—" చాలా చచ్చు ప్రశ్ననీది. మగాడికి ఆడదాన్నిచూస్తే వెర్రెత్తు తుంది. మీసమున్న మగవాడిగా నాకు తోచినట్లు ప్రవర్తిస్తాను.

భావుంటే ఎవడినైనా అడ్డుకోమను. ప్రతి ఆడదానికీ నాకు లాంటి అన్నదొరకడు. అందుకు శిక్ష వాళ్ళనుభవించవలసిందే—" అన్నాడు.

ఆ నాటినుంచి శ్రీధర్‌బాబు నేను మళ్ళీ ఎన్నడూ వాగ్యుద్ధం చేయలేదు. అతను నన్ను పంతులూ అని మరి పిలవ నందువల్ల నేనతన్ని బావా అనవలసిన అవసరంకూడా రాలేదు. మా స్నేహం క్రమక్రమంగా పెరుగుతూ వచ్చినా శ్రీధర్‌బాబుకు మూర్ఖత్వముందనీ, అతను కాస్త ప్రమాదకరమైన వ్యక్తి అనీ అన్నవిషయం మాత్రం నేను విస్మరించలేదు...

జరిగిన విషయం ఈ రోజు మధ్యాహ్నం నా చెవిన పడింది. నిన్న సాయంత్రం ప్రఫుల్ల అనే అమ్మాయిని శ్రీధర్ బాబు చేయిపట్టుకుని లాగి కన్నుకొట్టాడట. ఫుల్లారావు ప్రఫుల్లకు అన్న. అతను తన మిత్రబృందం సమక్షంలో శ్రీధర బాబు చెల్లెలికి తనద్వారా నడిరోడ్డుపై—అలనాడు ద్రౌపదికి జరగబోయి ఆగిపోయిన అవమానం—ఆగకుండా జరగబోతోందనీ—అందుకోసం తను బయల్దేరి శ్రీధర బాబు ఊరికి వెళ్ళబోతున్నాననీ ప్రకటన చేశాడు. ఆ ప్రకటన రాకెట్ కంటె వేగంగా పయనించి శ్రీధర బాబుని చేరుకుంది.

ఆ రాత్రి గదిలో నావంక చూసి—"వాడికి మూడింది.!" అని శ్రీధర బాబు అన్నప్పుడు వాడంటే ఫుల్లరావని నాకు అర్థ మైంది. పైకి అనకపోయినా—"శ్రీధర బాబు—నీ ప్రవర్తన మూలంగా నీచెల్లెల్ని నలుగురి నోళ్ళలోనూ పారవేస్తున్నావు.— అనుకున్నాను నాలో నేనే.

ఆ మర్నాడు చావు తప్పి కన్ను లొట్టపోయిన దశలో బైట పడ్డాడు ఫుల్లరావు. శ్రీధర బాబు చాలా తెలివిగా వ్యవహ రించి మరీ పగతీర్చుకున్నాడు. కొట్టినదెవరో సాక్ష్యం దొరక

కుండా పుల్లరావును ఒంటరిగా పట్టాడు. పోలీసు పద్ధతిలో వళ్ళంతా కుళ్ళబొడచి వదిలిపెట్టాడు. ఏమన్నా గొడవ చేసినా మరోసారి తన చెల్లెలి ప్రసక్తి తీసుకువచ్చినా—ప్రాణాలు దక్క వని హెచ్చరించాడు.

# 2

చాలా కాలం తర్వాత శ్రీధర బాబుని మళ్ళీ చూశాను. అనుకుకోండా అతను కళ్ళబడగానే ఈ పాత జ్ఞాపకాలన్నీ మెద డులో కదిలాయి

నా ఉద్యోగానికి సంబంధించిన ఒక పనిమీద నేనా ఊరు వెళ్ళడం సంభవించింది. రైల్వేస్టేషన్‌లోనే అనుకోకుండా శ్రీధర బాబు నాకు తటస్థపడ్డాడు. నన్ను చూస్తూనే గుర్తు పట్టి —"అరే! నువ్వా—"అన్నాడు నమ్మలేనట్లుగా

"అవును. నేనే—"అన్నాను నేనూ అనుకోకుండా మా కలయిక జరగడానికి ఆశ్చర్యపడుతూ,

ఇద్దరం ఒక నిముషం పిచ్చాపాటి మాట్లాడుకున్నాం. అతను ఒక కంపెనీలో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా పనిచేస్తు న్నాడు. ఒక ఊరంటూ స్థిరంలేదు. ఎప్పుడు ఏ క్షణంలో ఎక్కడికి వెళ్ళవలసి ఉంటుందో తెలియని ఉద్యోగమది. తన మనస్తత్వానికి సరిపడ్డ ఉద్యోగమని ఆతనన్నాడు. గతవారం రోజులుగా ఈ ఊళ్ళో ఉంటున్నాడట. ఏదో మేగజైను ఎక్కడా దొరక్క స్టేషన్లో దొరుకుతుందేమోనని చూడ్డానికి వచ్చి నాకు తటస్థపడ్డాడు. నాకు ఆ ఊళ్ళో రెండు మూడు వారాలపాటుండే పని ఉన్నదని విన్నాక అతను నేను మరెక్కడికి వెళ్ళడానికి వీలులేదనీ తన గదికి వచ్చి అక్కడే ఉండాలనీ పట్టు పట్టాడు.

నేను అతని గదికి వెళ్ళాను. అక్కడ కాస్సేపు .ఇద్దరం

పాతజ్ఞాపకాలు వేసుకున్నాం. అప్పుడు నాకు అతని చెల్లెలు పార్వతి గుర్తుకొచ్చి—అమె ఇప్పుడు ఎక్కడ ఉంటున్నదీ అడగాలనిపించి నోటిచివరిదాకా ప్రశ్నలాగా తమాయించుకుని మానేశాను.

"అప్పటికీ ఇప్పటికీ నా జీవితంలో చెప్పుకోతగ్గ మార్పేమీ లేదోయ్, స్నానం భోజనం—మళ్ళం నిద్ర! ఒక టైముకి ఆఫీసుకు వెళ్ళాలనిలేదు. ఈ రోజు సెలవు అని చెప్పుకుందుకా లేదు—నా ఉద్యోగం ఫలానా ఊళ్ళో అనుకుందుకు లేదు నా అలవాట్లు మారలేదు. పద్ధతులు మారలేదు—"అన్నాడతను.

"అదృష్టవంతుడివి! నువ్వు కోరుకునే పద్ధతి జీవితం నీకు లభించింది. నాది మామూలు రొటీన్ జీవితమే అనుకో! ఏ థ్రిల్సూ లేవు" ఈ మాటలన్నప్పుడు సుమారు ఒక రోజు వ్యవధిలో నేనూహించని థ్రిల్స్ నా జీవితంలో ఎదురు కానున్నవన్న సంగతి నిజంగా నాకు తెలియదు.

ఆ రోజుకు విశ్రాంతి తీసుకున్నాను. శ్రీధరబాబు తన కాలమంతా ఆరోజు నాతోనే గడిపాడు. ఇద్దరం హోటల్‌లో భోజనం చేశాం. ఓ చెత్త సినిమా చూశాం. అన్నింటికీ శ్రీధరబాబే డబ్బుపెట్టాడు.

ఆ రాత్రి ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ చాలాసేపు కాలం గడిపి కాస్త ఆలస్యంగానే నిద్రకు పడ్డాం.

మర్నాడు లేవడానికి బద్ధకం అనిపించింది. కానీ నేను నా ఆఫీసు వ్యవహారం నిమిత్తం బయటకు వెళ్ళవలసి ఉన్నది. అందువల్ల పదయ్యే సరికి తెమిలి ఇంట్లోంచి బయట పడ్డాను. శ్రీధరబాబు నాకు తన రూము డూప్లికేట్ తాళం ఇచ్చి తను మళ్ళీ నిద్రకుపడ్డాడు.

నా పనులు తెమిలి రూమ్‌కి వచ్చేసరికి సాయంత్రం

మూడున్నర గంటలైంది. నేను వెళ్ళే సరికి గది తాళం వేసే ఉంది. నేను తాళం తీసి గదిలో అడుగు పెట్టాను తలుపులు వేసుకుని నెమ్మదిగా బట్టలు మార్చుకో బోతూండగా ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది.

తలుపు తీశాను. పోస్ట్‌మన్ ఒక టెలిగ్రామ్ నా చేతి కందించి నా చేత సంతకం పెట్టించుకొని వెళ్ళి పోయాడు. టెలిగ్రామ్ శ్రీధరబాబుకి. ఏం కొంప మునిగే విశేషమోనని విప్పిచదివాను. "మీట్ సిస్టర్ సెవెన్‌టీన్త్ హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్" అని ఉంది అందులో.

ఆ ప్రయత్నంగా నేనొకసారి నావాచీ చూసుకున్నాను. పదహారవ తేదీ చూపిస్తోంది. మళ్ళీ తలుపులు వేసి—శ్రీధరబాబు చెల్లెలు రేపు ఇక్కడకు రాబోతోందన్న మాట—అనుకున్నాను

నిజంచెప్పొద్దూ నాకు అతని చెల్లెల్ని చూడాలన్న కాంక్ష చాలా కాలంగా ఉంది. శ్రీధరబాబుకి ఒక సంవత్సరం పాటు రూమ్ మేటుగా ఉన్నప్పటికీ నాకు అతను కనీసం తన చెల్లెలి ఫోటో అయినా చూపలేదు. చూపవలసిన అవసర ముందని కాదు కానీ—ఎన్నో పర్యాయాలు మా ఇద్దరి మధ్యా ఆమె ప్రసక్తి రావడం కారణంగా నాలో ఆమెను చూడాలన్న కుతూహలం నానాటికీ బలపడి శ్రీధరబాబు కనీసం ఆమె ఫోటో అయినా నాకు చూపలే దేలని బాధపడుతూ ఉండేవాడిని. ఏమయితేనేం ఇన్నాళ్ళకు నాకోరిక నెరవేరబోతోంది.

టెలిగ్రామ్ టేబుల్ మీద పెడదామని వెళ్ళి ఉలిక్కి పడ్డాను. టేబుల్ మీద శ్రీధరబాబు రాసిన ఉత్తర మొకటి కనపడింది. అది అతను నన్నుద్దేశించి రాసినది.

అనుకోకుండా అతను ప్రయాణం కట్టవలసి వచ్చిందట. తను తప్పక రెండు మూడు రోజుల్లో వెనక్కి రాగలనని అంత వరకూ నేను తన గదిలోనే ఉండవలసిందనీ అతనురాశాడు.

చాలా తమాషా అయిన సందర్భం ఏర్పడినట్లు నాకు తోచింది. తీవ్రంగా ఆలోచనలో పడ్డాను.

శ్రీధరబాబు ఉంటున్న వాటా మొత్తం రెండు పెద్ద గదులు ఒక చిన్న వంటిల్లు. ఎవరైనా ఒక రిద్దరు అతిథులుగా వస్తే ఆదరించడానికి సరిపడ్డ నివాసమే అతనిది. అయితే అతను లేని సందర్భంలో అతని చెల్లెలు వస్తే మేమిద్దరం అదే వాటాలో ఉండడం కష్టమే మరి.

ఇంతకీ ఆమెను స్టేషన్‌కి వెళ్ళి రిసీవ్ చేసుకునేదెలా? ఆమెను నేనెన్నడూ చూసి ఉండలేదు. ఆమె తనకు తానుగా సరాసరి గదికి రాగలదో లేదో తెలియదు. ఈ పరిస్థితుల్లో నేనేం చేయాల్సి ఉంటుంది?

ఏంచేయ దల్చుకున్నా బాగా ఆలోచించాకనే ఒక నిర్ణయానికి రావలసిఉంటుంది. ఎందుకంటే ఇది శ్రీధరబాబు చెల్లెలితో వ్యవహారం!

నేను మళ్ళీ చొక్కా వేసుకొని టెలిగ్రామ్ చేత్తో పట్టుకుని తలుపులు తీసుకుని గది బయటకు వచ్చాను. వెదక బోయిన తీగెకాలికి తగిలి నట్లుగా నిన్ననే నాకు పరిచయమైన ఇంటాయన కనపడ్డాడు. నన్నూ నా చేతిలోని టెలిగ్రామ్‌నూ చూస్తూ ఆయన గాబరాగా--"ఏమిటీ మళ్ళీ మరో టెలిగ్రామా?" అన్నాడు. ఆయన మాట వినగానే నాకూ గాబరా కలిగింది. శ్రీధరబాబుకి గాని కొంప తీసి ఇంకో టెలిగ్రామ్ వచ్చి ఉండలేదుకదా—అని కంగారు

సద్దాను.

ఇంటాయన నా చేతులోంచి లాక్కొన్న విధంగా టెలి గ్రామ్ తీసుకుని చదివి తేలిగ్గా నిట్టూర్చి—"హమ్మయ్య—" అనిఒక్క నిముషం ఆగి—"పొద్దున్నే నాకు ఓ టెలిగ్రామ్ వచ్చింది—మా ఆవిడకు సుఖప్రసవమై కొడుకును కన్నదని. అంత మంచి వార్త వచ్చిన తర్వాత మరో టెలిగ్రామ్ వెంటనే వచ్చిందంటే గాబరా కలగడం సహజమే కదండీ! ఏమయితేనేం—మీతో సరదాగా ఓ రెండు రోజులు కాల క్షేపం చేయడానికి లేకుండా నేను మా అత్తారింటికి వెళ్ళ వలసి వస్తోంది.—"అని హఠాత్తుగా ఏదో గుర్తు కొచ్చిన వాడిలా—"ఇంతకీ మీరేదో చెప్పాలని వచ్చినట్లున్నారు!" అన్నాడు.

నిన్ననే ఇంటాయన అన్నాడు నన్నుచూసి—"నేనూ ఇప్పుడు ఒంటరిగా ఉన్నాను కాబట్టి ఓ రోజు సరదాగా మనమంతా అడ్డాటలో కూర్చుందాం—" అని అది గుర్తుకొచ్చి మన మెప్పుడేం చేయబోయేదీ మనకే తెలియదుగదా అనుకున్నాను. నేను వచ్చిన పని ఇప్పుడీయనకు చెప్పి ప్రయోజనంలేదు. శ్రీధరబాబు వచ్చేవరకూ అతని చెల్లెల్ని—అతని వాటాలో మకాం పెట్టించి—నేనీయనతో కాలక్షేపం చేద్దామనుకు న్నాను. ఊరి ప్రయాణం హడావుడిలో ఉన్న ఈయనకు శ్రీధరబాబు లేని సమయంలో అతని చెల్లెలు రాబోతున్న సందర్భం—తెలియనివ్వడం అనవసరమని తోచింది. అందుకే కాస్త మాట మార్చి—"అబ్బే ఏమీలేదు. ఉబుసుపోక వచ్చాను. అంతా నా పాదం మంచిదంటారు. చూశారా, నేను మీ ఇంట్లో కాలుపెట్టాను మీకు కొడుకు పుట్టిన వార్త అందింది. కంగ్రాట్యులేషన్స్!" అన్నాను.

"థాంక్సండీ—"అన్నాడాయన.

"ఇంతకీ ప్రయాణమంటున్నారు—ఎన్నాళ్ళేమిటి మకాం!"

"మూడు వారాలు!" అన్నాడాయన.

"హతోస్మి!" అనుకున్నాను.

# 3

ఇంటాయన తెల్లవారు ఝామునే లేచి వెళ్ళి పోయాడు. నేను ఉదయం పదిగంటల ప్రాంతంలో నా ఆఫీసు పనిమీద బయటకు వెళ్ళాను పార్వతికోసం స్టేషన్‌కు వెళ్ళదల్చు కోలేదు కాబట్టి—బయటకు వెళ్ళబోయేముందు—తాళం కప్పకు ఓ ఉత్తరం రాసి పెట్టాను. అందులో శ్రీధరబాబు ఊళ్ళోలేని సంగతి రాసి—నేను ఇంటికి వచ్చే టైము కూడా ఇచ్చాను.

హైదరాబాద్ ఎక్స్‌ప్రెస్ అక్కడకు సుమారు నాలుగు గంటలకు వస్తుంది. నా ఆఫీసు పని కూడా నాలుగు గంటలకే అయింది. స్టేషన్‌కు ఫోన్‌చేసి—ట్రయిన్ లేట్ఏమో కనుక్కున్నాను. ఆ రోజు కరెక్టు టైమ్‌కే వచ్చిందట. నేను టైము గణించు కున్నాను.

పార్వతి స్టేషన్లోదిగి కాసేపు అన్న గురించి ఎదురు చూస్తుంది. ఆ తర్వాత నెమ్మదిగా ఆలోచించి మరి అన్న రాడని గ్రహించడానికి కనీసం ఒక అరగంటైనా పడుతుంది. అప్పుడామె విసుక్కుంటూ ఏరిక్షాలోనో గదికి బయల్దేరు తుంది. ఇదంతాజరిగి ఆమె గదికిచేరుకునేసరికి సుమారు అయిదవుతుంది. ఉదయం చీటీలో అయిదున్నరకు వస్తానని రాసినా ఓపావుగంట ముందుగా వెళ్ళడం మంచిదని తోచింది.

నాలెక్క తప్పలేదు. నేను వెళ్ళేసరికి ఇంటివరండాలో—ఒకయువతి కూర్చునిఉంది. ఆఇంటికి అదేవరండా, అదేవీధరుగు

అనిచెప్పవచు. ఎదురుగుమ్మం ఇంటాయనది ప్రక్కగుమ్మం శ్రీధరబాబుది!

ఆ యువతిని చూస్తూనే నేను తెల్లబోయాను. ఆమె అందంలో అప్సరస. చూసిన క్షణంలో అంతకు మించి మరే ఆలోచనా బుర్రలో కదలలేదు.

నేనూ ఆఇంటి వరండాలో అడుగిడుబోతూండడం చూసి ఆమె అసహనంగా నావంకచూసి— "మీరేనా అన్నయ్య స్నేహితుడు?" అనడిగింది.

తియ్యని ఆ పలుకులు వింటుకూడా— సమాధానమెలా ఇవ్వ గలిగానో నాకు ఆశ్చర్యమే మరి "శ్రీధరబాబు చెల్లెలు మీరే నన్నమాట!" అన్నాను.

"చెల్లెలు అనేఅనుకోండి" అనిఆమె అదోకలానవ్వింది "ఇంతకీ అన్నయ్య ఎప్పుడువస్తాడు?"

"రెండు లేక మూడు రోజులు"

"బాప్‌రే!" అందామె చిరాకును వ్యక్తపరుస్తూ.

"ముందుగదిలోకిపదండి!" అన్నాను నేనుముందడుగువేసి.

తలుపు తాళంతీసాను ఆమెలోపలకు ప్రవేశించింది చిన్న సూట్‌కేసుతో

"ఇటువంటి పరిస్థితి వస్తుందని బాబు ఊహించలేదు. లేకపోతే నీగురించి ఏదోమంచి ఏర్పాటుచేసి ఉండేవాడు. టెల్రిగాం కూడా అతను లేని సమయంలో వచ్చింది. మరి ఇప్పుడింకఒక్కటే ఉపాయం. మీరిక్కడహాయిగా మకాంపెట్టు కోండి. మీ అవసరాలన్నీ నేను చూస్తూంటాను. రాత్రిళ్ళు నే నెక్కడేనా పడుకునే ఏర్పాటు చేసుకుంటాను" అన్నాను.

ఆమె తమాషాగానవ్వి— "మొలాన్నికిమగవాణ్ణనిపించారు. చచ్చిప్రయాణంచేసి నేనువస్తే మీరు రాత్రిగురించి ఆలోచిస్తు

నారు''— అంది.

దెబ్బతిన్నాను — అయినా లొంగకుండా— ''నిజంచెప్పాలంటే మీరు ప్రయాణంచేసి వచ్చేరనిపించడంలేదు. పువ్వులా ఇంతపిసరు నలగకుండా వచ్చారు''—అన్నాను.

ఆమెముఖంలో రవంత గర్వంలాంటిది కనబడింది.— ''బాగానే ఉంది మీ పొగడ్త! కానీ పెళ్ళికాని ఆడది నలిగిన పువ్వులా ఉంటుందని ఎలాగనుకున్నారో నాకు మాత్రం తెలియడంలేదు ''—

మళ్ళీదెబ్బతిన్నాను. ఘటికురాలే శ్రీధరబాబు చెల్లెలు అనుకున్నాను. ఈమెదగ్గర నాకింత పిసరుకూడా బెరుకు అనిపించడంలేదు. ఈ జీగా మాట్లాడగలుగుతున్నాను. మనిషి ఫ్రీగా మసులుతుంది.— ''మీతో మాట్లాడటం కష్టం. ప్రస్తుతం మీగురించి నే నేం చేయవలసిఉందో చెప్పితే అలామసులుకుంటాను.'' అన్నాను వినయంగా.

''దారికి వచ్చారు. అయితే ఈగదికి నేను యజమానిని. నా అన్నయ్యకు అతిధికాబట్టి మీరు నాకూ అతిథే అవుతారు. అతిధి మర్యాదలు చేయడం నాకు బాగాతెలుసు. ముందు మీరలా కుర్చీలో కూర్చోండి. అతిథుల్ని నిలబెట్టి మాట్లాడకూడదు''— అందామె చనువుగా.

''నేనువెళ్ళి కుర్చీలో కూర్చున్నాను. ఆమెకదిలి శ్రీధరబాబు మంచంమీద కూర్చుంది.''— ఇప్పుడు మనంకాసేపు ఏమైనా కబుర్లు చెప్పుకుందాం''— అందామె అదోకలా వళ్ళు విరుచుకుంటూ.

ఉండిండీ ఉండిండీ ప్రక్కదారులు పడుతున్న మనసును నిలదొక్కుకుంటూ— ''కబుర్లా కథలుకూడానా''? అనడిగాను.

''కథలే అనుకోండి— కాకపోతే కథలాంటి కబుర్లు''......

"అయితే నాకుచేతకాదు. మీరే చెప్పాలి!" అన్నాను.

"అర్థమైందిలెండి — మీకునాతో మాట్లాడం ఇష్టంలేదు"— అందామె కాస్త కోపంగా.

"అలాగని ఎందుకనుకుంటున్నారు? మీరుమాటాడు తూంటే అలావింటూ ఉండిపోవాలనిపించడం జరగవచ్చు కదా!" అన్నాను.

చప్పట్లు కావాలంటే రెండు చేతులూ కలవాలి. సంభాషణ నడవాలంటే కనీసం ఇద్దరు మాట్లాడాలి."

"మాట్లాడ్డానికి నాకేమీ అభ్యంతరంలేదు. కానీ ఒక్క మనవి. మీకూనాకూ ఇంతవరకూ ఏవిధమైన పరిచయమూ లేదు. అందులోనూ మీరు ఆడ, నేనుమగ. విచిత్ర పరిస్థితుల్లో మనమిక్కడ కలుసుకున్నాం. ఇవన్నీ కాస్త సంకోచానికి సరైన కారణాలు కావంటారా?" అన్నాను.

ఆమె భావగర్భితంగా నావైపుచూచింది—"ఒప్పుకున్నాను. కానీ నేను కాస్త ధోరణి మనిషిని. కొత్త, పాత అని లేకుండా ఎవరితోనైనా నేను గంటలతరబడి మాట్లాడేయగలను. అలా మాట్లాడాలనే నాకుంటుందికూడా. కానీ అస్తమానం అవ కాశం కలిసిరాదు. మంచి ఉత్సాహంతో కబుర్లు చెప్పుకునే సమయంలో— అబ్బ ఈపెద్దవాళ్ళున్నారు చూశారూ — పానకంలో పుడకల్లా అడ్డుపడతారు"......................

నేనామెను మధ్యలో ఆపి"— "ఇంతకూ మీఅన్నయ్య కూడామీరంటున్న పెద్దల్లో ఒకడా?" అనడిగాను.

"అనే అనుకోండి—" అందామెనవ్వి.

# 4

ఆమె స్నానం చేస్తానంది. ఆ సమయంలో నేను వెళ్ళి తినడానికి ఏమైనా తెస్తానని చెప్పి బయట పడ్డాను.

పార్వతి ప్రవర్తన కాస్త చిత్రంగానే ఉందినాకు. మనిషి చాలా అందంగాఉంది. కంఠం తియ్యనిది. డాషింగ్ నేచర్ ఉంది. శ్రీధరబాబు తన చెల్లెలు ప్రసక్తి ఇతరులు తీసుకువస్తే సహించలేకపోవడానికీ— పార్వతి స్వభావానికీ ఏదైనా సంబంధముందా అన్న అనుమానం నాకు లీలగాతోచింది.

దోసెలూ, ఇడ్లీ పార్సెల్ కట్టించుకుని నేను గదికి వెళ్ళి తలుపు తట్టేసరికి తల ఆరబోసుకుని ఉన్న పార్వతి తలుపు తీసింది. ఆ రూపంలో ఆమె చాలా చాలా అందంగా ఉండడం వల్ల నేను ఒక్కక్షణంపాటు అలా కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయాను.

"తలుపులు తీశానుమరి. అయినా మీరు లోపలకు రావడంలేదు—" అందామె.

ఆమె మాటల్లో నాకు రెండర్థాలు ధ్వనించాయి. తన హృదయపు తలుపులు తెరిస్తే నేను సంకోచిస్తూన్నట్లుగా ఆమె అన్నట్లు నాకు అనిపించింది. నేను గదిలో అడుగు పెట్టి మళ్ళీ తలుపులు వేసి ముందడుగు వేస్తూ కూడా ఆమెను అలా కళ్ళప్పగించి చూస్తున్నాను

ఆమె మంచం మీద కూర్చుంది. నేను కుర్చీలో కూర్చున్నాను. అప్పుడు నాకు పార్వతి గురించి టిఫెన్ తెచ్చిన విషయం స్ఫురణకు వచ్చి లేచి వెళ్ళి "మీకోసం టిఫెన్ తీసుకవచ్చాను—" అంటూ ఆమెకు పొట్లాలు అందించాను.

ఆ అందించడంలో ఇద్దరి చేతులూ కొద్దిగా తగిలాయి. ఆస్పర్శలోని మధురాను భూతిని వర్ణించలేను కానీ ఒకసారి ఆమెను దగ్గరగా లాక్కోవాలనిపించింది. నామెదడులోని ఆలోచన ఇంకా ఒకరూపానికి వచ్చేలోగానే— సుదర్శనం గుండెలమీద కూర్చుని అతగాడి గొంతు నులుముతున్న శ్రీధర

బాబు రూపం భయంకరంగా స్పష్టంగా ఊహలో కనిపించింది. చటుక్కున వెళ్ళి కుర్చీలో కూర్చున్నాను. పార్వతిని శ్రీధర బాబు చెల్లెలిగా గుర్తించడం జరగడంతో నేను పూర్తిగా నార్మల్‌కు వచ్చాను.

"ఇంత కొద్దిగా తెచ్చారు. ఇది ఇద్దరికేం సరిపోతుంది?" అందిపార్వతి.

"నేను తినే వచ్చాను—,, అన్నాను.

"నాఅతిథులు హోటల్‌లో తినడం నేను సహించలేను. నాతోపాటు ఇంట్లో తిని తీరవలసిందే—" అంటూ ఆమె టిఫెన్‌ని రెండు సమభాగాలు చేసింది. ఆక్షణంలో ఆమె ఆప్యాయతకు ఒక యువకుడిలా కాక చంటిపిల్లవాడిలా లొంగి పోయాను. ఇద్దరం టిఫెన్ తిన్నాం.

ఆమె టైము చూసుకుని—" నిజానికి ఇది భోజనం టైము అంది.

"ఏడుగంటలకు భోంచేయడం నాకు అలవాటులేదు—" అన్నాను.

"అవుననుకొండి. కానీ ఏడుగంటల ప్రాంతంలో టిఫెన్ తీసుకుంటే రాత్రికి భోజనం చేస్తారా— మరిపస్తేనా?" అనడిగిందామె.

"భోజనం తొమ్మిది గంటలకి!"

"అయితే అప్పుడు మళ్ళీ వెళ్ళి భోజనం తీసుకొస్తారా—" అని నాజవాబుకు ఆగకుండానే—,, నాఅతిథిని అంత రాత్రి వేళ ఒంటరిగా బయటకు పంపడం నాకిష్టముండదు. కాబట్టి హోటలుకు నేనూ మీతో వస్తాను —" అంది.

"అతిథిని హోటల్‌లో భోంచేయనిస్తారా మరి—" అన్నాను ఆమెను దెబ్బతీయగలిగినందుకు సంబరపడుతూ.

"భలేవారే — ఆడది ప్రక్కన ఉన్న చోట ఇల్లు కాక హోటలెలా అవుతుందండీ!" అని ఆమె నవ్వేసింది.

ఎనిమిది గంటల ప్రాంతంలో ఇద్దరం గదిలోంచి బయటకువచ్చి కాసేపు వీధులలో విహరించాం. తొమ్మిది గంటల ప్రాంతంలో ఒక హోటల్‌లో భోజనం చేశాం. అన్నిచోట్ల డబ్బు నేను ఇచ్చాను. భోజనమై బయటకు వచ్చేక ఆమెతో—,, మరి నేను సెలవు తీసుకుంటాను. పునర్దర్శనం మళ్ళీ రేపు ఉదయం చేసుకుంటాను—" అన్నాను.

"ఒకర్తినీ ఒంటరిగా అంత ఇంట్లో నేనుండలేను. అంతగా మీకా ఇంట్లో పడుకోవడం ఇష్టంలేక పోతే నేనూ మీతోనే వచ్చేస్తాను—" అందామె.

అది అమాయకత్వమా లేక జాణతనమా అన్నది నాకు తెలియలేదు. నామనసులోని అభిప్రాయాన్ని ఇంకాస్త స్పష్టంగా చెప్పక తప్పదనుకుని—" శ్రీధరబాబు నాకు స్నేహితుడు. అతని మనసుకు కష్టం కలిగించే పని ఏదీ నేను చేయలేను–" అన్నాను.

"రాత్రి పూట తన చెల్లెల్ని ఏకాకిగా కొంపలో వదిలేసి పోయిన స్నేహితుడిని అన్నయ్య క్షమించగలడని నేననుకోను–,,

శ్రీధరబాబు సంగతి బాగా ఎరిగున్న నేను వెంటనే ఏమీ మాట్లాడలేదు, తిరిగి మళ్ళీ ఆమే అన్నది—" నన్నెంతసేపు మీరు మీ స్నేహితుడి చెల్లెలుగానే భావిస్తున్నారు తప్పితే ఒంటరిగా ఉండడానికి భయపడుతున్న ఒక ఆడదానిగా గుర్తించడంలేదు. ఇదేపరిస్థితిలో మీచెల్లెలా ఉంటే మీకింత సంకోచమూ ఉండేదా?"

"అవును. నిజమే! ఆమే నాలోని లోపాన్ని చక్కగా ఎత్తిచూపించింది. పార్వతిని శ్రీధరబాబు చెల్లెలుగా మాత్రమే

నేను గుర్తిస్తున్నాను తప్పితే నాచెల్లెలిగా భావించలేక పోతు న్నాను—,, అప్పుడే పరిచయమైన వయసులో ఉన్న అందమైన యువతిని చెల్లెలుగా భావించడంలో కష్టం ఫీలవుతున్న నేను అదినాలోపమేనని అంగీకరిస్తున్నాను. కానీ ఏతప్పు చేయ కుండా ఉండడంకోసం అవసరమైన జాగ్రత్తలు తీసుకోవడం లోపమని నేననుకోను.,,

"సరే—ఒక ప్రశ్న అడుగుతాను మీఉద్దేశ్యం నాకర్థ మయింది. పగలు నాతో ఏకాంతంగా కొన్ని గంటలు గడప డానికి భయపడని మీరు రాత్రి అలా చేయడానికి జంకు తున్నారు. కారణం తెలుసుకోవచ్చా?,,

నేను మాట్లాడలేదు. ఆమె ప్రవర్తన నిష్కళంకం కావచ్చు. నేను చాలా బుద్ధిమంతుడిలా ప్రవర్తించవచ్చు.కానీ శ్రీధరబాబు లాంటి వాడికి ఆమె చెల్లెలుకావడం కారణంగా నేను ఏవిధమైన రిస్కూ తీసుకోదల్చలేదు.

ఆమె మళ్ళీ అంది–"సరే–మీ మౌనమే సమాధానమను కుంటాను. నేను రాత్రిళ్ళు ఒంటరిగా గడపలేను. అందుకని చిన్న రిక్వెస్టు. మనం సెంకండ్‌షో సినిమాకి వెడదాం. వదిలే సరికి ఒంటిగంట దాటుతుంది. అప్పుడు నన్ను ఇంటిదగ్గర దిగబెట్టి మీరు మీయిష్టంవచ్చిన చోటుకి వెడుదురుగాని. చాలా భాగం రాత్రి గడిచిపోతుంది కాబట్టి—మిగతా భాగం రాత్రి ఎలాగో అలా ఒంటరిగా గడపడానికి నాభాధ నేను పడతాను."

# 5

ఒక అరగంటసేపు పార్వతి సినిమా బుది గానే చూసింది. ఆతర్వాతనుంచి కొది కొద్దిగా చిలిపిచేష్టలు ప్రారంభమయ్యాయి. ఉండుండి నావైపు వాలిపోతూండేది. నిద్రవస్తోందని సంజా యిషి ఇచ్చుకున్నప్పటికీ ఆమె ముఖంలో ఎక్కడా నిద్రఛాయలు

నాకు కనపడలేదు. ఒకోసారి తన కాలితో నాకాలు నొక్కు తూండేది. చాలాపర్యాయాలు నాచేతిని నొక్కింది.

ఆమెచేసే ఈ చిలిపి పనులు నాకు కోపాన్ని కలిగించ డంలేదు. ఒకపక్క సంతోషిస్తూనే మరోపక్క భయపడు తున్నాను.

నేను సినిమాపై దృష్టి కేంద్రీకరించలేకపోతున్నాను. ఆమె ప్రవర్తనలో నాలో క్రమక్రమంగా అదొకరకమైన ఆవేశం చోటు చేసుకోసాగింది. ఆఖరికి ఒకపర్యాయం ఆమె నాచేతిని తన చేతిలోకి తీసుకొని వంగి మృదువుగా పెదిమలతో స్పృశిం చింది. నా ఆవేశం కట్టలుతెంచుకుంది. ఆమె భుజాలమీదకు చేతులు పోనిచ్చి ఒకసారి దగ్గరగా లాక్కున్నాను. కుర్చీ అడ్డు రాకపోతే నా ఆవేశపు బలానికి ఆమె నాలో ఐక్యం కావలసిందే!

" వాడికి మూడింది! " అన్నమాటలు నాచెవిలో పడగా ఉలిక్కిపడ్డాను. ఎదురుగా వెండితెరపై విలన్ ఆమాటలు అన్నాడు. ఆవిలన్ స్థానంలో నాకు శ్రీధరబాబు కనపడ్డాడు. చావుదెబ్బతిని మూల పడిఉన్న పుల్లారావుకూడా నా కళ్ళ ముందు మెదుల్తున్నాడు.

కేవలం నోటి దురుసుతనం కారణంగా సుదర్శనం, పుల్లారావులాంటివాళ్ళు శ్రీధరబాబు ఆగ్రహానికి గురయ్యారు. నేనింకా ఒక అడుగు ముందుకు వేయబోతున్నాను. ఫలితం ఎలాగుటుందో?

వయసు — ఆహ్వానించే అందమైన యువతి! ఈ రెంటికీ అయస్కాంతం, ఇనుములాంటి సంబంధముందేమో! నేను పార్వతికి లొంగిపోతున్నట్లు గ్రహిస్తూనే — అసలు పార్వతి ఈ విధంగా ప్రవర్తించడానికి కారణమేమైయుంటుందా అని కూడా ఆలోచిస్తున్నాను. కొంపదీసి ఇదేమైనా పెద్దపథకం కాదుగదా

అని నాకు అనిపించసాగింది. శ్రీధరబాబు ఆగ్రహానికి నన్ను గురిచేసి — అతను నన్ను హత్యచేసే పరిస్థితికి దారితీసే సంఘటన ఏర్పడ్డానికి పార్వతికాని ప్రవర్తించడం లేదుకదా అన్న అనుమానం నాకు కలిగింది. అయితే అందుకు కారణమేమైౖ ఉంటుంది? నా శత్రువు ఎవడైనా పార్వతికి ప్రియుడై ఉండవచ్చు. వాడి కోరికపై ఈమె ఇలా ప్రవరిస్తుండవచ్చు.

ఎంత ఆలోచించినా నాకు ఇంత పథకంవేసి నన్ను చంపదల్చుకునేటంత శత్రువెవడుంటాడో తోచలేదు. నా అనుమానం అర్థరహితమనికూడా అనిపించింది. పార్వతివంటి అందమైన అమాయకమైన ఆడపిల్ల ప్రవర్తన వెనుక నేరాన్ని ఊహించడం ఘోరమని కూడా నాకు తోచింది............

సినిమా అయిపోయింది.

రిక్షాలో ఇద్దరం ఇంటిదగ్గరదిగాక ఆమె తనకున్న భయాన్ని వివరించింది. నాకుతెలుసు—ఆరోజు రాత్రి ఇద్దరం ఒకేఇంట్లో నిద్ర చెయ్యవలసివస్తుందని!

ఇద్దరం చెరోగదిలో నిద్రకుపడ్డాం. కేవలం ఇరవై నిముషాలు మాత్రమె వ్యవధిఇచ్చి — ఆమె భయంభయంగా నా గదిలోకి పరుగెత్తుకువచ్చింది. నాకు తెలును — ఆమె అలా చేసే అవకాశమున్నదని!

ఒకే గదిలో ఇద్దరం చెరోప్రక్కపై నిద్రలోపడ్డాం నాకు తెలుసు — మరికొద్ది క్షణాలలో ఏమి జరుగనున్నదీ!

# 6

సరిగ్గా అదే జరిగింది!!

చాలా మామూలుగా తెల్లవారింది. నేను నామీదఉన్న ఆమె చేతిని పక్కకుపెట్టి లేచాను.

నాకిప్పుడు శ్రీధరబాబు ఏదో చేస్తాడన్న భయంకంటె

అతను త్వరగా వచ్చేస్తాడేమోనన్న బెంగ ఎక్కువగా ఉంది. రాత్రి నా అనుభవం అపూర్వం. ఆ అనుభవం నాకు ఇంకా ఇంకా కావాలి. ఇంక శ్రీధరబాబు రావడానికి ఎంతో వ్యవధి లేదు, నాకు పగలల్లా ఆఫీసుపని తప్పనిసరి............

సుమారు మూడురోజులు గడిచాక శ్రీధరబాబు దగ్గర నుంచి ఒక కార్డు వచ్చింది. తనపని ఇంకా కాలేదనీ బహుశా మరి వారంరోజులవరకు తను రాలేకపోవచ్చునన్నీ అతను రాశాడు ఈ విషయం పార్వతికి చెప్పగా ఆమె కంగారును వ్యక్తపరుస్తూ "పెద్ద ఇబ్బంది వచ్చిందే!" అని ఊరుకుంది.

నాకేమి ఇబ్బంది అనిపించలేదు, ఆ కార్డు ఇచ్చిన బలంతో ఆమెని మరికాస్త దగ్గరగా లాక్కుని – "ఇది దేవుడు నాకిచ్చిన అపూర్వావకాశం అన్నాను. ఆమె నావంక ప్రేమగా చూస్తూ–" మీరు మరోలా అనుకోనంటే అడుగుతాను. అన్నయ్య వచ్చేవరకు నాకు కాస్త డబ్బు సర్దగలరా?" అంది.

నాకు జాలికలిగి "ఎంతేమిటి?" అన్నాను.

"చిన్న మొత్తమయితే నాకు బెంగలేదు. ఈ రోజు నేను సాయంత్రం నాలుగు గంటల లోపులో ఒక నెక్లెస్ కొనుక్కో వలసి ఉన్నది. అసలు నేను అన్నయ్య దగ్గరకి వచ్చినదే అందుకు–"

"నాకు సరిగ్గా అర్థం కాలేదు. నెక్లెస్ కొనుక్కోవ డానికి ఒక ప్రత్యేక టైమెందుకు?" అన్నాను.

ఆమె వివరించింది. ఆమె కొనబోయేనగ గురించి తన ఊళ్ళోనే నిర్ణయించుకుంది. ఆమె స్నేహితురాలు అదేరకం నగను ఈ ఊళ్ళో, ఒక స్మగ్లింగ్ వ్యాపారస్తుని దగ్గర కొంది. పార్వతి అభిలాష విన్నాక ఆమె స్నేహితురాలు తనకు తెలిసిన వారిద్వారా ఎంక్వయిరీ చేయించింది. ఈ రోజు

సాయంత్రం నాలుగు గంటల వరకు ఆనగ స్మగ్లర్ వద్ద ఉంటుంది, దాని ఖరీదు పదహారు వందల యాభై అయిదు రూపాయలు.

నా దగ్గర ప్రస్తుతం ఆఫీసు డబ్బు పన్నెండు వేల రూపాయలుంది. ఉళ్ళో నా బ్యాంకు బేలన్స్ రూపాయలతో అయిదంకెల స్థానంలో ఉంది. నేను ఆమె అడిగిన మొత్తాన్ని అవ్వగానేం కర్మ—బహుమతిగానే ఇవ్వగలను—"ఇంతకు మీ అన్నయ్యకు నగ కొనబోతున్న విషయం తెలుసా?" అనడిగాను.

"తెలియదు. వాడి దగ్గర డబ్బుంటుందని మాత్రం తెలుసు. ఎటొచ్చీ ఇదంతా విని ఏమంటాడో మాత్రం తెలియదు."

నేను కాస్త గర్వంగా ముఖం పెట్టి—"ఇది కొనడానికి జంకకు. మీ అన్న వద్దంటాడన్న అనుమానం ఉంటే అది నా కానుకగా భావించు" అన్నాను.

ఆమె ముందు కాస్త ఆశ్చర్యపడినట్లుగా కనబడింది. ఆ తర్వాత లేత తామర తూడుల్లాంటి తన రెండు చేతుల్నీ నా నడుము చుట్టూ చుట్టింది.

"పార్వతీ—నీ వంటి ఆడది ఊఁ అనే అదృష్టం పట్టాలి గానీ ఈ డబ్బు నాకో లెక్కలోది కాదు—" అనుకున్నాను.

# 7

నేను అక్కడ మొత్తం పదహారు రోజులు గడిపాను. శ్రీధరబాబు ఇప్పుడేడు. పార్వతీ, నేనూ విచ్చలవిడిగా విహారాలు సలిపాం. నాకు పార్వతి గురించి రొఖ్ఖం రూపేణా అయిన ఖర్చు రెండు వేలపై చిలుకు, కానీ నేనందుకున్న అనుభవవు టనుభూతులు ఊహకందనివి, పార్వతి ఇలటికి వెళ్ళి పోవలసి ఉన్న కారణంగా నేను నా ఆఫీసుకు ఎక్స్‌టెన్షన్ గురించి

రాయవలసిన అవసరం కలగలేదు.

వెళ్ళి పోయేటప్పుడు పార్వతి తన గురించి బెర్‌గామ్ కాగితం నింపి అవల పారేసి—"తను లేని సమయంలో నేనిక్కడకు వచ్చి పదహారు రోజాలు గడిపి వెళ్ళిన సంగతి అన్నయ్యకు తెలియకుండా ఉంచడానికి ప్రయత్నించగలిగితే బాగుంటుంది. "అంది.

అదంత సులభం కాదని నాకు తెలుసు, ఆ వీధిలో ఎంతో మంది ఆమెను చూశారు. ఆఫీసు పని మీద వచ్చిన నాకూ ఆమెకూ గల సంబంధం ఏమిటో—ఎంత మందికి తెలుసునో నాకుతెలీదు. ఇంటాయన లేకపోవడమూ, శ్రీధర బాబుకు పని మనిషి అంటూ ఎవరు ఉండక పోవడమూ బహుశా మా వ్యవహారాన్ని రహశ్యంగా ఉంచడానికి కొంత వరకు సహకరించవచ్చు. ఎటొచ్చీ ఇంటాయన తిరిగి వచ్చేక శ్రీధరబాబు ఆయన్ను కలిసేక అసలు బెర్‌గామ్ అనేదొకటి వచ్చిన సంగతి తెలుస్తుంది.

మరి పార్వతి ఇంటి దగ్గర వాళ్ళకు ఎలాగూ తెలుస్తుంది కదా—ఆ అనూమానాన్ని పార్వతి వ్యక్త పరచగా ఆమె నవ్వి —"ఆ భయం నాకు లేదు. నేను అన్నయ్య దగ్గరకు వెడుతున్నట్లుగా ఇంట్లో చెప్పలేదు. నా స్నేహితురాలితో కలిసి ఎక్కడికో వెడుతన్నట్లుగా ఇంట్లోచెప్పి బయల్దేరి చెరో చోటికీ ప్రయాణమయ్యాం. నేను ముందు నా స్నేహితురాలిని కలిసేకనే ఇంటికి వెడతాను." అంది.

"అసాధ్యురాలివే!" అనుకున్నాను. ఇప్పుడు నాకు ఎన్నో ప్రశ్నలకు సమాధానాలు లభించాయి—ఒక్క పార్వతి విపరీత ప్రవర్తనకు కారణ మేమిటీ అన్న ప్రశ్నకు తప్ప.

పార్వతి నగ కొనాలనుకుంది. తను బయల్దేరి వస్తున్న

ట్లుగా అన్నకు టెలిగ్రామ్ ఇచ్చింది. అన్న లేకపోతే నా దగ్గర డబ్బు తీసుకుని నగ కొనుక్కుంది. ఇది అని చెప్పలేని కారణాల వల్ల నాతో కొన్ని రోజులు సంసారం చేసింది. అందుకు ప్రతిఫలం నాదగ్గర ధనరూపేణా పొందింది. ఇప్పుడు తిరిగి ఇంటికి వెడుతోంది. అటు అన్నకు. ఇటు తలిదండ్రులకు తన రహస్యం తెలియకుండా జాగ్రత్త పడుతోంది.

నా ఆఫీసు పని ముగిసింది. పార్వతి వెళ్ళిపోయింది. ఆ కారణంగా నేను తిరుగు ప్రయాణం చేయవలసి ఉంది. శ్రీధరబాబునించి మళ్ళీ ఉత్తరం లేదు. ఆ పరిస్థితుల్లో ఏంచేయాలో తోచక—ఇంటాయనకో రిజిస్టర్డ్ పార్సెల్‌లో శ్రీధరబాబు గది డూప్లికేట్ తాళం పంపించి ఒక ఉత్తరం కూడా రాశాను. అందులో ఎందుకైనా మంచిదని ఒక చిన్న అబద్ధం కూడా రాశాను! టెలిగ్రాం ప్రకారం—శ్రీధరబాబు చెల్లెలు రావలసి ఉన్నప్పటికీ ఏ కారణాల వల్లనో ఆమె రాలేదని.

నేను ఇల్లు చేరిన నాలుగు రోజులకు శ్రీధరబాబునించి ఉత్తరం వచ్చింది. అనుకోకుండా ఎదురైన గృహసమస్య కారణంగా తను చిరునామాకూడా ఇవ్వకుండా మాయమైనాడనీ' అన్యథా భావించవద్దనీ అతను రాశాడు. సేల్సు వ్యవహారంలో అనుకోకుండా అతను తన ఊరు వెళ్ళడం సంభవించిందట—అనుమాన పరిస్థితులలో అతని చెల్లెలు మాయమైందట

"నీకు తెలుసుగదా—నాకు నా చెల్లెలికీ ఉన్న అనుబంధం, ప్రస్తుతం అన్వేషణలో ఉన్నాను. అన్వేషణ ముగిసే వరకూ మరేపనీ చేయలేను. అందుకే వచ్చి ఇల్లు కాళీచేసి వెళ్ళి

పోతున్నాను. బల్లమీద నీ చిరునామా వదలి వెళ్ళినందుకు ధన్యవాదాలు. చాలాకాలం తర్వాత కలుసుకున్నందుకు సరిగ్గా గడప లేకపోయాము. మరోసారి మంచి అవకాశం వస్తుందనీ, అది సక్రమంగా వినియోగించుకోగలమనీ ఆశిస్తున్నాను''— అనిరాశాడతను.

# 8

ఆ రోజు అరుణా హోటల్ చాలా రష్‌గా ఉంది. నన్ను బాగా తెలిసున్న సర్వర్—''అలావెళ్ళండి సార్! అక్కడ ఖాళీ ఉంది.—'' అని దారి చూపించాడు.

అది ఫామిలీస్ కోసం ఉద్దేశించబడిన అపార్టుమెంట్. అలాంటి అపార్ట్‌మెంట్సు అక్కడ చాలా ఉన్నాయి. ఒకో అపార్టుమెంట్లో నాలుగుసీట్లు మాత్రం ఉంటాయి. సాధారణంగా బ్రహ్మచారి యువకులు ఒంటరిగా వాటిలోకి వెళ్ళే అవకాశం రాదు. సర్వర్‌చెప్పాడు కదా అని నేను వెళ్ళాను. అక్కడ రెండు సీట్లు ఖాళీగా ఉన్నాయి. ఒక సీట్లో కూర్చున్నాక యథాలాపంగా ఎదుటిసీట్లో ఉన్న జంటను చూశాను. ఉలిక్కి పడ్డాను.పార్వతి!

అప్రయత్నంగా—''పార్వతీ!'' అన్నాను. ఆమెనన్ను చూసి ఉలిక్కిపడింది. ఆమె ప్రక్కనున్న యువకుడు నావంక గుర్రుగా చూశాడు.

''ఇక్కడి కెప్పుడొచ్చావ్ పార్వతీ!'' అన్నాను నేను.

''ఎవరు మీరు?'' అనడిగాడా యువకుడు.

''ఆమెనే అడగండి—''అన్నాను ధైర్యంగా. సర్వర్ లోపలకు వచ్చాడు. వాళ్ళూ నేను కూడా మా అర్డర్సు చెప్పాం. సర్వర్ మంచినీళ్ళు పెట్టి వెళ్ళిపోయాడు మరో జంట మా అపార్ట్‌మెంట్లోకి తొంగిచూసి—ఒకసీటే

కాళీ ఉండడం చూసి వెనక్కి వెళ్ళిపోయారు.

"మీరెవరో నాకు తెలియదు—"అంది పార్వతి.

"అబద్ధ మాడకు పార్వతీ—...."అన్నాను.

"ఆమె పేరు పార్వతి కాదు—"అన్నాడా యువకుడు.

"ఇంట్లోంచి పారిపోయిన వాళ్ళు పేరు మార్చుకోవడం అసహజం కాదు—"అన్నాను చలించకుండా.

"ఎవరండీ మీరు? అంత నమ్మకంగా మాట్లాడుతున్నారు—ఈమె మీ కేమవుతుంది?"అన్నాడా యువకుడు చిరాగ్గా.

"ఈమె నాస్నేహితుడి చెల్లెలు. ప్రస్తుతం ఈమె అన్న ఈమె గురించి అన్వేషణలో ఉన్నాడు."అన్నాను.

"మీరు నిజంగా పొరబడ్డారు. ఈమెపేరు శారద. మీరనుకుంటున్న పార్వతి ఈమె కావడం అసంభవం—" అన్నాడా యువకుడు.

"ఎందువల్ల?"అన్నాను అసహనంగా.

"ఎవరైనా పరాయివాడు మీ ఆవిణ్ణి పార్వతీ అని పిలిచినప్పుడు—ఆపేరునిజమో, తప్పో మీకుతెలియదా?" అనడిగింది పార్వతి.

"అంటే—?"

"మే మిద రం భార్యాభర్తలం—" అన్నాడా యువకుడు.

ఆశ్చర్యపడ్డాను. నాకదంత సంభవం అనిపించలేదు—"ఎన్నాళ్ళయింది మీవివాహమై?" అనడిగాను.

"పదినెలలు—"

పార్వతితో ఆ అపూర్వానుభవం జరిగి ఇంకా రెండునెలల పూర్తికాలేదు. అందుకే "రెండునెలలు క్రితం మీభార్య తన అన్నగారింటికి వెళ్ళడం సంభవించి ఉండాలి! "అన్నాను.

ఆ యువకుడు నావంక జాలిగాచూసి—"మీరు చూడ్డానికి పెద్ద మనిషిలా కనబడుతున్నారు. మీరనుకుంటున్న పార్వతి అన్న మీకు నిజంగా ప్రాణస్నేహితుడై ఉండాలి, నా భార్యకూ—ఆ పార్వతికీ పోలికలున్నాయేమో నాకు తెలియదు. ఈమె పార్వతి కాదనీ శారద అనీ మరోసారి చెబుతున్నాను. గత ఎనిమిది మాసాలుగా మేమిద్దరం ఒకరిని విడిచి ఒకరు ఉండడం జరగలేదు. దయఉంచి మీరు మమ్మల్నింక వేధించవద్దు—"అన్నాడు.

"మీ స్నేహితుడి చెల్లెలి ఫోటో ఒకటి ఉంటే ఇవ్వండి. అనుకోకుండా ఆమె మాకు తటస్థపడితే—మీకు సహాయపడతాం—"అంది నేను పార్వతిగా భావిస్తుంటే కాదు శారదని అంటున్న ఆమె.

పార్వతకి నేను మగవాడు ఆడదానికి అనగలిగినంత దగ్గరా అయ్యాను. ఆమెను గుర్తించడంలో పొరపాటు చేయలేను. అప్పటికి ఊరుకున్నా ఈ విషయాన్నింతటితో వదల దల్చుకోలేదు.

టిఫిన్‌చేసి బయటకు వచ్చేక—హోటల్‌లో ఒక క్లీనర్ కుర్రాడితో మాట్లాడాను వాడికి తరచుగానేను చిల్లర డబ్బులు బక్షీస్‌గా ఇస్తుంటాను. ఆ జంట ఇంటి అడ్రస్ తెలుసుకో వలసిందిగా వాడిని కోరాను ప్రొప్రయిటర్ పర్మిషన్ తీసుకు ఆ కుర్రవాడు జంట వెంటపడ్డాడు.

మర్నాడుదయం హోటల్‌కు వెళ్ళాను. "వాళ్ళు తిన్నగా సినిమాకు పోయారుసార్! నేనూ పోయానుమరి. రాత్రి పదిన్నరకు వాళ్ళు ఇల్లు చేరుకున్నారు—"అంటూ కుర్రాడు చిరునామా ఇచ్చాడు వాడికి పదిరూపాయలు ఇచ్చాను.

# 9

తలుపు తట్టాను కానీ కాస్త భయంగానే ఉంది. ఆమె నన్ను గురించి ఏమనుకుంటుందో, తనునిజంగా పార్వతి కాకపోతే భర్త లేని సమయంలో ఇంటికి వచ్చినందుకు—ఏ విధంగా భావిస్తుందోనన్న జంకు నాలో ఉంది.

తలుపులు తెరుచుకున్నాయి. బహుశా తలస్నానం చేసిందేమో— జుట్టు విరబోసుకుని ఉందామె. సందేహం లేదు— నేనుపొరబడడంలేదు ఈమె పార్వతేనని అనిపించింది.

"మీరా." అందామె తడబడుతూ.

"గుర్తుపట్టారన్నమాట— "అనినవ్వి— "లోపలకు రావచ్చా! "అన్నాను.

"వారు ఇంట్లోలేరు—" అందామెజంకుతూ.

"తెలిసేవచ్చాను—" అంటూ ముందడుగు వేశాను.

"మీకేదైనా పని ఉంటే వారున్నప్పుడు రావచ్చు. సాయంత్రం అయిదు గంటలకు వారు తిరిగివస్తారు—" అందామె.

"అయితే సాయంత్రం అయిదుగంటలవరకూ అతను రాడన్నమాట"! అంటూ తలుపులువేశాను.

ఆమె బెదురుకళ్ళతో నావంక చూస్తూ— "మీరే ఉద్దేశ్యంతో ఇక్కడకు వచ్చినా— నలుగురూ చెడు ఉద్దేశ్యంతో వచ్చినట్లే భావిస్తారు. నా కాపురంలో నిప్పులు పోయకండి—" అందామె.

నేను తడబడ్డాను. నిజంగా నేనొక అమాయకురాలిని బాధించడం లేదుకద— అనిపించింది! అయినా నెమ్మదిగా— "పార్వతిని నేనుమరిచిపోలేదు. ఒకటికాదు రెండుకాదు— పదహారురోజులు ఆమె నాదానిగా మసలింది. ఆమెతో గడిపిన

ప్రతిక్షణం మధురం, అపూర్వం! ఆ పార్వతిని గుర్తుపట్టడంలో నేను పొరపడను. నువ్వుపార్వతివి. కాదనకు. అప్పుడు నీకు దూరంగాఉండడానికి ప్రయత్నిస్తే రెచ్చగొట్టి దగ్గరచేసుకున్నావు ఇప్పుడు దగ్గరకు రావడానికి ప్రయత్నిస్తూంటే అబద్ధాలు చెప్పి— పొమ్మంటున్నావు. నీ విచిత్ర ప్రవర్తనకు కారణం తెలియడంలేదు—'' అన్నాను.

''మీ ప్రవర్తనే నాకు విచిత్రంగాఉంది. వివాహితురాలైన అడదాని వెంటపడి బాధించడం మీకు భావ్యంకాదు. మీరిలా వచ్చివెళ్ళినట్లు నా భర్త చూస్తే ఏమనుకుంటారు''! అందామె ఇంచుమించు కళ్ళనీళ్ళ పర్యంతమై.

''నువ్వు గొప్పనటివి పార్వతీ—'' అనుకున్నాను. అదే సమయంలో ఎవరో తలుపు తట్టారు. పార్వతి కంగారుపడింది ''ఎవరో వచ్చారు— నామీద దయఉంచి మీరుకాస్త ఆ పక్క గదిలోకి వెళ్ళగలరా'' అంది.

''నేను దొంగనుకాదు. దాక్కోవలసిన అవసరంలేదు—'' అన్నాను.

''కానీ మిమ్మల్ని దాచవలసిన అవసరం నాకుంది— ప్లీజ్—'' అంటూ ఆమె నా చెయ్యిపట్టుకుని పక్కగదిలోకి లాక్కువెళ్ళి ఓ బీరువాపక్క నిలబెట్టి— ''వచ్చినవాళ్ళు వెళ్ళే వరకూ— ఇక్కణించి కదలవద్దు—'' అని వెళ్ళిపోయింది.

ఆఖరికి ఏగతి పట్టింది నాకు!

వచ్చిన వ్యక్తి ఆడదని కంఠం చెబుతూనే ఉంది— ''ఎలా ఉందమ్మా కొత్తకాపురం?'' ఆ అడకంఠం కంగుమని మ్రోగుతుంది.

పార్వతి మాట వినపడలేదు.

''చూడమ్మా— కొత్తగా వచ్చావు. ఈవీధిలో ఎవ్వరూ

కలుపుగోరు మనుషులుకాదు. కొత్తగా ఎవరు వచ్చినా ఒకటి రెండురోజులు చూసి నేనే వచ్చి పలకరించి పోతూంటాను. ఏదైనా సాయంకావాల్సివస్తే అడగడానికి సందేహించకూ—" అందాకంఠం మళ్ళీ.

"అలాగేనండి—" పార్వతి కంఠం.

మరోపావుగంట మాట్లాడేక ఆ కంఠం వెళ్ళిపోయింది. తలుపులు వేసి పార్వతి నాదగ్గరకువచ్చింది. "చూశారా— నన్నె లాంటి ఇబ్బందిలో పెట్టారో—ఆవిడ మీరు లోపలకు రావడం చూసే ఉంటుందని నా అనుమానం—" అంది పార్వతి.

"తప్పులేనిచోట భయంకూడా ఉండదు—" అన్నాను వెటకారంగా.

"అభయం ఆడదానికి తెలుస్తుంది. మగవాడికి అర్థం కాదు—" అందామె.

"భయపడే ఆడదానికీ. భయపడని ఆడదానికీ తేడా— మగవాడికి తెలుస్తుంది—" అంటూనేనామెను సమీపించి దగ్గరగా లాక్కున్నాను. ఒంటరితనం, పూర్వపు చనువు—నాకు ఆవేశాన్ని కలిగించగా నేను కాస్త ధైర్యం చేశాను. ఆమెమాట్లాడ కుండా వణుకుతుంది. మరి భయమో ఏకారణం తేలియదు— ఆమె అరవలేదు కానీ గింజు కుంటోంది వీలైనంత మౌనంగా.

ఆమాత్రం చాలునాకు. ప్రస్తుతం శ్రీధరబాబు చెల్లెలు ఇక్కడెందుకున్నదీ అన్న వివరంమీద నాకు ఆసక్తిలేదు. ఆ అవకాశాన్ని వినియోగించుకోవడం మీదనే నా ఆసక్తి!

"ఒకప్పుడు నీ గురించి రెండువేలు ఖర్చుపెటాను. నాకు డబ్బు లెక్కలేదని గ్రహించే ఉంటావు. నీ భర్త అయిదు గంటల వరకూ రాడుకదా— మనకుచాలా సమయం ఉంది—" అన్నాను.

"ఇదిమీకు న్యాయంకాదు, పెళ్ళైన దాన్ని—" అందామె ఇంచుమించు ఏడుస్తూ. ఆమె అసహాయత నాకు తెలిసిపోయేక నా ధైర్యం పెరిగింది. "నేను నీకుకొత్తకాదు—" అన్నాను.

ఒక్కప్పుడు పార్వతి నన్ను లొంగదీసుకుంది. ఈ రోజు నేనామెను లోంగదీసుకున్నాను.

# 10

నేను వెళ్ళిన పని ఏమిటి— చేసినపని ఎమిటి అనితల్చుకుంటే నాకేసిగ్గువేసింది పశువులా ప్రవర్తించడమంటే ఆదేనేమో!

అయితే నా సిగ్గూ, పశ్చాత్తాపం కొన్నిక్షణాలు మాత్రమే! మర్నాడు నేను మళ్ళీ పార్వతి ఇంటికి వెళ్ళాను. తలుపు తీసిన పార్వతి తలుపువేసు కోబోయింది. ఎలాగో లోపల అడుగు పెట్టాను. ఈరోజు ఆమె నిన్నటికంటె సులభంగా లొంగిపోయింది. మూడు వందల నోట్లుంచిన ఒక కవరు ఆమె గురించి వదిలేసి వచ్చాను.

ఆ తరువాత కనీసం పదిసార్లు పార్వతి ఇంటికి వెళ్ళాను. ఈ పదిరోజుల్లోనూ ఆమెగురించి నేను ఎక్కువగా తెలుసుకున్నదేమీలేదు. పదకొండవసారి ఆమె ఇంటికి వెళ్ళినప్పుడా ఇంటికి తాళంవేసి ఉంది.

ఆవేసినతాళం చాలారోజులు అలాగే ఉంది. ఒక నెల రోజుల అనంతరం మాత్రం— మళ్ళీతాళం తీసిఉంది. ఆశగా వెళ్ళితలుపు తట్టాను. తలుపులు తెరుచుకున్నాయి. ఒకముసలమ్మగారు— "ఎవరుబాబూ—" అంటూపలకరించింది.

కాస్తషాక్ తిన్నాను— ఈ ఇంట్లో శంకర్రావుగారని ఒకరుండాలి!......"

"ఆయన ఇల్లుకాళీచేసి ఓ వారం రోజులయుటుందను కుంటాను— నిన్ననే మేము దిగాం—" అందా బామ్మగారు.

నేను అక్కణ్ణించి బయట పడ్డాను. దొరికినట్లే దొరికి పార్వతి మళ్ళీమాయమైంది. ఆమెను గురించిన మిస్టరీ అర్థం చేసుకుందుకు ప్రయత్నించవలసిన నేను —అలా చేయలేక పోయాను. నాలోని బలహీనత మరే ఇతర విషయంమీదా దృష్టిని కేంద్రీకరించలేకుండా చేసింది....................

రోజులు గడుస్తున్నాయి.

ఉద్యోగానికి సంబందించి మళ్ళీ నేను క్యాంపుకు వెళ్ళవలసి వచ్చింది. ఈ పర్యాయం నాతోపాటు నాకొలీగ్ శివరావు కూడా ఉన్నాడు. ఇద్దరం కలిసి కాస్త ఓమాదిరి పెద్ద పట్టణానికే మూడువారాలటూర్ ప్రోగ్రాం మీాద బయలుదేరాం.

ఇద్దరం ఒకహోటల్లో బసచేద్దామనుకుంటే శివరావు అలా వద్దన్నాడు— "చక్కగా ఒక ఫామిలీ పోర్షన్ అద్దెకు తీసుకుందాం—" అన్నాడు.

నేను సరేనన్నాను. వెళ్ళినరోజు సాయంత్రం లగేజి క్లోక్ రూమ్‌లో పడేసేక శివరావుని అనుసరించాను అతను తిన్నగా ఒక హోటల్‌కు దారితీశాడు. అక్కడ అతను హోటల్ ప్రొప్రయిటర్‌కి తనపేరుచెప్పి— "నేను వ్రాసిన ఉత్తరం అందిందను కుంటాను. అన్నిఏర్పాట్లూ చేసే ఉంటారను కుంటాను—" అన్నాడు.

ప్రొప్రయిటర్ పరిచయ పూర్వకంగానవ్వి ఒక్కసారి ఏదో పుస్తకం తిరగేసి జేబులోంచి ఒకకాగితంతీసి దానిమీద ఓ అడ్రస్ రాసిచ్చాడు.

"పదపోదాం—" అన్నాడు శివరావునాతో.

శివరావు మాఊరు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చి మూడునెలలే

అయిప్పటికీ నాకుత్వరగా సన్నిహితుడయ్యాడు. అతనికి నాకు తెలి యని ఎన్నో విషయాల్లో అనుభవముంది— కావడానికి నా వయసువాడే అయినా!

శివరావు ఆ అడ్రస్ పట్టుకుని ఆ ఇంటికి చేరుకున్నాడు. ఇల్లు బాగానే ఉంది. శివరావు— "వాటా మనకు కావలసిన విధం గానేఉంది. ఇందులో సులభంగా రెండు కాపురాలు నడపొచ్చు" అన్నాడు.

ఇంటాయనకు అతను వందరూపాయలు ఇచ్చి—"టెంపరె రీగా క్యాంపుపనిమీద ఇక్కడకు వచ్చాం, ఇంత సౌకర్యముగల ఇల్లు దొరుకుతుందని మేమూ వినివుంటే కూడా శ్రీమతులను వెంటబెట్టుకు వచ్చిఉండేవాళ్ళం. ఈరోజే టెలిగ్రావ్ ఇస్తాం రెండుమూడు రోజుల్లో మా ఫామిలీస్ రావచ్చు—" అన్నాడు.

నేను ఆశ్చర్యంగా శివరావు మాటలు వింటూ ఊరుకు న్నాను కానీ ఏమీ మాట్లాడలేదు.

శివరావు భార్య ప్రస్తుతం ఏదో జబ్బుతో ఉన్నకారణంగా పుట్టింట్లో ఉంది. ఆమెకు విశ్రాంతి అవసరమనీ సాధ్యమైనంత వరకూ కొద్దినెలలపాటు భర్తకు దూరంగా ఉండటం మంచిదనీ డాక్టర్లు చెప్పినట్లు అతనునాకు ఇదివరలో చెప్పాడు. నా విషయం సరేసరి! బ్రహ్మచారిని. ఇప్పుడు మా ఫామిలీస్ ఎక్కణ్ణించి వస్తాయి? ఇదే సందేహాన్ని ఇంటాయన వెళ్ళిపోయాక శివరావు దగ్గర వెలుబుచ్చాను. శివరావు జవాబుగా నవ్వేశాడు— "ఇప్పుడు మనం అందుకే వెడుతున్నది!"

ఈసారి ఇద్దరం మళ్ళీ ఒక్క కొత్త చోటుకి వెళ్ళాం. అది ఒక చిన్నగది. ఆగదిలో ఒకేఒక మనిషి ఉన్నాడు. గది ముందు మాత్రం యాత్రీకుల సమాచార కార్యలయం అన్న బోర్డు ఉంది. శివరావు అక్కడున్నతనితో— "నా ఉత్తరం మీకు అందే

ఉంటుందనుకుంటాను-'' అంటూ తనపేరూ వివరాలూ చెప్పాడు.

అవ్యక్తి నవ్వి పక్కకు కదిలి అక్కడున్న బీరువాతలుపులు తీసి మూడు పుస్తకాలు మా ముందు పెట్టి- ''ఎన్నికచేసు కోండి-'' అన్నాడు.

ఆ పుస్తకాలో ఊహించిన విధంగానే ఆడవాళ్ళ ఫొటోలు ఫొటో క్రింద వారి వయస్సు ఉన్నాయి. శివరావు నా వంకచూసి ''నీకు అభ్యంతరమా-'' అనడిగాడు. అతని ఉదేశ్యం అర్థం చేసుకున్న నేను లేదన్నట్లుగా తలఆడించాను.

శివరావు ఒక పుస్తకం తిరగేసి తనఎన్నిక పూర్తిచేశాడు. నేను కూడా పుస్తకం తిరగేస్తున్నాను. కానీ నా చేతులు కొద్దిగా వణుకుతున్నాయి. అనుకోకుండా పార్వతిని అనుభవించడం జరిగింది తప్పితే నేను వేశ్యలకోసం ప్రాకులాడడం ఇదే మొదలు ఆ పుస్తకంలో ఉన్నఅందరూ అందంగానే ఉన్నారు. నేను చూడ లేననిపించి శివరావునే నాక్కూడా ఎన్నిక చేసిపెట్టమన్నాను. అక్కడికి ఆపనీ పూర్తయింది.

''ఏమిటి మీ బందుత్వం?'' అనడిగాడావ్యక్తి.

''భార్య!'' అన్నాడు శివరావు.

అవ్యక్తి ఎక్కడికో ఫోన్‌చేశాడు. కాస్సేపు ఆగాడు. అతని బల్లమీది ఫోన్ అయిదు నిముషాల్లో మళ్ళీ మ్రోగింది. అతను పెన్సల్‌తో కాగితంమీద ఏవో వివరాలు నోట్ చేసుకొని శివరావు వంకచూసి— ''సారీసార్ మరోసారి బుక్స్ తిరగేసి మరెవరి నైనా సెలక్ట్ చేసుకొండి మీ కాండిడేట్ ఆల్‌రడీ బుక్ అయి పోయింది—'' అని నావంకచూసి -'' మీవిషయంలో అంతా రైట్ పోయింది -'' అన్నాడు.

శివరావు మళ్ళీ పుస్తకాలు తిరిగేయడం మొదలు

వెట్టాడు. రెండుపుస్తకాలు చూసి **అతను** చిరాగా —"బోర్‌గా ఉంది—" అన్నాడు. అప్పుడు నేను—" నాకాండిడేట్ నీకు నచ్చిందిగదా ఏలాగు నాకు అంత ఆసక్తి లేదనుకో —" అన్నాను.

"కంగారుపడకు మిత్రమా! ఇంకా ఒక పుస్తకముంది మూడువారాలిక్కడ గడపవలసిన అవసరముండి. నాగురించి నువ్వే కాస్త సెలక్షన్ చేసిపెడుతూ—" అన్నాడు.

మూడవ పుస్తకం మొదటి పేజీలోనే కళ్ళుజిగేల్ మని పించే అందంకనపడగా శివరావుకు చూపించాను. "ఫెంటాస్టిక్" అన్నాడు శివరావు. ఆ వ్యక్తి మళ్ళీ ఫోన్‌చేశాడు. ఈ సారి అన్నీ సరి అయ్యాయి—"రేపు సాయంత్రం అయిదు గంటలకు—" అన్నాడతను.

# 11

ఉమ, నేనూ సినిమా థియేటర్‌లో ఉన్నాం. శివరావు శాంతతో ఎక్కడికో పోయాడు. ప్రస్తుతం ఉమ ఇక్కడ నాకు భార్యగా వ్యవహరించబడుతోంది.

సినిమాకు ఇంటర్వెల్ వచ్చింది. లైట్లు వెలిగాయి. నేనూ, ఉమా ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాం. హఠాత్తుగా "హలో సుజాతా"అన్న పిలుపువినబడి ఇద్దరం ఉలిక్కిపడ్డాం. ఒకయువకుడు మావైపే వస్తున్నాడు.

"ఎవరండీ మీరు—"అనడిగాను ఆశ్చర్యంగా.

అతను నాప్రశ్న వినకుండా ఉమవంకే గుచ్చి గుచ్చి చూస్తూ—"సుజాతా నువ్వు ఇక్కడ?" అన్నాడు. ఉమా మాట్లాడలేదు.

నేను ఆ యువకుణ్ణి చూస్తూ మళ్ళీ—"ఈమె పేరు ఉమ. మీరంటున్న సుజాత ఎవరో మాకు తెలియదు—"

అన్నాను.

"నేనునమ్మను సుజాత నాకు బాగా తెలుసు—"అన్నాడా యువకుడు.

"ఇంతకూ మీకు మీరంటున్న సుజాతాకు సంబంధ మేమిటి?" అన్నానుచిరాగ్గా.

"అది మీకనవసరం—"అన్నాడతను తడబడుతూ.

"కానీ నాకు అవసరం. ఉమ నా భార్య అన్నసంగతి మీకు వేరే చెప్పనవసరంలేదనుకుంటాను—"

హాల్లో దీపాలారిపోయాయి. నేను ఉమను చేతిమీద నెమ్మదిగా గిల్లి—"అతను తెలుసుకదూ?"అనడిగాను.

"ఊఁ"అన్నదామె.

సినిమానుంచి ఇంటికి వెళ్ళేవరకూ నేను మరి ఆ యువ కుని ప్రసక్తి తీసుకురాలేదు. ఇంటికి వెళ్ళేక భోజనంచేసి పడుకునేటప్పుడు అమెను అడిగాను—"నీవు చాలా మందితో గడి పిన కారణంగా ఎంతోమందికి ఎన్నోపేర్లతో పరిచయమై ఉంటావు. అందులో నాకేమీ ఆశ్చర్యంలెదు. అయితే నీ వృత్తి తెలుసుండీ ఆ యువకుడు నిన్ను సినిమాలో అలా పేరు పెట్టి పలకరించడానికి కారణం నాకు అర్థంకాలేదు—"అన్నాను.

ఆమె తమాషాగా నవ్వి—"నన్ను మీరు ఉమ అని పిలు స్తారు. కానీ తరవాత ఎప్పుడైనా ఎక్కడైనా ఒక మగవాడి పక్కన తటస్థపడితే మీరు నన్ను ఉమ అని పిలిచి పలకరించరు. అప్పుడు నాపేరు రమ అనివిన్నా ఆశ్చర్యపడరు. కారణం— మీకు నావృత్తి తెలుసు—"అని ఊరుకుంది.

అంటే ఆ యువకుడికి ఈమె వృత్తి తెలియదన్నమాట! అటువంటప్పుడు ఏ పరిస్థితుల్లో వీరి పరిచయం సంభవించిందీ అన్న కుతూహలం నాకు కలిగింది. అందుకే అమెను మళ్ళీ

ప్రశ్నించకుండా ఉండలేకపోయాను. జవాబుగా ఆమె—
"ఇప్పుడు ఇక్కడ నేను రహస్యంగా మరో యువకుడితో పరిచయం పెట్టుకోవడం జరిగితే అతను నన్ను మీ భార్యగా భావిస్తాంటాడు.ఆ యువకుడి విషయంలోనూ అంతే జరిగింది. నాపక్కన భర్తస్థానంలో మిమ్మల్ని చూడటం అతనికి ఆశ్చర్యంకలిగించడం సహజమేనని మీకు ఇప్పుడు అర్థమయి ఉంటుందనుకుంటాను."

ఉలిక్కిపడ్డాను. నా బుర్రలో ఏదో తళుక్కుమన్నట్లయింది. శారదగా వ్యవహరించబడే ఒక అమ్మాయిని నేనూ పార్వతి అనిపిలిచేను. అప్పటి నా స్థితిలోనే ఇప్పటి ఈ యువకుడు ఉండి ఉండాలి.

"బహుశా నన్ను వేధిస్తున్న ఒక ప్రశ్నకు సమాధానం నీ దగ్గర లభించగలదనుకుంటాను. శ్రీధర బాబు అని నాకో మిత్రుడున్నాడు అతని చెల్లెలు పార్వతి అన్నను చూడటానికి వచ్చిన తరుణంలో అక్కడ నేనుండడమూ, అతను లేకపోవడమూ జరిగాయి. అమెతో నాకు పదహారురోజుల పరిచయముంది. ఆ తర్వాత ఆమెను మా ఊళ్ళో శంకర్రావు అనబడే ఒకతని భార్యగా చూసాను. పాతపరిచయాన్ని పురస్కరించుకుని ఆమెను శారీరకంగా లొంగదీసుకోగలిగినా తను పార్వతి అని ఒప్పించలేకపోయాను. అదినాకు మిస్టరీగా మిగిలింది. శ్రీధర బాబు చెల్లెలు అనుమాన పరిస్థితుల్లో ఇంట్లోంచి మాయమైనట్లు నాకు తెలిసింది. మిమ్మల్ని ఎవరు ఎలా ఏర్పాటు చేస్తున్నారు? ఏదైనా పెద్దముఠా, అందమైన అడపిల్లల్ని అపహరించి బలవంతంగా వ్యభిచారంలోకి దింపుతోందా?"అనడిగాను.

ఈ పర్యాయం ఆమె భాదగా నవ్వి—"అందమైన అడ

పిల్లకోసం వేలకొద్ది రూపాయలు కుమ్మరించగల యువకులూ జీవిత భాగస్వామిగా రాబోయే భార్య అంతులేని ధనరాసులు కూడా తీసుకురావాలనుకునే ఆశపోతులూ, దేశంలో అంతులేని పేదరికమూ—ఉన్నంతకాలమూ ఏ ముఠాలూ అవసరం లేకుండానే మాబోటిగాళ్ళం మాకు మేమై ఈ వృత్తిలో దిగ వలసి ఉంటూనే ఉంటుంది.—''అంది.

అంతకుమించి ఆమెనుంచి నాకు ఏ సమాధానమూ లభించలేదు. కులాసాగా గడపవలసిన సమయాన్ని వృథా చర్చ లతో వెళ్ళబుచ్చడం ఇష్టంలేక నేను మరి ఆమెను గురించి వ్యక్తిగత విషయాలు తెలుసుకునేందుకు ప్రయత్నించలేదు.

# 12

ఆరోజు నాకు సరిగ్గా ఏడు వుత్తరాలు వచ్చాయి. ఒకటి మామగారి దగ్గరనుంచీ, ఒకటి నాన్నగారి దగ్గరనుంచీ, రెండు ఓ మాదిరీ పరిచయమున్న స్నేహితుల దగ్గరనుంచీ, ఒకటి చందా గడువు తేదీ పూర్తవున్నట్లు ఒక పత్రికనుంచి గుర్తు వేస్తూ వచ్చినదీ—మిగిలిన రెండు శుభలేఖలు.

ముందు ఉత్తరాలు చదవడం అయ్యాక శుభలేఖలు తీశాను. ఒకటి గతసంవత్సరందాకా ఇక్కడ నాకు కొలీగ్‌గా వుండి ట్రాన్స్‌ఫర్ మీద మరో నగరం వెళ్ళిపోయిన ప్రకాశ రావుది. పెళ్ళికి సరిగ్గా పదమూడు రోజుల వ్యవధి ఉంది. వధువు పేరు పార్వతి. ఊరు పేరు చదువుతూంటే తెలిసిన ట్లుగా అనిపించింది. కానీ చటుక్కున గుర్తురాలేదు.

రెండవ శుభలేఖ ఫ్రం అడ్రస్ చూడగానే ఆ ఊరు నాకెలా తెలుసో స్ఫురించింది. ఆ శుభలేఖ శ్రీధర బాబు దగ్గర నుండి వచ్చింది. శుభలేఖలోని వధువు అతని చెల్లెలు పార్వతి. వరుడు ప్రకాశరావు!

ప్రకాశరావు నాకు చెప్పకోతగ్గ స్నేహితుడు పార్వతి వధువుగా కళ్యాణ మంటపం ఎక్కబోతోందన్న వార్త నాకు ఎంత ఆశ్చర్యాన్ని కలిగించిందో—ఆమె పెళ్ళాడ బోయేది ప్రకాశరావుని అన్నవిషయం అంత బాధను కలిగించింది. ప్రకాశరావు ఆడవాళ్ళ శీలానికి చాలా ప్రాముఖ్యతనిస్తాడు. అతను కూడా ఎంతో బుద్ధిమంతుడు. అలాంటివాడికి పార్వతిలాంటి దుశ్శీల. నెరజాణ—భార్యగారావడం నిజంగా దురదృష్టం. ఇందులో నేను చేయగలిగినదేమీ లేదా అని తర్జన భర్జన చేసుకున్నాక—ఏమీ లేదనే అనిపించింది. అయినా మనసు పీకుతూనే ఉంది.

మొట్ట మొదటిసారిగా శ్రీధర బాబు ఊరికి వెళ్ళాను. నన్నుచూసి శ్రీధర బాబు చాలా సంతోషం వెలిబుచ్చాడు. కానీ నా మనసు అదోలాగుంది. వేళాకోళానికే కావచ్చు. అతన్నొక్క సారి బావా అని పిలిచినందుకు తాత్కాలికంగానైతేనేం అతని చెల్లెలు నా సొంతమయింది. ఈ భయంకర కఠోర సత్యం సహాయంతో శ్రీధర బాబు చెల్లెలి వివాహం చెడగొట్టగలను. ఆ విధంగా నన్ను స్నేహితుడిగా నమ్మిన ప్రకాశరావుకు ద్రోహం చేశాననే వ్యథ నన్ను బాధించకుండా చేసుకోగలను.

కానీ తన చెల్లెల్ని పొరబాటునైనా ఎవరైనా చిన్న ముక్క అనడం సహించలేని శ్రీధర బాబును ప్రళయకాళరుద్రునిగా మార్చే అవకాశం కూడా ఉన్నదని నాకు తెలియకపోలేదు.

నేను ఒక రకమైన ఎక్సయిటెడ్ స్టేట్‌లో ఉన్న కారణంగా ఎప్పుడు ఏ క్షణంలో ఏంచేస్తానో తెలియకుండా ఉంది. ముహూర్తసమయం సమీపిస్తున్నకొద్దీ వధూవరులకూ. వారి తలిదండ్రులకులేని ఉద్వేగం నాకు కలగసాగింది. నేను మంచి వాడినో చెడ్డవాడినో నాకే తెలియదు కానీ వెయ్యి అబద్ధాలైనా ఆడి నిలబెట్టవలసిన పెళ్ళిని ఒకేఒక్క నిజంచెప్పి చెడగొట్టడం

మాత్రం చెయ్యలేదు. పార్వతి ప్రకాశరావు భార్య అయింది.

రిసెప్షన్ సమయంలో ప్రకాశరావు పక్క వధువుస్థానంలో ఉన్న స్త్రీని చూసి షాక్‌తిన్నాను. ఆమె నేనెరిగిన పార్వతికాదు. ఆ షాక్‌నుంచి తేరుకోవడానికి కొంత టైము పట్టింది. ఆ తర్వాత రోజంతా జాగ్రత్తగా పరిశీలించి శ్రీధరబాబు చెల్లెలూ, ప్రకాశరావు భార్యఅయిన పార్వతి నేననుకుంటున్న స్త్రీ కాదని ధృవపర్చుకున్నాను.

అంతేకాదు, ఒకప్పుడు పార్వతి ఇతనికోసం ఇల్లు వదలి పెడితే – ఏమయిందో తెలియక ఇంటిల్లిపాది ఖంగారు పడ్డారనీ తమ వివాహం జరిపించడానికి పెద్దలు అంగీకరించినాకనే ఆమెను ప్రకాశరావు – తిరిగి తలిదండ్రులకు అప్పగించాడనీ ఒక కొత్తనిజంకూడా తెలుసుకున్నాను.

పెళ్ళిపీటలమీద పార్వతిని నేను సరిగ్గా చూడలేదు. నేను మంటపానికి దూరంగా ఉండడమూ, విపరీతమైన వస్త్ర వేష ధారణలతో ఆమెముఖం అస్పష్టంగా ఉండడమూ, తప్పుచేసిన వాడి అనుభూతితో వధూవరులను నేను సూటిగా చూడలేక పోవడమూ – వగైరా కారణాలవల్ల ఈ విచిత్ర సత్యాన్ని ముందుగానే గ్రహించలేకపోయాను.

నేను గ్రహించిన సత్యం నన్నెన్నో బాధలనుంచి విముక్తి చేసింది. అయితే ఒక సందేహం మాత్రం నాకింకా మిగిలి పోయింది. నాకు తెలిసిన పార్వతి ఎవరు?

ఈ ప్రశ్నకు సమాధానం సులభంగా దొరుకుతుందని నేననుకోలేదు. కానీ పెళ్ళినుంచి తిరిగి వెళ్ళాక – నాకు తెలిసిన పార్వతితోగల అనుభవాలు వివరాలనూ ప్లస్ శ్రీధరబాబు చెల్లెలి పెళ్ళికి వెళ్ళి షాక్‌తిన్న సందర్భమూ – శివరావుకు వివరించి చెప్పగా – అతడు అరటిపండు ఒలిచిన విధంగా నాకు

ఏంజరిగి ఉండవచ్చునో చెప్పాడు.

దూర ప్రాంతాల తక్కువ వ్యవధిలో ఉండే ఎండరో యువకులకు ఆడవాళ్ళను సరఫరా చేసే సంస్థ ఒకటిఉంది, దానికి దేశంనిండా బ్రాంచిలున్నాయి. నేను ఆ సంస్థ ద్వారానే ఉమను రప్పించుకున్నాను. శివరావుకు ఆ సంస్థగురించి చాలా వివరాలు తెలుసు వారి వారి సౌకర్యాన్నిబట్టి యువకులు—యువతులను తమకు కావలసిన బందుత్వపు వరుసలలో రప్పించుకోవచ్చును.

శ్రీధరబాబు ఆ విధంగా చెల్లెలి పేరుతో యువతులను తమ అవసరానికి రప్పించుకుంటూ ఉండి ఉండవచ్చు. చెల్లెలు అనగానే ఎవరూ చటుక్కున తప్పు సంబందం అంటగట్టలేరు. ఉండేది తక్కువ కాలమైనప్పుడు — ఆ బందుత్వంలోని నిజానిజాల విచారణ ప్రసక్తి ఉండదు శ్రీభరబాబు బుక్‌చేసుకున్న అమ్మాయి వస్తున్నట్లు వచ్చిన టెలిగ్రామ్ అతడు లేని సమయంలో నాకు అందడం జరిగింది.

ఆ అమ్మాయికి వ్యాపారరీత్యా ప్రతిరోజుకూడా ముఖ్యం ఆమె చక్కగా నన్ను వినియోగించుకుని — శ్రీధరబాబు లేనప్పటికీ తన ఆదాయం దెబ్బతినకుండా చేసుకోగలిగింది. ఆమె శ్రీధరబాబుకు చెల్లెలే అయుంటుందన్న అపోహ — నాకు ఆమె పట్ల ఆకర్షణనూ, అంతులేని అతురుతను కలిగించింది.

నా సందేహాలన్నీ తీరెపోయాయి. కానీ ఒక్క విషయం నాకు చాలా బాధను కలిగించింది. తన చెల్లెల్ని ఎంతగానో అభిమానిస్తున్న శ్రీధర బాబు—ఇతర ప్రాంతాల్లో నలుగురూ తన చెల్లెలుగా భావిస్తున్నస్త్రీతో కాపురం చేస్తున్నాడు. ఆ విషయం అతను తప్పగా భావిస్తున్నాడనుకోను. కానీ అతన్ని తప్పు పట్టబోయేముందు— నాకటువంటి అర్హత

ఉన్నదా అని కూడా ఆలోచించవలసి ఉన్నది. అలా ఆలోచించ వలసిన అవసరం లేనివ్యక్తి నాకు తెలిసినవాళ్ళలో ప్రకాశరావు ఒకడే ననుకుంటాను.

స్నేహితుడి చెల్లెలు అని తెలిసుండీ అందు బాటులోకి వచ్చినప్పుడు అనుభవించి ఆ తర్వాత మరచిపోవాలని వ్యక్తిని ప్రయత్నించిన నేను! తను నమ్మి తనకోసం ఇల్లు వదిలి వచ్చిన అడదాన్ని ఏమాత్రమూ మోసం చేయకుండా నిగ్రహంతో వ్యవహరించి—చిట్టచివరకు ఎలాగో పెద్దలనొప్పించి ఆమెనే వివాహంచేసుకున్న వ్యక్తి ప్రకాశరావు!

బహుశా అందుకే నన్నుకుంటాను—తన చెల్లెలిపై మాట విసర బడడం సహించలేని శ్రీధరబాబు—మనిషినే స్వంతం చేసుకోవాలను కున్న ప్రకాశరావు చర్యను క్షమించగలిగాడు. నాబోటి వ్యక్తితో పార్వతి లేచి వచ్చి ఉంటే శ్రీధరబాబు చేతిలో ఆవ్యక్తి హత్యచేయబడి ఉండేవాడనడంలో సందేహంలేదు.

ఎవరు నమ్మినా నమ్మకపోయినా నీతిపరుడి ముందు—అవినీతి పరుడెన్నడూ బలహీనుడు గానే ఉంటాడన్న సత్యం నా అనుభవంలో మరోసారి రుజువైంది.

— : ఐపోయింది : —

# మాయమైన గూఢచారులు

సుజనశ్రీ

కేంద్ర గూఢచారిశాఖ డైరక్టర్ ఉపేంద్రగుప్తా సిగార్‌ని యాష్ ట్రేలో పడేశాడు. తనకెదురుగా కూర్చున్న ఇద్దరమ్మాయిలవంకా చూశాడు. అందులో మొదటి యువతి పేరు జూలీ. రెండో అమ్మాయి పేరు రమణి.

సొరుగులాగి అందులోనుంచి ఒక ఫోటోని తీసి టేబుల్ మీద పడేశాడు. "ఎంతో ప్రయత్నం మీద, ఎందరిదో కృషి వలన ఈ ఫోటో మాత్రం దొరికింది."

జూలీ ఫోటో అందుకొని చూసింది. కాళ్ళు చచ్చు పడిపోయిన స్త్రీ చక్రాల కుర్చీలో కూర్చుని ఉంది ఫోటోలో. ఆమె ముఖానికి నల్లని ముసుగు ఉంది చెవులూ,

ముక్కూ కప్పివేస్తూ, ఆమె కళ్ళు మాత్రమే కనుపిస్తున్నయ్.

"జాలీ అంటే ఎరగని కఠినాత్మురాలైన ఈ స్త్రీ ఒక పెద్దముఠాకు నాయకురాలు. ఈ ఫోటోని సేకరించే ప్రయత్నంలో ఒకగూఢచారి ప్రాణాలు కోల్పోయాడు. ఇంకో ఏజెంటు వాళ్ళ చేతికి బందీగా దొరికిపోయాడు. ఆమె ఎవరో ఇంతవరకూ మనకు ఆ చూకీ చిక్కలేదు. ఆమె దుస్తుల్ని బట్టీ, మేలి ముసుగుని బట్టీ, ఆమెముస్లిమ్ స్త్రీలా అవుపిస్తోంది. ఆమె క్రింద పనిచేసే ముఠా మన గూఢచారి శాఖలో ఏజెంట్లకన్నా తెలివిగా ప్రవర్తిస్తున్నారు."

"ఇంతకీ మేం చేయల్సిన పనేమిటో చెప్పారు కాదు!" జూలీ అడిగింది.

"వస్తున్నాను! ఆ ముఠాకు స్త్రీనాయకురాలు గనుక ఈ దఫా మిమ్మల్ని పంపటానికి నిర్ణయించాం!"

"ఇంతవరకూ మగ ఏజెంట్లను ఊహించుకునే ఆస్త్రీ, ముక్కుపచ్చలారని ఇద్దరు యువతులు తన రహస్యాల్ని పసిగట్టేందుకు వస్తున్నారని ఊహించదు!" జూలీ ఉషారుగా చెప్పింది.

"కరెక్ట్! అంతేకాదు. ఆ ముఠాలోని వ్యక్తులు మన అఫీసులోకే జొరబడి, మన సీక్రెట్ ఫైళ్ళను కొన్నిటిని ఫోటో తీసుకు వెళ్ళారు. అంతకన్నా మనకు ఇంకా అవమానం ఏముంది?" ఉపేంద్రగుప్తా నుదుట ముడతలు వచ్చినయ్, విచారంగా.

"అసలు ఆ ముఠావాళ్ళు చేస్తున్న దుండగం ఏమిటి?" రమణి అడిగింది.

"మన దేశానికి అణుశక్తి ఉత్పాదనకై కెనడా దేశం నుంచి యురేనియం దిగుమతి అవుతున్నది. మన దేశంలోకి యురేనియం సరాఫరా అవంగానే, అందులో కొంత భాగం

మాయమవుతోంది.

"ఈ ముఠా ఆ యురేనియంని ఏ శత్రుదేశానికో సరఫరా చేస్తుండాలి! ఆ కిటుకు మేం కనిపెట్టాలి! అవునా? జూలీ పూర్తిచేసింది.

"సరిగా చెప్పావ్! దాంతో పాటు మాయమైన మన గూఢచారుల్ని విడిపించాలి, వారు ఇంకా ప్రాణాలతో ఉంటే! ఇప్పుడు మీకు విషయమంతా విశదమయింది కదూ? ఏమైనా అనుమానాలుంటే అడగండి!"

"అనుమానాలేం లేవు సార్!"

"సరే! ఈ క్షణం నుంచి జూలీ కోడ్ నెంబర్ ఎక్స్8. రమణి నీకు అసిస్టెంటు. ఆమె కోడ్ నెంబరు జడ్ 3. ఇక మీరు వెళ్ళవచ్చు."

యువతు లిద్దరూ లేచారు. డైరక్టర్‌కి నమస్కారంచేసి సెలవు తీసుకున్నారు.

గోడలో రహస్య ద్వారం తెరుచుకొంది. దాన్ని దాటి లిఫ్ట్‌లోకి వచ్చారు ఇద్దరూ. లిఫ్ట్ పైకి లేచింది. మరో ద్వారం దాటే సరికి వాళ్ళు ఒక మందుల షాపులో ఉన్నారు.

షాపులో ఉన్న వ్యక్తికి విష్ చేసి పేవ్‌మెంట్ మీదకు వచ్చారు. వెనక్కి తిరిగి ఒకసారి మందుల షాపు వంక చూశారు. పెద్ద బోర్డు మీద "రామ్మూర్తి అండ్ బ్రదర్స్, ఇంగ్లీషు మందుల షాపు"అని ఉంది.

నిజానికది మందులషాపు కాదు. గూఢచారి శాఖ కార్యాలయానికి రహస్య ప్రవేశం అది. షాపులోంచి రహస్య ద్వారాల గుండా లిఫ్ట్‌లో ప్రయాణించి, నేలమాళిగలో ఉన్న కార్యాలయ్యాన్ని చేరుకోవాలి.

# 2

జాలీ, రమణి ఇద్దరూ మందుల షాపులోంచి బయటకు వచ్చారు. ఆ షాపు ప్రక్కనే మఫత్‌లాల్ వారి షోరూమ్ ఉంది. గాజు గదుల్లో వ్రేలాడగట్టిన చీరల వంక చూస్తున్నట్టుగా నిలబడ్డారు ఇద్దరూ!

నిజానికి ఎదురుగా ఉన్న అద్దంలో జాలీ; రోడ్డు ఆవతల వైపున, మందులషాపుకు ఎదురుగా ఉన్న వాచ్ రిపేరర్‌ని గమనిస్తోంది. గడియారాలు బాగు చేసే మిషలో అతడు తమనే పరీక్షగా చూడడం, తాము మందుల షపు మెట్లు దిగుతూన్నప్పుడే. కనిపెట్టింది.

వాచ్ షాపులో వ్యక్తి తను కూర్చున్న చోటినుంచి లేచాడు. వెనక్కు తిరిగి నిలబడ్డాడు.

జాలీ అనుమానం తీరిపోయింది. "సందేహంలేదు! ఆ వెధవ అప్పుడే మన గురించి సమాచారాన్ని వైర్‌లెస్‌లో చేప్పేస్తున్నాడు."

"అంటే మన కార్యాలయంపై అతడు నిఘావేసే ఉంచు తున్నాడన్నమాట ఎప్పుడూ!" రమణి అడిగింది.

"నిజంగా అంతే! లేకపోతే వాడు మనవంకే ఇందాకట్నుంచి గుర్రుగా చూడాల్సిన పనేముంది!"

"మనకు ఒక ఇబ్బంది లేకుండా చేశాడు. మన పరిశోధన ఎక్కడ మొదలెట్టాలా అని ఆలోచిస్తున్న మనకు, ఆ బాధ తొలగించాడు.

"ఎలాగ?" రమణి ఆశ్చర్యంగా అంది.

"వెళ్తూ మాట్లాడుకుందాం రా!" అంటూ జాలీ అక్కడనుంచి. ఇద్దరూ పేవ్‌మెంట్ మీద తీరిగ్గా నడవ సాగారు.

వీధి మలుపులో ఒక వ్యక్తి నిలబడి ఉన్నాడు. అతడి చెవిలో చెవిటి మిషన్ ఉంది.

"అదుగో ఆ పంది వెధవను చూశావా? మనవంకే గుర్రుగా చూస్తున్నాడు. వాడి చెవిలో ఉన్నది నిజంగా చెవిటి మిషనా లేక వైర్‌లెస్ రిసీవరా అని!"

ఇద్దరూ రహస్యంగా చూపులతోనే కూడబలుక్కున్నారు. చెవిటిమిషన్ పెట్టుకున్న వ్యక్తి తలవంచుకుని ఎదురుగా వస్తున్నాడు.

జూలీ, రమణి రెండుగా చీలి అతడికి దారి ఇచ్చారు. ఆ వ్యక్తి వాళ్ళను దాటుకుని వెళ్ళేసమయంలో జూలీ బూటు కాలు, నున్నని పేవ్‌మెంట్ మీద కొద్దిగా జారి, అతగాడికి డాష్ ఇచ్చింది.

మరు క్షణంలో బిక్కమొగం వేసుకుని అతడి మొగంలోకి చూస్తూ "ఓ! సారీ!" అంది.

"ఫరవాలేదు! మీకాలు నొప్పి పెట్టిందేమో చూసుకోండి!" అంటూ ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు ముందుకు.

"అదేం? ఏం చేశావ్ వాణ్ని?" రమణి అడిగింది నవ్వుతూ

"వాడి ప్యాంటుకు "నల్లి"ని అంటించాను. ఆపరికరం నల్లి సైజులోనే ఉంది. ఎలా పని చేస్తుందో తెలుసుగా. వాడి మాటలనన్నింటినీ మనకు అందజేస్తుంది." అంటూ జూలీ నవ్వింది.

ఇద్దరూ కారులోకి ఎక్కారు." రమణి! నీవు కారుడ్రైవ్ చెయ్యి. పైన అద్దంలో మటుకు చూస్తూండు! మనల్ని అతగాడు వెంటాడుతాడనే నా ఉద్దేశ్యం."

"అవును! వాడి చూపులు చూస్తుంటే అలాగే అని

పిస్తోంది.''

''నీవు మన గదికి వెళ్ళి మన ప్రయాణానికి గుడ్డలూ అవీ సర్దు. నేను ఒక అరగంటలో కలుస్తాను!'' కారుదిగి డోర్ మూసేస్తూ అంది జూలీ కారుకదలిపోయింది.

జూలీ రోడ్డు ప్రక్కనవే ఉన్న కూల్‌డ్రింక్ షాపుకు వెళ్ళిడ్రింక్ సిప్‌చేస్తూ కూర్చుంది.

చెవిటి మిషన్ వ్యక్తి టెలిఫోన్ బూత్‌లోకి వెళ్ళడం కనుపించింది. జూలీ తన అరచేతిని చెవి దగ్గర పెట్టుకుంది. ఆమె అరచేతిలో చాక్‌లెట్ సైజులో ఒక పరికరం ఉంది. దాన్లోంచి, టెలిఫోన్ బూత్‌లో మాట్లాడుతున్న వ్యక్తి మాట్లాడేదంతా, అతడి ఒంటి మీద ఉన్న ''నల్లి'' ద్వారా వినబడుతోంది.

టెలిఫోన్ బూత్‌లో వ్యక్తి నెంబర్ డయల్ చేశాడు. రిసీవరెత్తి మాట్లాడసాగాడు. తన మాటల్ని మరో యువతి వింటున్నదనే విషయం అతగాడికి పాపం తెలియనే తెలియదు.

''హలో! భయంకర్‌ని మాట్లాడుతున్నాను. ఆ అమ్మాయి లిద్దరూ ఎటో తప్పించుకు వెళ్ళారు! ఏమిటి చెయ్యడం!''

''ఏడవలేక పోయావ్! వాళ్ళ అందాన్ని చూడంగానే కళ్ళు పొరలు క్రమ్మాయా ఏం? ''వీరనారి''కి తెలియజేసి ఆమె నుంచి ఆజ్ఞలు తీసుకుంటాం! అందాకా లైన్‌లోనే ఉండు!'' అవతలి కంఠం కసురుకుంది.

''హలో! భయంకర్ పప్పులో కాలు వేశాడు! ఇప్పుడేం చెయ్యడం!'' ఫోన్‌లోంచి అవతలి వ్యక్తి మరెవర్నో అడగటం కూడా స్పష్టంగా వినిపించింది జూలీకి.

''హలో భయంకర్! నిన్ను వెంటనె కోటకు తిరిగిరమ్మని హుకుం!''

"అలాగే! అలాగే!" తడబడుతూ భయంకర్ ఫోన్‌పెట్టే శాడు.

తను నిజంగా నక్కను త్రొక్కి బయులుదేరాననుకుంది జూలీ. కాకపోతే వెదకబోయిన కుందేలు దొరకడమేమిటి? ఈ భయంకర్ తనముఠానాయకురాలు 'వీరనారి'ని కలుసుకోవ టానికి వాళ్ళ ముఠా కేంద్రానికి, 'కోట'కు వెళ్తున్నాడు. తనూ అతడి తోక పుచ్చుకొని వెళ్ళేచాలు కోటలో సాగా వేసినట్టే.!

## 3

ఎక్స్‌ప్రెస్ రైలు వేగంగా పోతున్నది. జూలీ, రమణి ఫస్ట్‌క్లాస్ కంపార్టు మెంటులో కూర్చుని ఇంగ్లీషు మేగ్‌జైన్‌లు తిరగేస్తున్నారు. అదేబోగీలో మరో 'కూపే' లో ప్యాంటూ, కోటూ, టై,కాళ్ళకు ఫుల్‌బూటూ వేసుకుని పెద్దమనిషిలా భయంకర్ గూడా ప్రయాణిస్తున్నాడు.

టెలిఫోన్ బూత్‌లోంచి భయంకర్ బయటకు వచ్చి టాక్సీ పిలిచి 'రైల్వేస్టేషన్' అనడం జూలీ విన్నది తన దగ్గ రున్న ట్రాన్స్మిటర్‌ద్వారా. స్టేషన్లో ఏఊరికి టిక్కెట్టు తీసుకున్నదీ గూడ ఆమెకు తెలిసి పోయింది 'నల్లి' ద్వారా.

త్వరగా రమణిని కలుసుకుని ఇద్దరూ స్టేషన్‌కు వచ్చారు. డ్రెస్ మార్చుకొని ఆంగ్లోఇండియన్‌లలా గౌను వేసు కున్నారు. తలకు విగ్గులు మార్చారు. భయంకర్ తమని చూసినా గుర్తు పట్టలేనంతగా మారిపోయారు.

జరిగిపోయిన సంఘటనని తలుచుకుని జూలీ నవ్వుకుంది. ఇద్దరు మగ గూఢచారులు మాయమైపోయారు. రాజస్థాన్ లోని థార్ ఎడారి ప్రాంతాల్లో వారిద్దరూ అదృశ్యమయినట్టు తాము చదివిన ఫైల్ వల్ల తెలిసింది. ఆ మగధీరుల్ని విడి

పించేందుకు మరో ఇద్దరు అబలలు బయదేరారు.

"ఏమిటి నవ్వుతున్నావ్! నాకూ చెబుదూ!" అనిడిగింది రమణి.

జూలీ జరిగిన విషయం అమెకూ చెప్పింది. ఇద్దరూ మరో సారి నవ్వుకున్నారు.

"మన 'భయంకర్' ఏం చేస్తున్నాడో చూసి వస్తాను!" అంటూ రమణి కూర్చున్న చోటినుంచి లేచింది.

టాయిలెట్ లోకి వెళ్ళే మిషతో అమె ప్రక్కనున్న 'కూపే' ల్లోకి చూసుకుంటూ వెళ్ళింది. ఆశ్చర్యం! భయంకర్ ఎక్కడా లేడు! టాయిలెట్ నుంచి తిరిగి వస్తూ మరోసారి చూసింది కళ్ళు పెద్దవి చేసుకొని.

అదే విషయం జూలీకి చెప్పింది. అంతలో జూలీ చేతి గడియారం నుంచి నాడికొట్టుకుంటున్నట్టుగా, అమె చేతికి టక్ టక్ మని శబ్దం వినిపించింది. రిస్టువాచ్ని చెవి దగ్గర పెట్టుకుంది అమె.

అందులో రహస్యంగా అతి చిన్నసైజు రేడియోసంకేతాలందించే రిసీవర్ ఉంది.

"ఎక్స్ ఎనిమిది! ఎక్స్ ఎనిమిది!" మీ గది అంతా శోధింపబడింది. ఆగంతకుడు దొరకలేదు. అంటే శత్రువులకు మీ ఉనికి తెలిసిపోయిందన్నమాట. మీరు ఇంక అప్రమత్తతో మెలగాలి!"

మెస్సేజ్ అయిపోయింది. జూలీ ఆశ్చర్యంగా రమణి వంక చూసింది. భయంకర్ మాయమైపోతే, ఇక తమకు దారి ఎలా తెలుస్తుంది.

అంతలో ఆమెకు మెరుపులా మరో ఆలోచనకలిగింది. తమ ఆచూకీని కనిపెట్టిన శత్రుముఠావాళ్ళు తమని అంత తేలి

కగా వదులుతారా! భయంకర్ కాకపోతే మరో భయంకర్ తమని వెంటాడుతూ ఉండవచ్చునని ఊహించింది.

రాజస్థాన్ రాష్ట్రానికి రాజధాని అయిన జైపూర్‌లో ఇద్దరూ రైలు దిగారు. అక్కడ ఒక ఇంటిని అద్దెకు తీసుకొని అందులోనే బస చేశారు, లోగడ వచ్చిన ఏజెంట్లిద్దరూ వాళ్ళ బసకు వెళ్ళి, అన్ని మూలలా శోధిస్తే 'వీరనారి' ఆచూకీని తెలిపే ఆధారం ఏమైనా దొరకవచ్చు!

అదే ఉద్దేశ్యంతో టాక్సీలో వాళ్ళ బసకు వెళ్ళారు. అదో చిన్నసైజు బంగళా. తమకు కేంద్రకార్యాలయం వారిచ్చిన డూప్లికేట్ తాళంచెవితో ఆ బంగళా తాళాలు తీసి లోపలకు ప్రవేశించారు.

ఎవరూ తమను వెన్నాడకుండా, తమ వెనుకనే తలుపులు మూసి లోపల గడియ పెట్టారు జూలీ, రమణి.

ఆటోమేటిక్ రైఫిల్స్‌ని చేతుల్లో పుచ్చుకొని లోపలకు జొరపడ్డారు. లోపలంతా చీకటిగా ఉంది. కిటికీ తలుపులు సైతం మూసివేసి ఉన్నాయి. గత చాలాకాలంగా వాటిని ఎవరూ తెరవలేదని తలుపుల మీద ఇసుక చెబుతుంది.

పెన్‌టార్చ్ వెలిగించి, గది అంతటా నేలమీద కార్పెట్ క్రింద వెదికసాగారిద్దరూ.

మెట్ల మీదుగా ఎవరో వస్తున్నట్లుగా అడుగుల చప్పుడు వినిపించింది.

చీకటిగా ఉన్న గది దీపాల కాంతితో వెలిగిపోయింది.

ఇద్దరు స్త్రీల వెనుకగా బలమైన హస్తాలు పడి వారి చేతుల్లోని రైఫిల్స్‌ని లాగేసినాయి.

వాళ్ళకెదురుగా టికెట్ కలెక్టర్ డ్రెస్‌లో ఉన్న వ్యక్తి ఒకడు చేతిలో పిస్టల్ పుచ్చుకొని నిలబడి ఉన్నాడు.

"వీరనారి మిమ్మల్ని తన దగ్గరికి తీసుకురమ్మంది. పిచ్చి వేషాలు వేయక, బుద్ధిగా మావెంట రండి!" అన్నాడతడు.

అతడి కంఠాన్ని బట్టి అతడే భయంకర్ అని కనిపెట్టేసింది జూలీ. మానుగాలు దుస్తుల్లో తమతో బాటు రైలెక్కిన భయంకర్ మధ్యలో మాయమయి, టికెట్ కలెక్టర్ యూనిఫారమ్‌లో తమను వెంటాడుతూనే వచ్చాడన్నమాట!

ఇద్దరు ధృఢకాయులు యువతులిద్దర్నీ తను చేతుల్లో ఇరికించుకుని ఉన్నారు. జూలీ కళ్ళతో రమణికి సంజ్ఞ చేసింది.

జూలీ మెరుపులా తిరిగి అతని బొటన వ్రేలిని మెలి బెట్టింది. ఆమె వేసిన 'జూడో' కిటుకుతో రాక్షసుడిలాంటి వ్యక్తి నేలమీద పడిపోయాడు అరుస్తూ. వాడు పడడంతో రెండవ వాడి మీద వెళ్ళి పడ్డాడు. వాడూ క్రిందా పడిపోయాడు ఆ తాపుడికి.

భయంకర్ పెద్దగా అరిచాడు కోపంతో జూలీ టేబుల్ మీదున్న పేపర్ వెయిట్ తీసుకుని పైకప్పునించి వ్రేలాడుతున్న బల్బు కేసి విసిరింది. బల్బు పగిలిపోయింది.

ఈ హఠాత్సంఘటనకు భయంకర్ అదిరిపడ్డాడు. మరుక్షణంలో అతడు కిటికీ దగ్గరగా వెళ్ళి తలుపులు తెరిచాడు. గదిలోకి వెలుతురు వచ్చింది.

"ఏయ్ అమ్మాయిలూ! మీ మాన ప్రాణాలపైన ఆశ ఉంటే మంచిగా మాతో రండి!" అన్నాడు భయంకర్.

"మమల్ని ప్రాణాలతో పట్టుకు రమ్మంది గదా మీ 'వీర నారి' మమ్మల్ని ఆమె దగ్గరకు తీసుకుపోకుండా చంపితే మీకు ఆమె ఎలాంటి శిక్ష విధిస్తుందో!" జూలీ నవ్వుతూ అంది.

భయంకర్ నాలుక కరుచుకున్నాడు. తన అనుచరులిద్దర్నీ చూస్తూ. చూడ్డానికి బలశాలురు! ఇద్దరు అమ్మాయిల్ని పట్టు

కోలేరూ? అంటూ జేబుల్లోనుంచి విజిల్ తీసి ఊదాడు.

మరో ఇద్దరు దృఢకాయులు లోపలకు వచ్చారు. నలుగురు కలిసి ఇద్దరు అమ్మాయిల్ని బంధించి బంగళాలోంచి బయటకు తీసుకు వెళ్ళారు.

# 4

జూలీ, రమణిని కారులో వెనుక సీట్లో కూర్చోబెట్టి, అటూ ఇటూ దృఢకాయులు కూర్చున్నారు. భయంకర్ స్టీరింగ్ ముందు కూర్చున్నాడు.

కారు వేగాన్ని పుంజుకుంది. సిటీ దాటి ఇసుక ప్రదేశంలోకి వచ్చింది. ఎడారిలో చాలాసేపు ప్రయాణం చేసి, ఒక పెద్ద రాతి కట్టడాన్ని చేరుకుంది, కారు.

"దిగండి!" అన్నాడు భయంకర్, కారు దిగంగానే!

"ఎడారిలో ఈ కొండరాతికోట ఎక్కడిది?" రమణి ఆశ్చర్యంగా చూస్తోంది.

ఒక దృఢకాయుడు రమణిని ముందుకు త్రోశాడు. పెద్దగేటు తెరుచుకుంది. వాళ్ళను లోపలకు ప్రవేశపెట్టారు.

మరో పెద్దగది ముందు దృఢకాయులు ఆగిపోయారు. భయంకర్ మాత్రం రివాల్వర్‌ని చేతోపుచ్చుకుని ఇద్దరు యువతుల్నీ ఇంకా లోపలకు తీసుకు వెళ్ళాడు. అధునాతనంగా ఉన్న గది వచ్చింది.

ఆ గది తలుపుదగ్గర నిలబడి "ఇద్దరు స్త్రీ బందీలతో భయంకర్ వచ్చాడు!" అని గోడదగ్గరగా నిలబడి చెప్పాడు భయంకర్.

ఒక్కక్షణం గడిచాక తలుపు ప్రక్కకు జరిగి లోపలకుదారి ఏర్పడింది.

లోపల అయిదారుగురువ్యక్తులు వడ్రంగంపనిచేస్తున్నారు.

చిన్న చిన్న భవనాల నమూనాలు తయారు చేస్తున్నారు వాళ్ళు. వాటిని చూస్తుంటే వాళ్ళ పనితనానికి, ముచ్చట గొలిపే ఆ చిన్న భవనాల్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయింది జూలీ.

వడ్రంగం పనిచేస్తున్న వ్యక్తులు వాళ్ళపనేమిటో వాళ్ళదే గానీ, కనీసం తల ఎత్తి అయినా వచ్చిన వాళ్ళవంక చూడనేలేదు.

వడ్రంగం పనివాళ్ళను తప్పుకుని ఇంకా ముందుకు వెళ్ళారు అతివలిద్దరూ.

భయంకర్ గోడలో ఏదో స్విచ్ నొక్కాడు. ఒక్కక్షణం గడిచాక తలుపు మీదున్న ఎర్రలైట్ వెలిగింది. తర్వాత బంయ్, మంటూ చప్పుడు చేస్తూ గోడలో తలుపు ప్రక్కకు జరిగింది.

ఆ గది అధునాతనంగా పాలరాతితో నిర్మింప బడిన గోడలూ నేలా కప్పూ తెల్లగా ఉన్నయ్, వెలుతురు ఎక్కడనుంచి వస్తున్నదో గానీ గది కాంతి వంతంగా ఉంది.

ముగ్గురు వ్యక్తులూ లోపలికు రాగానే వాళ్ళవెనుకగా తలుపు మూసుకు పోయింది.

గదిలో వాళ్ళకెదురుగా ఒక టేబుల్ ఉంది. టేబుల్ వెనుకగా ఒకస్త్రీ, నల్లనిచీర నల్లని బ్లౌజు వేసుకుని కూర్చున్నది. ఆమె ముఖం గుర్తుపట్టటానికి వీల్లేకుండా ఈ చెవిమీదనుంచి ముక్కుమీదుగా రెండో చెవిమీదకు నల్లని మస్లిన్ తెరఉంది. ఆమె కళ్ళుమాత్రమే కనబడుతున్నాయ్.

"వీరనారీ! ఆ యువతులిద్దర్నీ పట్టితెచ్చాను!" అన్నాడు భయంకర్, వాళ్ళిదర్నీ ముందుకు తోస్తూ.

గూఢచారి కార్యాలయంలో ఉపేంద్రగుప్తా చూపిన ఫోటోలోని, ముఠా నాయకురాలు ఈమే నన్నమాట అనుకుంది. జూలీ. అత్యంత కఠినాత్మురాలని పేరు మోసిన 'వీరనారి' తమశాఖలోని ఇద్దరు ఏజెంట్లను దయాదాక్షిణ్యాలు లేకుండా

పొట్టనబెట్టుకున్న వ్యక్తి ఈమే నన్నమాట!

"అమ్మాయిలూ! నేనడిగే ప్రశ్నలకు సరిగా బదులు చెప్పండి! లేదా మీ ప్రాణాలపై ఆశ వదులుకోవలసి వస్తుంది!" గరగరలాడుతూ మైక్రోఫోన్‌లో ఆమె గొంతు కర్కశంగా వినిపించింది.

"హుఁ!" అంటూ జూలీ నిర్లక్ష్యంగా నవ్వింది.

"మీరు జైపూర్ ఎందుకువచ్చారు?" వీరనారి తన మొదటి ప్రశ్నను విసిరింది.

జూలీ కోపం పట్టలేక పోయింది. వేగంగా ముందుకు నడిచి ఆమె ముఖానికున్న మేలి ముసుగుని చించుదామని యత్నించింది.

జూలీలో చలనం గమనించగానే వీరనారి టేబుల్ మీదున్న స్విచ్ నొక్కింది.

అంతే! జూలీ శిలా ప్రతిమలా స్తంభించి పోయింది. ఆమె మనసు పనిచేస్తూనే ఉన్నది. కానీ కాళ్ళూచేతులూ కదల్చ లేక పోతోంది.

వీరనారి వికటంగా నవ్వింది. "నీవు కదలలేవు జూలీ! ఒక శక్తి వంతమైన కాంతి కిరణం నీమీదకు ప్రసరింప బడింది. దాని ప్రభావం వలన నీవు కదలలేవు, నా శక్తి ఎలాంటిదో ఇప్పటికైనా తెలిసి వచ్చిందా; ఇక నా ప్రశ్నకు సమాధానం చెప్పు!"

జూలీ కాళ్ళు చేతులు తిరిగి ఆమె స్వాధీనంలోకి వచ్చినయ్, వీరనారి మళ్ళీ స్విచ్ ఆఫ్ చేసేసరికి.

"నా బొందిలో ప్రాణం ఉండగా నీకు నేనేం చెప్పను!" జూలీ మొండిగా అంది.

వీరనారి భయంకర్‌కు ఏదో సైగ చేసింది.

"మా నాయకురాలినే ఎదురించే ధైర్యం ఉందా! మీాకు చావే గతి! రేపుదయానికి కుక్కచావు చస్తారు మీారిద్దరూ! ఊఁ! నడవండి!'' భయంకర్ కంఠం గది అంతా మారు మ్రోగింది.

వీరనారి గదినుంచి వచ్చిన వేపుగా వెళ్ళటానికి వెను దిరిగింది జూలీ. ఆమె వెన్నులో పిస్తోలు మొన గుచ్చుకొంది.

"అటు కాదు! ఇటు! '' అంటూ మరో దిశగా చూపించాడు భయంకర్.

ఇంకో వేపు గోడలో మరో తలుపు తెరుచుకుంది. ఆ దారిగుండా కొంత దూరం వెళ్ళేసరికి నేల మాళిగలోకి మెట్లు వచ్చినయ్. కొండరాతి నేల చల్లగాఉంది. లోపల జైలు గది ల్లోంచి కంపు కొడుతున్నది.

ఒక మూాలగా కాగడా వెలుగుతోంది. ఒక్కొక్కజైలు గదినీ దాటుకుంటూ పోతుండగా, ఒక గదిలోంచి మూలుగు విన వస్తోంది. బహుశా చిత్రహింస పెట్టి, ఆ వ్యక్తిని తెచ్చి జైల్లో పారేసి ఉంటారనుకుంది. జూలీ.

సెంట్రీ ఒక గది తలుపు తెరిచాడు. జూలీ, రమణి ఇద్దర్నీ లోపలకు తోసి తలుపు మూసి గడియపెట్టాడు బయట.

అక్కడున్న గదుల తలుపులకు గడియలే తప్ప, తాళాలు లేవని గ్రహించింది జూలీ, జైలు గది తలుపుకు పైన చిన్న కిటికీ మాత్రమే ఉంది.

# 5

తమను బంధించిన గది అంతా చీకటిగా ఉంది. నేల మీాద పడుకోవటానికి కాబోలు ఎండు గడ్డి పరిచి ఉంది. తలుపుకు ఎదురు దిశగా గోడలో ఎత్తుగా మరో చిన్న కిటికీ

ఉంది.

జూలీ తమ ఒంటిమీది పరికరాలు లాక్కోనందుకు సంతో షించింది. మినీ స్కర్టు జేబులోంచి పెన్‌టార్చ్ తీసి వెలి గించింది.

"రమణీ! ఇందాక మనం వచ్చేటప్పుడు మరో గదిలోని బంధితు డెవరో మూలగటం విన్నావుకదూ!"

"అవును! విన్నాను. వాడినుంచి కూడా ఏదైనా రహస్య సమాచారం సేకరించాలని, వాడ్ని ఏకీలుకా కీలు విరచి ఉంటారు!" రమణిఅంది.

అతగాడు మన శాఖవాడై ఉంటాడేమో! మనం ఎలాగైనా ఇక్కడ్నుంచి బయటపడి, అతడెవరయిందీ కనుక్కోవాలి! అతడు మన తప్పిపోయిన ఏజెంట్ అయితే, అతడ్ని విడి పించవచ్చు!"

"ఏడిసినట్టే ఉంది! బోనులో ఎలుకల్లాగ మనం బంధింపబడి ఉన్నాం, ఇంకో వ్యక్తిని మనం ఎలా విడిపించ గలం!"

జూలీ నేలమీది గడ్డినంతా ప్రోగు చేసింది.తరావాత తన స్కర్ట్ జేబులోంచి సన్నని వైర్‌ని తీసింది. దాని చివరగా చిన్నరింగు ఉంది.

తలుపు కిటికీలోంచి బయటకు చూసింది జూలీ.తలుపు మీాద టకటకమని శబ్దం చేసింది మెల్లిగా. ఒక్క క్షణం లేచి చూసింది. తను చేసిన శబ్దానికి ఎవరన్నా అటుగా వస్తారేమోఅని!

అక్కడ చేరువలో ఎవరూ లేరని రూఢి చేసుకుని కిటికీ చువ్వల సందుల్లోంచి తీగను జారవిడిచింది. నెమ్మదిగా క్రిందకు జారవిడుస్తూ, రింగు వెళ్ళి గడియకు తగులుకునేలా

చేసింది.

తీగను కొద్దిగా పైకి లాగేసరికి గడియ క్రింద కొక్కెం నుంచి పైకి లేచింది. కిటికీ చువ్వల్ని తప్పిస్తూ తీగను జరిపింది ప్రక్కకు. గడియకూడా ప్రక్కకు జరిగింది. మెల్లిగా తలుపును తెరచి, ఆ సందుకింద చేయిని బయటకుపెట్టి రింగును గడియనుంచి ఊడదీసింది.

తరువాత తీగను చుట్టి జేబులో వేసుకుంది. తలుపు ఇంకా కొంచెం తెరచి తల బయటకు పెట్టి చూసింది.

బయట ఎవరూ లేరు. బహుశా ఉన్న ఒకరిద్దరు సెంట్రీలు ఎక్కడో నిద్రపోతూ ఉంటారనుకుంది జూలీ.

తలుపు బాగా తెరుచుకొని, బయటకు వచ్చింది జూలీ! పిల్లిలా అడుగులో అడుగులు వేసుకుంటూ. మూలుగు వినబడుతున్న సెల్ దగ్గరకు వెళ్ళింది.

ఆ గది తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళింది. గడ్డిమీద పడుకుని ఒక వ్యక్తి మూలుగుతున్నాడు. అతడు కళ్ళు తెరచి చూశాడు తలుపు తెరిచిన అలికిడివిని

జూలీ అతడి ముఖంలోకి చూస్తూ "ఎవరు నీవు!" అని అడిగింది.

"నా పేరు కరుణాకర్!"అన్నాడు ఆ వ్యక్తి నీరసంగా.

"ఆ పేరు కాదు! కోడ్ నెంబరూ. కోడ్ నేమ్ లేదా?"

అతడి కళ్ళుమెరిసినయ్." నా నెంబరు అపోలో ఆరు! చంద్రుడు లేకపోయినా తారకలు వెలుగుతూనే ఉంటయ్!"

"నేను ఎక్స్8ని. నాపేరు జూలీ! నిన్ను విడిపించటానికే నేను పంపబడ్డాను! లేవగలవా? మనం త్వరగా ఇక్కడ నుంచి పారిపోవాలి!"

ఆమె తన చెయ్యిని అతగాడికి ఆసరాగా ఇచ్చింది. కరుణా

కర్‌ని వెంటబెట్టుకుని వచ్చి రమణిని కలుసుకుంది జూలీ.

తన గదిలోని గడ్డికి నిప్పు అంటించింది ఆమె. తలుపు లాగి గడియ పెట్టింది.

అంతలో మెట్లమీద అడుగుల చప్పుడు వినిపించింది. ఖాళీగా ఉన్న మరో జైలు గది లోకి జొరబడి దాక్కున్నారు ముగ్గురూ.

సెంట్రీలోపలకు వచ్చాడు. పొగ వస్తున్న గది తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళాడో లేదో, జూలీ పరుగెత్తుకుంటూ వచ్చి. అతడున్న గదితలుపుకు బయట గడియవేసింది.

"త్వరగా రండి! మనం ఇక్కడనుంచి దాటుకోవాలి, వాడు అరచి గోల చేయక ముందే!" అంటూ జూలీ మెట్లవేపుగా పరుగెత్తింది. మిగతా ఇద్దరూ ఆమెను అనుసరించారు.

మెట్లు ఎక్కిన తర్వాత మరో పెద్దహాలు వచ్చింది. అటూ ఇటూ పరుగెత్తి ఎవరూ లేరని నిర్ధారణ చేసుకుంది. మళ్ళీ వెనక్కి వచ్చి చూసేసరికీ కరుణాకర్ ఒక్కడే కను పించాడు. రమణి మాయమయింది.

"రమణిఏది?" ఆత్రుతగా అడిగింది జూలీ.

నావెనుకనే నిలబడి ఉన్నదే? ఇంతలోనే ఏమయింది?" అంటూ నోరెళ్ళ బెట్టాడు కరుణాకర్.

ఒక వేళ ఏదైనా మర్చిపోయి వెనక్కి వెళ్ళిందేమో అని మరో నాలుగడుగులు వెనకు వెళ్ళి రమణి కోసం వెదికింది. రమణి జాడ లేదు.

జూలీ హృదయం దడ దడ కొట్టుకుంది. ఇంకా వెనక్కి పోయి, కరుణాకర్ బంధింపబడిన గదిలోకి గూడ వెళ్ళి చూసింది. అక్కడా లేదు. అనుమానం తీరక మిగతా గదులు గూడా వెదికింది. ఎక్కడా రమణిజాడ లేదు.

అటూ ఇటూ హడావిడిగా పరగెత్తుతున్న జూలీ వంక కోపంగా చూస్తూ అరుస్తున్నాడు. లోపల బంధింపబడిన సెంట్రీ. వాడికేకలకు ఎవరైనా, ఏక్షణానైనా అక్కడకు వచ్చే ప్రమాదం ఉంది.

తల్లి పిల్లివెంట తిరిగే పిల్లికూనలాగ, కరుణాకర్ ఆమెను అంటిపెట్టుకుని తిరుగుతున్నాడు. తను బ్రతికి బయట పడ్డాననుకుంటే, అంతలోనే రమణి మాయమయింది. ఆమె కోసం వెదుకులాటలో తాము తిరిగి పట్టుబడ్డామంటే ఇక ఏమన్నా ఉందా?

జూలీ కళ్ళు ఎక్స్‌రే లాగ గోడల వంక పరీక్షగా చూస్తున్నాయ్. రమణి ఉన్నదున్నట్టుగా గాలిలో కలసిపోలేదుకదా? ఆమెను మరో రహస్యమార్గం గుండా ఎవరో లాక్కెళ్ళి ఉండాలి.

తను తప్పించుకున్న జైలుగదిలోంచి పొగబాగా వస్తున్నది గడ్డి తగులబడి. ఆ పొగ అంతా ఒకవైపు గోడలో సన్నని పగులు వేపుగా పోతున్నది.

ఇటు వైపు తప్పకుండా ఏదో రహస్యమార్గం ఉండి ఉంటుంది, అనుకుని ఆవైపుగా గోడను ప్రతి అంగుళం మేరా తడమ సాగింది.

గోడనిండా ఇసుక రేణువులు పడి ఉన్నయ్. ఒకరాయి మీద మాత్రం అప్పుడే దాన్ని ఎవరో తుడిచినట్టుగా శుభ్రంగా ఉంది. ఆ రాయిని అన్నిమూలలా తన వేళ్ళతో గట్టిగా వత్తుతోంది జూలీ.

వెనక నుంచితుపాకి పేలింది. జూలీ ఉలిక్కిపడి వెనక్కు చూసింది. గదిలో బంధింపబడిన సెంట్రీ తన అరవులకు ఎవరూరాలేదని, తన చేతిలోని రైఫిల్‌ని తలుపు రంధ్రంలోంచి

బయటకు పెట్టి కాల్పులు మొదలెట్టాడు గాలిలోకి. ఆ కాల్పులు విని అయినా మిగతా సిపాయిలు వస్తారని అతడి పన్నాగం.

జూలీ తన ప్రయత్నం కొనసాగించింది. ఎలుక బోనులో ఎలుకల్లాగ మనం ఇక్కడ చిక్కుబడిపోయాం! సైనికులు వస్తున్నారల్లే ఉంది, ఆ కాల్పులు విని! అన్నాడు కరుణా కరం బాధగా.

మెట్లమీద బూట్ల చప్పుళ్ళూ, సెంట్రీల అరపులు వినవస్తున్నయ్. మిగతా సిపాయిలు వస్తున్నారని గ్రహించిన సెంట్రీ, గదిలో బంధింపబడిన సెంట్రీ రాజస్థానీ భాషలో "ఇద్దరు ఖైదీలు తప్పించుకుని మరో ఖైదీని గూడా పిలిపించా రని,, అరుస్తున్నాడు.

జూలీ ఇక లాభం లేదని ఆశ వదలుకుని ఇటు తిరిగింది. అలా తిరగడంలో ఆమె చేయి మరో రాతి పలక మీద పడట మేమిటి, చప్పుడు కాకుండా గోడలో మరో తలుపు తెరచు కోవడ మేమిటి' విచిత్రంగా జరిగిపోయింది.

కరుణాకర్ చెయ్యిపుచ్చుకొని లాక్కెళ్ళూ జూలీ ఆ ద్వారం లోంచి గోడ అవతలకు పరుగెత్తికెళ్ళింది. ద్వారం తిరిగి మూసుకు పోయింది

సిపాయిలు మెట్లుదిగి జైలు గదుల దగ్గరకు వచ్చారు అప్పుడే.

# 6

"క్షణాల్లో బ్రతికిపోయాం! ఇంకో నిముషం ఆలస్యం అయినా మనం మళ్ళీ పట్టుబడి పోయే వాళ్ళం!" అన్నది జూలి.

కరణాకర్ తలూపాడు.

"ఏం! మనం బయటపడ్డందుకు సంతోషించవేం?,,

అంది జూలీ అతడి విషాద వదనం చూస్తూ.

"మనం గూఢచారులం! వీరనారి ఆచూకీ కనుక్కోవ టానికి పంపబడ్డ వాళ్ళం! రమణి విషయం తర్వాత చూడవచ్చు. ముందుముందు నాయకురాలి గురించి సమా చారంకోసం యత్నించాలి!" అన్నాడు కరుణాకర్.

జూలీ ముఖం కోపంతో జేవురించింది. "ఆ సంగతి నీవు ప్రత్యేకంగా గుర్తు చేయనక్కర్లేదు. మన పని కేవలం నాయకురాలి ఆచూకీతీయుటమేకాదు, మాయమైన గూఢ చారుల్ని వెదికి వాళ్ళను సురక్షితంగా కేంద్రానికి అప్పగించాలి. అందువల్లనే నీవూ జైల్లోంచి బయటపడ్డావని మర్చిపోకు!"

కరుణాకర్ ఆమె కళ్ళల్లోకి చూసి తలవంచుకున్నాడు. "క్షమించు మాడమ్! నాయకురాల్ని గురించి తెలుసుకోవాలనే ఆతృతలో ఏదో అనేశాను."

ఎదురుగా ఉన్న మెట్లెక్కి పైకి వెళ్ళారు ఇద్దరూ! ఒక ద్వారం దగ్గర మెట్లు ఆగిపోయినయ్.

తలుపు హ్యాండిల్ త్రిప్పి నెట్టింది జూలీ. తేలికగా తలుపు తెరుచుకుంది. తలుపు సందులోంచి తల లోపలకుపెట్టి చూసింది ఆమె.

"అరె? ఇది 'వీరనారి' గదే! ఆమెలేదు. ఖాళీగా ఉందే!" ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది.

కరుణాకర్ గూడా తలుపు నెట్టుకుని లోపలకు చూశాడు.

"నిన్నుగూడా ఈగదిలోకి తీసుక వెళ్ళారా ముందర?" అని అడిగింది జూలీ.

"అవును! కానీ అప్పుడు టేబుల్ ముందు నల్లని దయ్యంలాగా 'వీరనారి' కూర్చుని ఉంది. ఇప్పుడామెలేదే?"

జూలీ గదిలోకి వచ్చింది. కరుణాకర్ గూడా గదిలో ప్రవే

శించి తమ వెనుకనే తలుపు మూసి లోపల గడియపెట్టాడు.
జూలీ గదినంతా కలయజూసింది. ఆ గది నాలుగు గోడల్లోనూ, నాలుగు ద్వారాలున్నయ్. ఒకటి యిప్పుడు ప్రవేశించింది. రెండోది వీరనారి కుర్చీకి వెనుకగా ఉంది. తూర్పు దిక్కుగా ఉన్న ద్వారంలోంచే తననూ, రమణినీ ప్రవేశపెట్టారు. ఉత్తరపు దిశగా ఉన్న వాకిలి తెరిచి తామిద్దరనూ జైలుకి తీసుక వెళ్ళారు.
అయితే ఆముఠా నాయకురాలు, 'వీరనారి' ఎక్కడకు పోయినట్టు అనుకుంది జూలీ.
జూలీ నేరుగా నాయకురాలి టేబుల్ దగ్గరకు నడిచింది. వెనుక జేబులోంచి 'టెస్టర్'ను తీసి ఆ స్టీల్ టేబులో కరెంటు ప్రవహిస్తున్నదేమో అని పరీక్షించి చూసింది.
అలాటిదేమీ లేదని రూఢీచేసుకున్నాక, దాని డ్రాయర్ని తెరవాలని యత్నించింది. కాని ఆ సొరుగు లోపల తాళం వేయబడి ఉంది. మరో జేబులోంచి చిన్న సాధనాన్ని తీసి సొరగు తాళం తీయటానికి యత్నించింది.
"ఏమిటి నీవు చేసేది?" కరుణాకర్ ఆమెను వారించాడు.
"ఆమె రహస్య సమాచారాన్ని తెలిపే కాగితాలు ఇందులో భద్రపరచబడి ఉంటయ్! వాటిని సంగ్రహించ బోతున్నాను!"
డ్రాయర్ తెరుచుకుంది. జూలీ దాన్ని బయటకు లాగబోతూండంగా, కరుణాకర్ తన చేత్తో దాన్ని లోపలకు నెట్టేశాడు.
"నీవన్నట్టుగా ఇందులో అతి ముఖ్యమయిన కాగితాలుంటే, ఈ డ్రాయరుకు, అలారం బిగించబడి ఉంటుంది! డ్రాయర్ లాగంగానే ఎక్కడో సైరన్ ప్రమోగుతుంది. మనం పట్టుబడి పోతాం!" అన్నాడు అతడు.

"ఛీ! అడుగడుగునా నీకు అనుమానాలే! ఆడదాన్ని నాకున్నంత తెగింపుకూడా లేదేంనీకు? నీవు అసలు గూఢచారి వేనా?" అంటూ బుసలు కొట్టింది జూలీ కోపంగా.

అంతలోనే ఆమె చేయి సొరుగుని బయటకు లాగింది. సొరుగులో చిన్న స్టీల్ కేస్ ఉంది. ఎంతో రహస్యమైన పత్రాలను మాత్రమే అలాంటి కేస్‌ల్లో ఉంచుతారని జూలీకి వెన్నతో బెట్టిన విద్యలా తెలుసు. ఆకేస్‌ని గౌనులోపల వీపు వెనకభాగంలో దాచేసింది.

ఆకేస్‌ని జూలీ తీసిన మరుక్షణంలో పెద్దగా అన్ని వైపు ల్నుంచి బెల్ మ్రోగింది.

'నేచెప్పలేదా?' అన్నట్టుగా చూశాడు కరుణాకర్.

గది బయటనుంచి అరుపులు వినబడుతున్నాయ్.

జూలీ పరుగు తీసింది. తాము వచ్చిన ద్వారం తెరచు కుని ఆ గదిలోంచి బయట పడింది. కరుణాకర్ తలుపు మూసేశాడు.

జూలీ తలుపుకు చెవిని ఆనించి లోపల జరిగేది వినటా నికి ప్రయత్నించింది.

ఎవరో పెద్దగా అరుస్తూ, ఆజ్ఞలు జారీ చేస్తున్నారు. ఆకంఠం భయంకర్‌ది!

"ఇంకా క్రిందికి పోతే నయం!" అన్నాడు కరుణాకర్ మెట్లక్రిందకు చూపిస్తూ.

"అవసరం లేదు. ఇది సాధారణంగా వాడే ద్వారం కాదు. రహస్యద్వారం. మనం ఆ ద్వారం గుండా వచ్చామని, వాళ్ళు చస్తే ఊహించలేరు!" అంది జూలీ.

జూలీ ఆలోచనలు రమణి మీదకు మళ్ళినయ్, ఆమె జాడ తెలియలేదు ఇంతవరకూ, ఆమె ఎక్కడున్నట్టూ? ఏమ

యినట్టూ?

"ఇక్కడెవరూ లేరే! పొరబాటున బెల్ మ్రోగి ఉండాలి! పదండి పదండి!" అన్నాడు భయంకర్.

"ఒకవేళ అతడు డ్రాయర్ తెరవబడిందని కనిబెట్టి ఉంటే, మనకు అపాయం తప్పదు!" అన్నాడు కరుణాకర్.

"తమ నాయకురాలి టేబుల్‌మీద వ్రేలు పెట్టటానికి గూడ వాడికి సాహసం ఉండదు. అదికాదు, మనం ఆలోచించ వలసిన విషయం. గదిలోంచి అలారం బెల్ మ్రోగినా. నాయకు రాలు రాలేదేం? అంటే ఆమె ప్రస్తుతం ఇక్కడ లేదా?"

"నిజమే! నీవు చెప్పేది నిజమే అయి ఉండోచ్చు!" అంటూ కరుణాకర్ తలుపుకు చెవి ఆనించి విన్నాడు మళ్ళీ.

# 7

తలుపుకున్న బీగం దూర్చే కన్నంగుండా చూసింది జూలీ. "భయంకర్ వెళ్ళిపోయాడు. కాని గదిలో ఇద్దరు సెంట్రీలను కాపలా ఉంచాడు." అన్నది.

"ఆ సెంట్రీలను చూస్తూంటే నీకేమనిపిస్తున్నది? నాయకురాలు తన స్వంత సైన్యాన్ని నిర్వహిస్తున్నట్టుగా లేదూ. ఈ సెంట్రీలు సుశిక్షితులైన సైనికులాగ కనిపించటంలా?" కరుణాకర్ అడిగాడు.

"అవును! కానీ ఈ సైన్యం, ఈ రహస్య స్థావరం ఇదంతా ఏం సాధించటానికి?" జూలీ అసహనంగా అడిగింది.

కరుణాకర్ తనకంటే ముందుగా వచ్చాడు ఈ స్థావరం లోకి. తన ప్రశ్నకు సమాధానం అతగాడికి తెలిసి ఉండవచ్చు.

కాని దానికన్న ముఖ్యం, అవతలిగదిలోని సెంట్రీలను ఎలా వదిలించుకోవాలా అనే ఆమే ఆలోచిస్తున్నది.

తన జేబులోంచి చిన్న గాజుగొట్టాన్ని తీసి నోట్లో పెట్టు

కుంది. మరో చిన్న సీసాలోంచి తెల్లని టాబ్లెటును తీసి, గొట్టం చివరగా ఉంచింది.

బిగం చెవి దూర్చే కన్నంలోంచి గాజుగొట్టాన్ని దూర్చి, ఉఫ్ మని ఊదింది. గొట్టంలోని టాబ్లెట్ వెళ్ళి సెంట్రీకి తగిలింది. మరుక్షణంలో టాబ్లెట్‌నుంచి తెల్లని పొగ వచ్చింది. ఆ పొగను పీలుస్తూనే ఇద్దరు సెంట్రీలు మత్తుగా నేలకు ఒరిగిపోయారు.

"అరగంటదాకా ఆ పడిపోయిన వ్యక్తులు లేవరు! ఆ పొగ ప్రాణాపాయం కాదు." అంది జూలీ.

తలుపు తెఱచుకుని ఇద్దరూ మళ్ళీ వీరనారి గదిలోకి వెళ్ళారు.

జూలీ పడమర వేపు గోడలో తలుపు తెరవబోయింది.

"ఆ తలుపు తెరవద్దు. అది వీరనారి ప్రయివేటుగది. నన్ను జైల్లోకి నెట్టేముందు, నన్నాగదిలోకి తీసుకు వెళ్ళారు.!" అన్నాడు కరుణాకర్.

జూలీ నుదురు బాదుకుంది చేత్తో! "ఖర్మ! నిన్ను అప్పుడే విడిపించకున్నా బాగుండేదీ! చేసే ప్రతి పనికీ అడ్డంచెబుతావ్, నీతో ఎక్కడ చచ్చేది! ఇదుగో కరుణాకర్! ఇది నీకు ఆఖరు సారిగా చెప్పడం! నేను చేసే పనికి నీవు అటంకం చెప్పావో, నిన్నేం చేస్తానో నాకే తెలియదు. ఇక్కడ నేనే సర్వాధికారిని! ఇష్టమైతే నాతోరా! లేదా వెళ్ళి జైలుఖానాలో పడుకో హాయిగా!"

"అదికాదు జూలీ! ఆ ఎదురుగా ఉన్న ద్వారం తెరుచుకుని వెడితేనేం అని!"

"అ తలుపు తెరిస్తే పెద్దహాల్లో పది పన్నెండుమంది వడ్రంగం పనివాళ్ళు అడ్డం తగులుతారు." అంటూ జూలీ,

వీరనారీ ప్రయివేట్ రూమ్ తలుపు హ్యాండిల్ మీద చేయివేసి త్రిప్పింది.

రమణి ఆ గదిలో ఉండి ఉంటుందనే ఊహ ఆమె మనసులో మెదిలింది. అంతే కాదు,'వీరనారి' ఆ గదిలో నిద్ర పోతూ ఉంటే. ఆమెను బంధించవచ్చు.

జూలీ ఒక్క క్షణం ఆగింది. తలుపు దగర్నుంచి వెనక్కు వెళ్ళి, నేలమీద పడివున్న సెంట్రీల చేతుల్లోని పిస్తోళ్ళను తెచ్చింది. ఒకటి తను ఉంచుకుని రెండోదాన్ని కరుణాకర్‌కి అందించింది.

తలుపు తెరచి లోపలకు చూసింది.

అక్కడ ఆమెకు రమణి కనిపించింది. అయితే ఆమె ఒంటరిగాలేదు. ఆమెకెదురుగా భయంకర్ నిలబడి ఉన్నాడు.

రమణి ఒక బల్లమీద పడుకుని ఉంది. ఆమె మెడ దగ్గరా నడుముదగ్గరా ఇనుప పటకాలతో బంధించబడి ఉంది. బహుశా ఆమెను చిత్రహింస పెట్టి, ఆమెనుంచి సమాచారం రాబట్టుతున్నాడు కాబోలు భయంకర్, అనుకుంది జూలీ.

రమణి ఒంటిమీద అక్కడక్కడ వాతలు కనబడుతు న్నాయ్. ఒకటి రెండు చోట్లనుంచి రక్తంకూడా కారుతున్నది.

"ఇదుగో అమ్మాయి! ఇదే ఆఖరుసారిగా అడుగుతున్నాను. నాకు వెంటనే బదులు చెప్పు. కేంద్ర గూఢచారి శాఖకు మా వర్గం పథకం గురించి తెలిసిపోయిందా?" భయంకర్ అడుగుతున్నాడు.

రమణి మాట్లాడలేదు. భయంకర్ తన చేతిలోని బెల్టు పైకెత్తాడు ఆమెను కొట్టే ఉద్దేశ్యంతో.

"ఎత్తిన చేయి దింపావో, నీకు భూమి మీద నూకలు చెల్లిపోతాయి భయంకర్!"అంది జూలీ, అతడి వెన్నులో పిస్తో

లుతో పాడుస్తూ.

భయంకర్ వెనుదిరిగి చూడటానికి యత్నించాడు. కానీ జూలీ అందుకు అవకాశం ఇవ్వలేదు.

"ముందు రమణి కట్లు విప్పేయ్!" హుకుం జారీ చేసింది.

భయంకర్ రమణి మెడవద్దనున్న బెల్టుని విప్పేశాడు. కళ్ళు ద్వేషాన్ని వెళ్ళగక్కుతూన్నయ్. రమణి నడుముదగ్గర బెల్ట్ విప్పేవాడిలా, బల్ల మీదకు వంగాడు. అతడి చేయి బల్ల క్రింద తడిమింది.

హఠాత్తుగా గదిలో లైటు ఆరిపోయింది. అంతాగాఢాంధ కారం అయింది.

ఆ చీకట్లో గదిలోని గోడకున్న ద్వారం తెరుచుకున్న శబ్దమూ రమణి పడుకున్న చక్రాల బల్ల, నున్నని గచ్చుమీద దొర్లుకు పోయిన అలికిడి స్పష్టంగా వినబడినియ్. భయంకర్ వికటంగా నవ్వాడు గూడ.

ఆ తరవాత అంతా నిశ్శబ్దమై పోయింది. జూలీ తన జేబు లోంచి పెన్‌టార్చ్ తీసి వెలిగించింది.

ఆ గదిలో తనొక్కతే మిగిలిపోయింది. తన ప్రక్కన నిల బడి ఉన్న కరుణాకర్ గూడాలేడు. భయంకర్, రమణి పడుకున్న బల్ల అన్నీ మాయమై పోయినయ్.

తను వచ్చిన తలుపుని తెరవబోయింది. అయితే ఆ తలుపు హ్యాండిల్ తిరగలేదు. అంటే బయటనుంచి ఎవరో తలుపుకు గడియవేశారన్న మాట.

క్షణాల మీద తను ఆ గదిలో ఏకాకిగా బంధింపబడి పోయింది.

# 8

చీకటిగా ఉన్న గదిలో తిరిగి లైటు వెలిగింది. కప్పుకు బిగించబడి ఉన్న స్పీకర్‌లోంచి భయంకర్ కంఠం వినిపించింది.

"నీ ఆఖరి అవకాశంగూడా జారిపోయింది. నీ స్నేహితు రాలు మా చేతుల్లో ఉంది. ఆమె నోటంట, మాకు కావలసిన సమాచారాన్ని రాబట్టుకుంటాం! నీవల్ల మాకు ఎటువంటి అవసరమూ లేదు. అందుకే నిన్ను చంపేస్తున్నాం.

ఆ కంఠం ఆగిపోయింది. జూలీ తనకు అంతిమ క్షణాలు ఆసన్నమయ్యాయని భయపడింది. అయినా ఆఖరు క్షణం వరకూ ధైర్యంగా నిలబడి, తెగించి పోరాడటానికి కృత నిశ్చయ మయింది.

రమణి, భయంకర్, కరుణాకర్, అంత పెద్ద బల్ల అన్నీ ఒక్క త్రుటిలో ఎలా మాయమవుతాయ్! వీరందరూ లైటు ఆరిపోయి వెలిగేలోగా మరో రహస్య ద్వారాన్ని తెరుచుకుని వెళ్ళిపోయి ఉండాలి.

జూలీకి దగ్గు వచ్చింది. గట్టిగా దగ్గుతూ, నెత్తిన అర చేత్తో కొట్టుకుని గొంతు సవరించుకోటానికి యత్నించింది. కానీ నోరు ఆగలేదు. తనకు ఏంజరిగిందీ తేలుసుకునే సరికి ఆమె నిలువెల్లా వణికిపోయింది.

ఆ గదిలోకి సన్నగా విషవాయువును వదులుతున్నారు. తను వెంటనే ఇక్కడ్నుంచి బయటపడకపోతే, ఆ విషవాయువు ప్రభావానికి కొద్ది క్షణాల్లోనే తను ప్రాణం వదలక తప్పదు!

తన జేబుగుడ్డను నోటికి, ముక్కుకు అడ్డంగా కట్టు కుంది. వీలైనంత తక్కువగాలిని పీల్చడానికి యత్నించింది.

నేలా, గోడలు తడుముతూ రహస్యద్వారం కోసం వెదక సాగింది ఆమె.

పెన్‌టార్చి వెలుగులో గోడమీద బుడిపెలాంటి నీడ పడింది. జూలీ ఆనందానికి అంతులేదు. అక్కడ గోడలో కంటికి కనుపించనంత చిన్న స్విచ్ ఉంది. కానీ టార్చివెలుగులో దాని నీడ గోడమీద ఒక ప్రక్కగా పడింది.

అప్పటికే ఆమె కళ్ళు మూతలు పడిపోతున్నయ్. తలంతా దిమ్మెక్కి పోతున్నది. ఆమె చేతులు ఆమె స్వాధీంలోనుంచి తప్పి పోతున్నయ్. చేతిలోని పెన్‌టార్చి పట్టు తప్పి క్రింద పడిపోయింది.

గాభారగా నేలమీదకు వంగి, టార్చిని మళ్ళా దొరకబుచ్చుకుంది. తన శక్తినంతా కూడగట్టుకుని, లేచి నిలబడి గోడమీది స్విచ్‌ని నొక్కింది.

గోడలో తలుపు తెరుచుకుంది. జూలీ ప్రక్క గదిలోకి దూకింది. మరుక్షణం తలుపు మూసుకుపోయింది.

నేలమీద పడుకుని ఒక్కక్షణం అలసట తీర్చుకుంది జూలీ! తలుపు తెరుచుకోవడం మరొక్క నిముషం ఆలస్యం అయి ఉంటే, తన పని ఖాళీ అయిపోయేది. భారత గూఢచారి శాఖలో మరో శాశ్వత ఖాళీ ఏర్పడి ఉండేది. తన చావు మూలంగా.

తనున్న నడవలోంచి నాలుగడుగులు వేసేసరికి మరో గది తలుపు కనుపించింది జూలీకి.

లోపల్నుంచి మాటలుగూడ వినవస్తున్నయ్. తలుపు హ్యాండిల్ మీద చెయ్యివేసి మెల్లగా త్రిప్పింది.

ఏ మాత్రం శబ్దం చెయ్యకుండా తలుపు తెరుచుకుంది. తలుపు పూర్తిగా తెరవకుండా, సందులోంచి లోపల జరిగే దాన్ని చూడటానికి యత్నించింది జూలీ.

ఇంతకు మునుపు తను చూసిన బల్లమీద రమణి కను

పించింది. ఆమె ప్రక్కగావఃరో బల్లకు ఇంకో వ్యక్తి బంధింప బడి ఉన్నాడు. నల్లని సూట్‌లో ఇద్దరు సెంట్రీలు చేతిలో తళతళ మెరిసే కత్తులతో, ఆ మనిషిని ఆపరేషన్‌చేసే వాళ్ళలా నిలబడి ఉన్నారు.

"నిన్ను ఆ జూలీ వచ్చి ఇంకా రక్షిస్తుందని ఆశ పెట్టుకోకు. మేం వదిలిన విషవాయువుకు ఆమె ఈపాటికి చనిపోయి ఉండాలి. నా ప్రశ్నకు ఇప్పుడైనా బదులు చెప్పు!లేదా, నీ ఎదురుగా ఉన్న మీ మొదటి ఏజెంట్‌ని, నీ కళ్ళెదుటే, కత్తితో కండగా చీలుస్తాం!"

"ఏమిటో ఆ ప్రశ్న!" రమణి జీరబోయిన గొంతుతో అడిగింది.

"నీవూ, జూలీ, మీరిద్దరూ భారత గూఢచారీ కేంద్రం నుంచి పంపబడ్డారని మాకూ తెలుసు. కానీ మీ కంటే ముందు వచ్చిన వారిలో మొదటి ఏజెంటుకు 'వీరనారి' పుట్టుపూర్వోత్తరాలు తెలుసు. అతడికి తెలిసినదంతా కేంద్ర కార్యాలయానికి తెలిసిపోయిందా?"

"మా ఏజెంటు మీ చేతుల్లోనే ఉన్నాడుగదా? అతడ్నే అడిగి చూడగూడదూ?" రమణి ఎదురు ప్రశ్న వేసింది.

"చూడవమ్మాయ్! భయంకర్ అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పవలసినదే కానీ, ప్రశ్నించే హక్కు, అవకాశం నీకు లేవు. నా ప్రశ్నకు జవాబు చెబుతావా?లేదా? కాలయాపన చేయకు!"

"నేను చెప్పను. మీకు కావలసిన సమాచారాన్ని రాబట్టుకుని తర్వాత అయినా, నన్నూ, అతడ్నీ చంపేస్తారు మీరు."

భయంకర్ నల్లసూట్‌వాలాకు సంజ్ఞ చేశాడు. అతడు బల్లదగ్గరగా వచ్చి తన చేతిలోని కత్తిని, రమణి ప్రక్కనే మరో బల్లమీద పడుకుని ఉన్న వ్యక్తి పొట్టకు అనించాడు.

"నేను మూడు అంకెలు లెక్కపెట్టేలోగా చెప్పావా సరి. లేదా వేం చేసేది చేసితీరుతాం! నీ మూలంగా వేం కాలయాపన చెయ్యలేం! వాకవతల అర్జంటు పనులు బోలెడున్నయ్!" అన్నాడు. భయంకర్ తన వాచీ వంక చూసుకుంటూ.

"ఒకటి!" నిశబ్దంగా ఉన్న గదిలో భయంకర్ గొంతు మార్మ్రోగింది.

జూలీ వెన్నులోంని భయం జర జర ప్రాకింది. భయంకర్ అన్నంత పని చేసి తీరతాడని, అతడి విషపు చూపులే చెబుతున్నాయ్. రమణినీ, ఆమె ప్రక్కనే ఉన్న వ్యక్తినీ చంపేశాక భయంకర్ చూపు తన మీదకు తప్పకుండా మరలుస్తాడు.

"రెండు!"

చచ్చిన శవాన్ని పీక్కుతినటానికి ఆశగా చూసే రాబందుల్లాగా, నల్లని సూట్ వ్యక్తి, బల్లమీది ఖైదీవంక, కౄరంగా చూస్తున్నాడు

భయంకర్ పిడికిళ్ళు కోపంతో బిగుసుకోవటం గమనించింది, జూలీ. అతడి కళ్ళు ఎర్రబడి, నిప్పులు గ్రక్కుతున్నాయ్, ఏ క్షణంలోనైనా అతడు మూడు అనొచ్చు! ఆ తర్వాత దుఃఖమయమే.

జూలీ కళ్ళు, రమణి పడుకుని ఉన్న బల్ల కాళ్ళ క్రింద చక్రాల మీద పడినయ్, ఆమె బుర్ర చురుకుగా పనిచేసింది. ధఢాలున తలుపు నెట్టుకుని సుడిగాలిలా గదిలోకి ప్రవేశించింది. చక్రాల బల్ల చివరగా తన చేతుల్ని ఆనించి, బలాన్నంతా ఉపయోగించి బల్లను ముందుకు త్రోసింది.

బల్ల వేగంగా వెళ్ళి భయంకర్‌కు ఢీకొంది. భయంకర్ క్రింద పడిపోయాడు. జూలీ విసిరిన సిగరెట్ సైజు కత్తి వెళ్ళి నల్ల సూట్ వాలా కంఠంలో దిగబడింది. అతడు అరుస్తూ

నేలాకూలాడు.

అతడి చేతిలోని కత్తిని లాక్కుని, నేలమీదా పడిపోయిన భయంకర్ కంఠానికేసి గుచ్చి పెట్టింది.

" రమణి కట్లు ఊడ దీయమను మీా వాళ్ళను. లేదా ఈ కత్తి నీ పీకను తెగ్గోస్తుంది!'' అని ఉరిమింది జూలీ.

భయంకర్ అలానే చేశాడు. రమణి కట్లు విడివడినయ్. ఆమె లేచి నిలబడింది.

"మీా అనుచరులందరి చేతులోని ఆయుధాల్ని రమణికి అందించమను!'' మళ్ళీ అంది జూలీ.

అదీ జరిగింది.

"రెండో వ్యక్తిని గూడ కట్లు విప్పి, విడిపించు!''

భయంకర్ సంజ్ఞచేయగా, రెండో వ్యక్తిగూడ విడిపించ బడ్డాడు.

"మమల్ని సురక్షితంగా బయటకు జేర్చు! లేదా నీ ప్రాణాలు దక్కవు! ఆ తర్వాత మే మే మయినా ఫర్వాలేదు. చచ్చినా సరే లక్ష్యం లేదు!''

రమణి మరో మెషీన్ గన్‌ని తెచ్చి భయంకర్ వెన్నులో ఆనించింది.

నల్ల సూట్‌లో ఉన్న మరో వ్యక్తి మెల్ల మెల్లగా తలుపు వైపుకు జారుకో సాగాడు. అది గమనించి జూలీ అతడ్ని తన కాలితో బలంగా తన్నేసరికి అతడు నేల బారుగా పడిపోయాడు.

"ఆ పంది వెధవను బల్లమీాద పడుకోబెట్టి కట్లు కట్టండి'' వాడికి అంతటి శాస్తి జరిగింది.

"మిస్టర్ భయంకర్! ఇకనడు!''

భయంకర్‌ని రెండువైపులా జూలీ, కొత్తగా విముక్తుడైన వ్యక్తీ నడుస్తున్నారు. అతడి వెనుక రమణి మెషీన్ గన్

పుచ్చుకుని అడుగులేస్తున్నది.

"కరుణాకర్ ఎక్కడ?"

"ప్రక్క గదిలోనే ఉన్నాడు. మనం వెళ్ళేటప్పుడు అతడ్ని కలుపుకు పోవచ్చు!" భయంకర్ బదులు చెప్పాడు.

నిర్దాక్షిణ్యంగా, మనుష్యుల్ని పిట్టల్ని కాల్చి చంపినట్లుగా చంపే భయంకర్‌లాంటి కిరాతకుడికి గూడ, ప్రాణం అంటే ఎంత తీపి అని విస్తుబోయింది జూలీ!

# 9

"మిస్టర్ భయంకర్! మీరు కత్తితో కండగా కోయటానికి యత్నించిన ఆ కొత్త వ్యక్తి ఎవరు?" జూలీ అడిగింది.

"అతడూ మీ శాఖవాడే! తప్పిపోయిన మొదటి ఏజెంటు!"

"అంటే నీవు?" మొదటి ఏజెంట్ వంక ప్రశ్నార్థకంగా, చూసింది.

"నాపేరు ఛటర్జీ!"

జూలీ సంతోషానికి అవధి లేదు! తన పథకం ప్రకారం ఇద్దరు గూఢచారుల్ని విడిపిస్తోంది. కాని ముఠా నాయకురాలే దొరకలేదు.

కోటలోంచి బయటకు వచ్చారు. ఆవరణలో తమను అక్కడకు తీసుకు వచ్చిన కారు కనుపించింది.

"భయంకర్! నీవు స్టీరింగ్ ముందు కూర్చుని కారు నడుపు! ఛటర్జీ! నీవు అతని ప్రక్కనే కూర్చుని, అతడ్ని నీ ఆధీనంలో ఉంచుకో!" అంటూ ఛటర్జీకి హుకుం జారీ చేసింది జూలీ.

కారు వెనుక సీట్లో రమణి, జూలీ, కరుణాకర్ కూర్చున్నారు. జూలీ పిస్టల్‌ని భయంకర్ తలకు గురిపెట్టి కూర్చుంది. ఛటర్జీ భయంకర్ ప్రక్కన కూర్చుని మం

పిస్టల్‌ని అతడికి గురిపెట్టాడు.

కారు కదిలింది. భయంకర్ కారు నడుపుతూండడ కాపలా సైనికు లెవరూ అభ్యనంతరం చెప్పలేదు.

నాయకురాలు ఏమైపోయిందా అని ఆశ్చర్యప జూలీ. ఆమె ఎక్కడకో దూరంగా వెళ్ళి ఉంటుంది. ఆమె నిప్పులుకక్కుతూ వచ్చి ఉండేదే గదా!

కారు మెలికలు తిరుగుతూ ఎడారిలోని రోడ్డు కుదుపులతో పోతున్నది.

నాలుగయిదుమైళ్ళు రాంగానే కారుని ఆపమంది.

''భయంకర్ నీ కాళ్ళకున్న బూట్లూ, మే విప్పేయ్! ఇక వచ్చిన దారినే లెఫ్ట్ రైట్ అంటూ నాయ దగ్గరకు వెళ్ళి నీ గోడు చెప్పుకో!'' అని హుంకరించిం

పాదరక్షలు లేని కాళ్ళతో, ఎండ వేడిమికి కాలి ఇసుకలో భయంకర్ నడక సాగిస్తున్నాడు.

''పాపం! బూట్లు ఇవ్వాల్సింది వాడికి!'' రమణి అంది.

''బూట్లు లేకపోతే, ఇంకా కొంచెం ఆలస్యంగా కుంటాళ్ళ! ఈ లోగా మనం ఇంకా చాలా దూరం వెళ్ళిపో ఆని చెప్పింది జూలీ.

''మరో అరగంట ప్రయాణం చేసేసరికి, ఆకా బంయ్ మని శబ్దం వినిపించింది.

జూలీ ఉలిక్కిపడింది. ఆ శబ్దం అంత కంతకూ ఎ తోంది ఏదో విమానం తమ కారుని వెంటాడ డానికి వస్తో మాట! ఇప్పుడేమిటి గత్యంతరం?

''చచ్చాం! అది బాంబులు పడేయటానికే వస్తో అన్నాడు ఛటర్జీ భయంతో.

''రమణీ, జూలీ కారులోంచి తలలు బయటకు పెట్టి చూశారు. విమానంలోంచి నల్లని వస్తువేదో క్రిందకు దిగ విడిచారు.

కారుకు ఫర్లాంగు దూరంలో బాంబు పడి ప్రేలింది. పెద్ద ఎత్తున ఇసుక ఆకాశంలోకి లేచింది. నల్లని పొగ చుట్టు ప్రక్కల ప్రదేశానంత ఆవరించింది.

దోవ కనబడడంలేదు. కారు నిలిచిపోయింది. ''రోడ్డమ్మటే కాకుండా, అడ్డదోవన పోదాం!'' అంటూ ఛటర్జీ కారుని మళ్ళించి ఇసుకలోంచి పోనిస్తున్నాడు. అతడికి ఆ దోవంతా బాగా పరిచయమైన వాడిలా బాంబు వల్ల ఏర్పడిన గోతిని తప్పించి, నల ని పొగలు తిరిగే ప్రదేశాన్ని తప్పించి, అవతలవైపు రోడ్డు ఎక్కించాడు కారుని.

అయితే అక్కడ రోడుకు అవరోధం ఏర్పడింది. బాంబు ప్రేలుడు వలన పైకెగజిమ్మిన ఇసుక అంతా కుప్పగా పడి చిన్న కొండలాగ ఏర్పడింది రోడ్డు మీద.

''అరె! ఇప్పుడెలాగు!'' జూలీ అనుమానంగా చూసింది.

''మరేం ఫర్వాలేదు. ఇసుకలో అడ్డం పడి పోవచ్చు!''

కారు ఇసుకలో ఏత్తు పల్లాల మీదుగా ఎక్కుతూ, దిగుతూ పోతున్నది.

చిన్న ఇసుకతిన్నె మీదకు ఎక్కింది కారు.

అందరి కళ్ళూ ఆశ్చర్యంతో మెరిసినయ్. ఇసుకలో అంత దూరం తిరిగి తిరిగి వాళ్ళు మళ్ళీ ఎడారి కోట దగ్గరకే చేరు కున్నారు. గానుగెద్దులాగా, దారీతెన్నూ తెలీకుండా ఒక చుట్టు చుట్టి వచ్చి బయలు దేరిన చోటికే వచ్చారు.

అంతేకాదు! కోటలోంచి మరో కొత్త రకం కారు బయలు దేరింది. ఇసుకలో వేగంగా పోవటానికి వీలుగా ఆ కారు

చక్రాలకు, టాంకులను అమర్చినట్టుగా, ఇనుప బెల్టులున్నయ్. ఆ శకటానికి పైన కప్పు గూడ టాంకు మోడల్‌లోనే ఉంది. ఎంతటి ఇసుక తుఫానులో అయినాసరే, ఎటువంటి ఆటంకం లేకుండా ప్రయాణించవచ్చు, నడిపేవానికి ఏవిధ మైన ఇబ్బంది లేకుండా.

"అదుగో! ఆ శకటంలో ఎవరో మనకోసమే బయలుదేరి నట్టున్నారు! ఇప్పుడేం చేయటం" రమణి గాభరాగా అంది.

"ఛటర్జీ! కారుని వెనక్కు నడుపు! వాళ్ళ కంటబడక ముందే ఏదన్నా ఉపాయం ఆలోచించాలి!" జూలీ అరిచింది.

ఛటర్జీ ఆమె ముఖంలోకి చూశాడు. ఆ తర్వాత కారు గుట్ట మీదనుంచి వెనక్కు జారింది.

# 10

"త్వరగా! మీరిద్దరూ ఈ గుట్ట చాటున దాక్కోండి!" అంది జూలీ కరుణాకర్, ఛటర్జీలను ఉద్దేశించి.

కారులోంచి టార్పాలిన్ ఒక దాన్ని తీసుకుని ఇద్దరూ క్రిందకు దిగి, ఇసుకలో పరుచుకుని కూర్చున్నారు ఇద్దరూ. కొంత భాగం టార్పాలిన్‌ని మీదకు కప్పుకున్నారు. ఎండ పడకుండా.

జూలీ స్టీరింగ్ ముందు కూర్చుంది. ఆమె ప్రక్కనే రమణి ఉంది.

కారుని మలుపు త్రిప్పి ఛటర్జీ కూర్చున్న చోటునుంచి దూరంగా పోనిచ్చింది. శకటంలో వస్తున్న వ్యక్తుల దృష్టి నుంచి ఆ ఇద్దరు ఏజెంట్లను రక్షించాలని ఆమె పన్నాగం!

శకటంలోని వ్యక్తులు కారుని చూసినట్లున్నారు. కారు వెంట బడింది శకటం!

జూలీ కారుని మరో గుట్ట చాటుకు పోనిచ్చింది. గుట్ట

మీాదకు సగందాకా వెళ్ళి బ్రేకు వేసింది. ఇసుకలో కారు నిలబడక జారిపోతోంది.

"త్వరగా! దిగెయ్!" అంటూ జూలీ కారులోంచి దిగింది" రమణి గూడా ఆమెను అనుసరించింది. కారు బయటనుంచే స్టీరింగ్‌ని త్రిప్పుతూ కారుని పల్లంలోకి జారనిచ్చింది.

ఇసుకలో కారు ప్రక్కకు ఒరిగి పోయింది. ఎవరైనా చూస్తే కారు ప్రమాదవశాత్తూ తిరగబడిందని అనుకోకమానరు.

రమణి, జూలీ ఇద్దరు గుట్ట చాటుకు వెళ్ళి దాక్కున్నారు. శకటం వచ్చి కారు దగ్గరగా ఆగింది.

అందులోంచి ఇద్దరు వ్యక్తులు దిగారు క్రిందకు. "ఇసుకలో కారు నడపటం చేతకావద్దూ! అది కాస్తా తిరగ బడిపోయింది!" అన్నాడొకడు.

"కారులో వాళ్ళు ఏరీ? బహుశా ఇసుకలో పూడిపోయా రేమో!" రెండోవాడు అందుకున్నాడు.

ఇద్దరూ కారుకి బాగా దగ్గరలోకి వచ్చి, వంగి చూస్తూ శవాలకోసం చూడసాగారు,

ఈ లోపల జూలీ, రమణి చేయి పుచ్చుకుని లాక్కెళుతూ శకటాన్ని చేరుకుంది, చుట్టూ తిరిగి వచ్చి. డోర్ తెరిచి రమణిని లోపలకు నెట్టి, తను స్టీరింగ్ ముందు కూర్చుంది. ఇంజన్ స్టార్ట్ కావడమేమిటి, శకటం ముందుకు దూసుకు పోవటమేమిటి, అంతా రెప్పపాటులో జరిగిపోయింది.

పడిపోయిన కారులోకి చోద్యంగాచూస్తున్న ఇద్దరు వ్యక్తులూ వెనక్కు పరుగెత్తుకు వచ్చారు. శకటం దుమ్ము లేపుకుంటూ దూరంగా పోతున్నది.

"డామిట్! మననే మోసపుచ్చారే!" అన్నాడు మొదటి వాడు, నెత్తిమీాద టోపిని తీసి, తల గోక్కుంటూ.

"ఇప్పుడు మాత్రం మించిపోయినదేముంది? ఈ పడిపోయిన కారుని లేవదీసి, అందులో మనం కోటకు పోదాం!" రెండోవాడు సూచించాడు.

"అవునోయ్! భుజాన్ని మోటించి కారుని పైకి లేపు! నేనీ వైపు లేవనెత్తుతాను!"

ఇద్దరూ అరగంటసేపు తిప్పలు పడ్డారు. చెమటలు కక్కుతూ కారుని తిరగ దోశారు.
స్టీరింగ్ ముందుకూర్చుని కారు స్టార్టు చేయబోయారు మొదటివాడు. కాని స్టార్టవలేదు.

"చచ్చాం! ఇందులో పెట్రోలు అయిపోయింది!"అన్నాడు దిగాలు మొగంతో.

జూలీ శకటాన్ని మలుపు త్రిప్పి, ఇంతక్రితం కరుణాకర్‌నీ ఛటర్జీని దిగవిడిచిన చోట ఆపుచేసింది.

అక్కడ ఒట్టి టార్పాలిన్ మాత్రమే ఉంది. ఇద్దరు ఏజెంట్లూ మాయమయారు.

"అరె! అంతా మాయగా ఉందే! ఇలా దిగవిడిచిన వ్యక్తులు అలా క్షణాల మీాద మాయమయి పోతున్నారు!" జూలీ నోరు తెరిచింది.

"మనం వాళ్ళను దొరక బుచ్చుకోవడం, నాయకురాలు మళ్ళీ లాక్కుపోవడం! ఇదో రకం దాగుడు మూతలాటలా ఉందే!" రమణి పలికింది.

జూలీ నేలమీాదకు వంగి ఇసుకలో ఏమైనా గుర్తులుగాని ఆనవాళ్ళుగానీ కనబడతాయేమో అని చూసింది.

సన్నని ఇసుక పొరక్రింద శకటం టైరు గుర్తులు లీలగా కనుపిస్తున్నయ్!

అంటే! వాళ్ళిద్దర్నీ మరా వాళ్ళు చేజిక్కించుకున్నారు?

తిరిగి కోటలోకి లాక్కెళ్ళి ఉంటారు?

తాము చూస్తుండగా కోటలోంచి ఈ శకటం మాత్రమే వచ్చింది. దాన్ని తామే దొరకబుచ్చుకున్నారు. ఇంక ఆ గూఢ చారుల్ని ఎవరు తీసుకు వెళ్ళి ఉంటారు?

“ఆఁ! తెలిసింది. మనం ఇక్కడ ఉండగా, నాయకురాలు కోటకు తిరిగి వస్తూ ఉండాలి. తిన్నె వెనుక ఈ ఇద్దరు వ్యక్తుల్నీ చూసి, వాళ్ళను మళ్ళీ బంధించి కోటలోకి తీసుకెళ్ళి ఉంటుంది!” రమణి విచారంగా అంది.

“అవును! అంతే అయి ఉంటుంది!”

ఇప్పుడేమిటి చేయటం? శకటాన్ని వేసుకుని ఇక్కడ నుంచి ప్రాణాలతో బయట పడటమేనా?”

“లేదు రమణి! మళ్ళీ మనం కోటలోకి పోతున్నాం!” అంది జూలీ, ఏదో నిర్ణయానికి వచ్చిన దానిలా.

ఆ నిర్ణయం ఎంత ప్రమాదకరమైనదో రమణికి తెలుసు. కాని తమ డ్యూటీ తెల్లారి లేచింది మొదలూ ప్రమాదాన్ని వెతుక్కుంటూ పోవటమే గదా!

రమణి వెర్రిగా జూలీ ముఖం వంక చూసింది, వెనక్కు తిరిగి వెళ్ళక తప్పదా అన్నట్టుగా!

శకటం మళ్ళీ బయలుదేరింది. కోట అంతకంతకు దగ్గరవుతోంది. గేటు దగ్గర సెంట్రీ రైఫిల్ భుజాన పెట్టుకుని అటూ ఇటూ పహారా కాస్తున్నాడు. గేటు తలుపులు మూసి వేసి ఉన్నయ్.

“గేటు తెరవాలంటే సెంట్రీ మనముఖాల్ని పరీక్షగా చూసిగాని లోనికి పోనివ్వడు! ఎలాద మనం లోపలకు ప్రవేశించేది?” రమణి కనుబోమలు ముడిచింది.

జూలీ వెనక్కుదిరిగి లోపలంతా కలయజూసింది. శక

టంలోపల ఒక ప్రక్కగా రెండు శిరస్త్రాణాలూ. ఎడారిలో చూపు కనిపించేందుకు కళ్ళకు ధరించే గాగుల్స్‌జతా కనిపించినయ్.

"వాటిని అందుకొని తలకు తగిలించు కుందాం. కళ్ళకు జోడు పెట్టుకుంటే మన ముఖాలు పూర్తిగా కనపడవ్!" అంది జూలీ, శిరస్త్రాణాన్ని నెత్తికి తొడుక్కుంటూ.

గేటు దగ్గర సెంట్రీ చెయ్యిజాపి అడ్డంగా నిలిచాడు ఆగమన్నట్టుగా. శకటం ఆగింది. సెంట్రీ ప్రక్కగా దగ్గరకు వచ్చి, వంగి, సన్ననికన్నంలోంచి లోనికి తొంగి చూశాడు.

అతడు వాళ్ళనేమాత్రం అనుమానించకుండా, గేటు తెరిచాడు. "అటుగా ఆపండి!" అంటూ ఒక దిశగా చూపించాడు సెంట్రీ.

గేటు దాటి ఎడారి శకటం లోనికి ప్రవేశించింది. రాతి గోడకు ప్రక్కగా ఆగింది.

# 11

"మనం శకటంలోంచి దిగామంటే, మనం సెంట్రీ కంటబడుతాం! ఎలాగ?" రమణి దిక్కులు చూసింది.

అప్పటికే జూలీ తాము ఎలా తప్పుకోవాలా అని ఆలోచిస్తున్నది.

కోట గోడలో అక్కడక్కడ మెట్లులాగ రాళ్ళు పొడుచుకు వచ్చినయ్, వాటిమీదుగా ఎక్కి ఇద్దరూ గోడమీదకు ఎక్కారు లేచినిలబడితే తమను ఎవరన్నా చూస్తారేమో అని, మెల్లగా ప్రాకుతూ మరో వేపుకు దాటుకున్నారు.

సెంట్రీ గేటు దగ్గర నిలబడి ఎడారివేపుగా చూస్తూండడం వల్ల వాళ్ళను ఎవరూ గమనించలేదు.

"అదుగో వాళ్ళను చూడు!" అంది రమణి ఎడారిలోకి

చూపిస్తూ.

జూలీ అటుగా చూసింది. శకటంలో ఎడారిలోకి వచ్చిన వ్యక్తులిద్దరూ కాళ్ళీడ్చుకుంటూ వస్తున్నారు.

"వాళ్ళు వచ్చేలోగానే మనం లోపలకు జొరబడాలి. వాళ్ళు లోపలకు వచ్చి, మన గురించి చెప్పారంటే, మన కోసం మూల మూల్లా వెదుకుతారు!"

"గాభరా పడకు! వాళ్ళుగేటు దగ్గరకు చేరేలోగానే, మనం కోటలోకి జొరబడుతాం!" జూలీ ధైర్యం చెప్పింది.

జూలీ. రమణి ఆగిన చోట, గోడక్రిందుగా లారీలునిల్చి ఉన్నాయ్. చప్పుడు కాకుండా, లారీల చాటుకు దూకారు ఇద్దరూ. అక్కడున్న ఇతర వాహనాల చాటుగా లోపలకు ప్రవేశించారు.

ఒక్క అంగలో రెండేసి మెట్లు ఎక్కుతూ లోపలకు దూరారు. వెనక్కు తిరిగి చూడకుండా.

మెట్లు తలుపు దగ్గర ఆగిపోయినయ్. ఆ తలుపు తెరిస్తే వడ్రంగం పని చేసే వాళ్ళు ఎదురు పడతారనీ, వాళ్ళహాలు తర్వాత 'వీరనారి' గది ఉందనీ జూలీకి తెలుసు ఎందుకంటే ఇంతకు మునుపు భయంకర్ తమను బంధించి అటునుంచే తీసుక వెళ్ళాడు.

కారిడార్‌కు మరో ప్రక్కగా ఇంకో తలుపు కనిపించింది. ఆ తలుపు వెనక ఏముందో కనిపెట్టాలన్న కుతూహలంతో అటుగా అడుగులు వేసింది జూలీ.

తలుపు హ్యాండిల్ తిరిగింది. కానీ తలుపు తెరుచుకోలేదు. జూలీ తన జేబులోంచి సన్నని పరికరాన్ని తీసి తాళం తీయుటానికి ప్రయత్నించింది.

గేటు దగ్గర కలకలం వినవచ్చింది. సెంట్రీ పెద్దగా

అరుస్తూ ఏదో హెచ్చరిక చేస్తున్నాడు. బహుశా ఆ
తమను గురించే అయి ఉండచ్చని ఊహించింది జూలీ
తాళం ఊడివచ్చింది. తలుపు తెరచుకుని
లోపలకు దూరారు. తమ వెనుకనే తలుపు మూసుకు
గడియ పెట్టేశారు.

జూలీ గదంతా కలియజూసింది. అదో స్టోర్
గుంది. ఏవేవో ఎలక్ట్రిక్ పరికరాలున్నయ్. వైర్లూ, రేడి
ఉపయోగించే వాల్వులూ, ఇంకా ఇతరములైన వన్నీ అర
పెద్ద పెద్ద కేసుల్లోనూ అమర్చి ఉన్నయ్.

వాటి అన్నిటికన్న ఏదో కొత్తరకం శబ్దం వాళ్ళని
షరిచింది. ఆ శబ్దం ఎక్కడనుంచి వస్తున్నదా
కించింది ఆమె.

ఆగదికి ఆనుకుని ఉన్న మరో గదిలోంచి కొత్తర
ధ్వని వస్తున్నదని గ్రహించింది జూలీ, తలుపు దగ్గ
ఆనించి విన్న తర్వాత.

"లోపల్నుంచి ఏవో మాటలు గూడ వినవస్తున్న
ఉందే!" అంది రమణి గూడా చెవి తలుపుకు ఆనిం
తర్వాత.

"అవును! వాళ్ళిద్దరూ ఏదో ప్రయోగం
మాట్లాడు తున్నారు! ఆప్రయోగాన్ని ఖైదీ మీద ఉ
గించి చూడాలంటున్నారు!"

"అంటే మన కరుకణార్ గానీ, చటర్జీ మీదగాని
ఉండాలి. వాళ్ళని ఎలా రక్షించటం ఈ ప్రమాదం న

బయట కారిడార్‌లో బూట్ల చప్పుడు వినిపించింది,
అప్పుడే తమ కోసం అన్వేషణ మొదలయిందన్నమాట.

బూట్ల చప్పుడు దూరం కాగానే, జూలీ తలుపు

బయటకు చూసింది.

గేటు దగ్గర కాపలా కాసే సెంట్రీ అన్నివైపుల చూస్తు న్నాడు. వాడు మళ్ళీ తమగది దగ్గరకు వచ్చి తలుపు నెట్టి చూశాడు, ఆగది తలుపు తాళం వేసి ఉంటుందనే తలంపుతో.

కాని చప్పున తలుపు తెరుచుకోవడం. జూలీ వాడ్ని జ్యూడో దెబ్బతో పడగొట్టి, జర జర లోపలకు లాగటం రెప్పపాటులో జరిగిపోయింది.

సెంట్రీ నడుముకున్న బెల్టుతో అతడి కాళ్ళు బంధిం చేశారు. అతడి జేబుగుడ్డను తీసి, వాడినోట్లో కుక్కారు, అరవకుండా.

రమణి గదిలో ఒక మూలనుంచి సన్నని వైర్ లాక్కొ చ్చింది. దాంతో అతడి చేతులు కట్టేశారు.

తలుపు మూసి, వాడ్ని తలుపు కడ్డంగా పడుకో బెట్టారు. జూలీ అతడి తలపై ఇచ్చిన దెబ్బకు వాడికి ఎప్పుడో స్పృహతప్పి పోయింది.

తర్వాత శబ్దం వస్తున్న ప్రక్కగది తలుపు తెరిచారు.

ఒకవ్యక్తి గోడకానుకొని నిలబడి ఉన్నాడు. ఒక చేతిని మాత్రం, ఎవరో కొట్టబోతూంటే, ఆ దెబ్బనుంచి రక్షించు కోవడానికీ అన్నట్టుగా ముఖానికి అడ్డం పెట్టుకున్నాడు. అతడి కనురెప్పలు ఆడుతున్నా, అతడిలో చలనం లేదు. ముఖం నిశ్చలంగా, అమాయకంగా ఉంది‘ అతని ముందు, నేలమీాద సబ్బుపెట్టె ఆకారంలో చిన్న పెట్టెఉంది.

తాము విన్నశబ్దం ఆ పెట్టెలోంచే వస్తున్నదని గ్రహిం చింది జూలీ.

ఆ గదిలో నేల మీాద ఉన్నటువంటి పెట్టెలు ఇంకా అనేకం ఉన్నయ్!

అలమారు దగ్గరకు వెళ్ళి, చిన్నపెట్టె నొకదా
కుంది. దాని మూత ఊడదీసి లోపలున్న పరికరాన్ని
చూసింది.

"ఈ పరికరంలోంచి కంటికి కనుపించని శక్తి
కాంతి పుంజం వెలువడుతుంది. దాన్ని ఎవరిమీదకు (
వాళ్ళు శిలాప్రతిమల్లా నిలబడిపోతారు, ఏమీ చేయ
కత్తుల్లా, నేను వీరనారి మీదకు దూకబోయినప్పుడ
నామీదకు ఇదే కిరణాన్ని ప్రసారం చేసింది."

"అందుకే ఈఖైదీ శిలా ప్రతిమలా నిలబడి పో
మాట! ఈ గదిలో ఉన్న పెట్టెలన్నీ అలాంటి పరికరా
ఉంటాయి!"

"అందుకు సందేహంలేదు. కానీ వీటివల్ల 'వీరనా
విధమైన ఉపయోగమో అర్థం కావటం లేదు!"

మరో అలమారులో ఎర్రరంగు శిరస్త్రాణాల
విమానాల్లోంచి, పారా చూట్లలో క్రిందికి దూకే
చోదకులు ధరించేవిలా ఉన్నయ్ అవి.

అంతలో ఎవరో తలుపు బాదటం వినిపించింది.
పడి ఇద్దరూ తలుపు వంక చూశారు.

ఈ సరికొత్త పరికరాన్ని ఎలా ఉపయోగించాలో
బాగుండును అనుకుంది జూలీ.

వీటివి తయారు చేసే ఇంజనీర్లో, సైంటిస్టులో
గాని తారసపడితే బాగుండును, వాటి రహస్యం కనుక్కో

జూలీకి ఏదో ఆలోచన తట్టింది. అలమారు దగ్గరక
శిరస్త్రాణాన్ని తీసి తలకు తగిలించింది. చెవుల క్రింద
సరిపోయింది అది. గడ్డం క్రిందుగా దాని బెల్టును బిగిం
రమణి ఆమెతో ఏదో అంది. కానీ అది జూలీ

బడలేదు, శిరస్త్రాణం ధరించడం వలన ఆమె చెవులు మూసుకు పోయి బయట శబ్దాలేవీ వినిపించటంలేదు.

జూలీ నేలమీదకు వంగి, ఖైదీ ముందు, నేలమీద ఉంచ బడిన సబ్బుపెట్టె సైజు పరికరాలు అందుకుంది. దానికున్న స్విచ్‌ని ఆఫ్ చేసింది. మోత ఆగిపోయింది. అంటే కాంతికిరణం ఆగిపోయిందన్నమాట.

దాన్ని తాకుతూనే జూలీ గూడా శిలాప్రతిమలా అయిపో తుందేమో అని భయంగా చూసింది రమణి.

కాని జూలీకి అలాటిదేం సంభవించలేదు. అంటే శిరస్త్రాణాలు ధరిస్తే, ఆపరికరం విడుదల చేస్తే శబ్దతరంగాలు సోకవు. ఆవిధంగా ఆపరికరం వల్ల తనకు అపాయం రాకుండా, దాన్ని ఇతరుల మీదకు ప్రయోగించవచ్చునని తెలుసుకుంది ఆమె.

పరికరాన్ని జూలీ ఎప్పుడైతే నేలమీద నుంచి తీసిందో, అదే సమయంలో ఆఖైదీకి విముక్తి లభించింది. అతడు మామూలుగా ఒళ్ళు విరుచు కున్నాడు.

జూలీ తన తలకున్న శిరస్త్రాణాన్ని తొలగించింది. "ఎవరు నీవు? నీపేరేమిటి? ఇంతకు మునుపు ఇద్దరు ఖైదీల్ని లోపలకు తెచ్చారు. వాళ్ళను ఎక్కడ బంధించారు?" ప్రశ్నల వర్షం కురిపించింది ఆమె.

అతడు అయోమయంగా, ఇప్పుడే .మేలుకున్న వాడిలా చూశాడు! "చటర్జీ నాపేరు చటర్జీ!? అన్నాడతడు.

జూలీ అతగాడకి మతిగాని పోలేదు గదా అనిపించింది. 'చటర్జీని ఎడారిలో మరో ఏజంట్ వెంట వదిలి వచ్చాంగదా? ఆ తరవాత ఏం జరిగింది? మళ్ళీ వాళ్ళను బంధించి తెచ్చారు. వాళ్ళేమయినట్టు?"

"ఎడారి ఏమిటే? మళ్ళీ బంధించట మేమిటి? నేను

బంధింపబడి ఇక్కడకు వచ్చినప్పట్నుంచీ బయటకు ముఖం పెట్టి ఎరుగను. ఈనరకంలో యమయాతనలు పడుతున్నాను."

తలుపుమీద ఎవరో గట్టిగా బాదుతున్నారు. తాము తలుపు తీయకపోతే, తలుపు విరిచేసి లోపలకు జొరబడేలా ఉన్నారే అనుకుంది జూలీ.

బహుశా మన కోసం గాలించే సైనికులయి ఉంటారు! మనకేది దారి?'' రమణి తలుపు వంక చూస్తూ అంది.

అయితే జూలీ మనసు పరి పరి విధాలుగా ఆలోచిస్తున్నది. ఇతడే చటర్జీ అయితే, చటర్జీ పేరుతో కారుని నడిపిందెవరు? ఇక్కడ ఇద్దరు చటర్జీలు తారస పడ్డారు. ఇందులో అసలు చటర్జీ ఎవరు? కరుణాకర్ ఏమయినట్టు?

కారిదార్‌లో బూట్ల చప్పుడు అధికమవుతోంది. జూలీ ఒక పరికరాన్ని, ఒక శిరస్త్రాణాన్ని చేతులోకి తీసుకుంది.

ఆ గదిలో మరో తలుపు ఉంది. ఆతలుపు తోసుకొని రమణిని లాక్కునివెళ్తూ ప్రక్కగదిలోకి జొరబడింది. చటర్జీ గూడ ఆమెను అనుసరించాడు.

ఆ గదిలో ఒకవైపు టేబుల్ మీద ప్రొజెక్టర్ ఉంది దాని కెదురుగా గోడకు ఆనించి పెద్ద తెర ఉంది.

జూలీకి అయిడియా వచ్చింది. రమణి వీపు వాకిలి వైపుగా ఉండేలా ప్రొజెక్టర్ ప్రక్కనే ఆమెను కూర్చో బెట్టింది. తను శిరస్త్రాణాన్ని తగిలించుకుంది.

"చటర్జీ! నువ్వు వచ్చి ఇలా నిల్చో. ప్రతిమలాగ కనబడకుండా!'' అంది ఆమె.

తన ముఖం ప్రొజెక్టర్ చాటుగా పెట్టుకుంది. స్విచ్ ఆన్ చేసింది, ప్రొజెక్టర్‌లో రీలు తిరుగుతోంది. తెరమీద దృశ్యాలు కనబడుతున్నయ్.

ఆ దృశ్యాలన్నీ భారతదేశంలోని పెద్ద. పెద్ద బ్యాంకులకు సంబంధించినవి, ప్రవేశ ద్వారం నుంచి బయలుదేరి, కరెన్సీ నోట్లూ, బంగారం నిల్వచేసే సేఫ్టీ వాల్టుల వరకూ ఉన్న దృశ్యం కనుపిస్తున్నది తెరమీద.

అవతలి గది తలుపు తెరుచుకుంది. ఇద్దరు ముగ్గురు సిపాయిలు లోపలి తలుపు గూడా నెట్టి, తొంగిచూశారు.

"ఏయ్! ఎవరది? సినిమా కనబట్టంలా! తలుపులు మూసి వెళ్ళండి బయటకు!" చటర్జీ గొంతు మార్చి అరిచాడు.

ఆగంతులు తలుపులు మూసి వెళ్ళిపోయారు. రమణి సంతోషంగా జూలీ భుజం తట్టింది.—నీ ప్లాను అద్భుతంగా ఉందన్నట్టు.

"ప్రొజెక్టర్ అలానే నడుస్తుందనీ! ఆ శబ్దంలో మనం మరో దోవ చూసుకుని బయట పడాలి!" అంది జూలీ.

అదే సమయంలో ఇద్దరు వ్యక్తులు రెంచీలు, పట్టకార్లతో లోపలకు వచ్చారు "ఏయ్! ఎవరిక్కడా! ఈ స్టోర్ రూమ్ లోకి వచ్చే అధికారం ఎవరిచ్చారు మీకు! వాళ్ళలో ఒకడు అరిచాడు.

జూలీ శిరస్త్రాణం తొడుక్కుని, తన చేతిలోని పరికరాన్ని స్విచ్‌నొక్కి. ఆ ఇద్దరి వైపు త్రిప్పింది.

అంతే! వారిద్దరూ శిలా ప్రతిమల్లా నిలబడిపోయారు.

"నేను అడిగే వాటికి బదులు చెప్పండి! ఆ కిరణం ప్రభావంనుంచి మిమ్మల్ని రక్షిస్తాను. మీరు అరచి గోలచేయ గూడదు.!"

తను 'వీరవారి' ముందు శిలలాగే అయిపోయినప్పుడు, ఆమె మాటలు తనకు వినబడడం స్పష్టంగా గుర్తుంది. కనుక ఇపుడు తను చెప్పే మాట వారికీ వినబడుతుంది. కాని వారు మాట్లాడ

లేరు.

తన చేతిలోని పరికరం స్విచ్ ఆఫ్ చేసింది జూలీ

"వాళ్ళ సమాధానం నాకు వినబడదు. ఈ శ
వల్ల. కనుక వాళ్ళ మాటలు నీవు శ్రద్ధగా విని
ముంచుకో!" అంది జూలీ రమణికేసి చూస్తూ.

ఆ తర్వాత ఇంజనీర్లవంక తిరిగి అడిగింది. "ఆ
రాళ్ని ఎలా ఉపయోగించాలి! దీని ప్రభావం
ఉంటుంది.?"

ఇంజనీరు నోరు విప్పాడు. "ప్రతి పరికరానికి లో
ఫ్యూజ్ ఉంటుంది, దాన్ని కనెక్ట్ చేశాక కుడి ప్రక్క
నొక్కితే కాంతి కిరణాలు ప్రత్యర్థి మీద పడతాయి
ప్రభావం ఒక రోజల్లా ఉంటుంది. ఆ తర్వాత పరి
పవర్ సెల్ అయిపోతుంది. మరో సెల్ వేస్తేగాని
చేయదు!"

జూలీ సంజ్ఞ చేయటంతో, రమణి, చటర్జీ
తీగతో బంధించేచారు. అరవటానికి వీల్లేకుండా నోటి
అంటించారు.

# 12

"మిస్టర్ చటర్జీ! ఇప్పుడు చెప్పు ఏ సంగతి!"
జూలీ.

చటర్జీ తన చటికెన వ్రేలి గోరుని వెనక్కి
అదినిజంగోరు కాదు. అసలు గోటిపై అమర్చుకు
గోరు. నకిలీగోరు క్రింద భారత జాతీయ చిహ్నం
సింహాల ముద్ర కనుపించింది.

"ఇప్పటికైనా నన్ను నమ్ముతారా? నేనే ఇక్కడన
మొదటి గూఢచారిని. మీరెవరో నాకు తెలియదు!

చూడటం ఇదే మొదటిసారి!'' అన్నాడతను ఆశ్చర్యాన్ని కన బరుస్తూ.

అంతలో మరో సంఘటన జరిగింది. గోడలో మరో ద్వారం గుండా కరుణాకర్ వచ్చాడు. అతడి ముఖం చెమటలు కక్కు తోంది. మనిషి రొప్పుతున్నాడు.

"మీరిక్కడున్నారా? పారిపోండి! సైనికులు వస్తున్నారు!'' అని అరిచాడు కరుణాకర్.

అతడి వెనుక నుంచి ఇద్దరు సైనికులు వేటకుక్కల్లా లోపలకు జొరపడ్డారు.

జూలీ తన చేతిలోని పరికరం స్విచ్ నొక్కింది. ఆ సైనికు లిద్దరూ రాళ్ళలా బిగుసుకు పోయారు.

"ఇక నీ కొచ్చిన భయంలేదు కరుణాకర్! నిన్ను ఎడారిలో ఉంచాం గదా? మేం శకటంలోని సైనికుల్ని తప్పించుకుని తిరిగి వచ్చేసరికి మీ ఇద్దరిజాడలేదు ఏం జరిగిందో వివరంగా చెప్పు!'' అనడిగింది. జూలీ.

"అ ఎండలో కళ్ళు మంటగా ఉండి, నేను కళ్ళు మూసుకుని కూర్చున్నాను టార్పాలిన్ క్రింద. నా ప్రక్కనే కూర్చున్న చటర్జీ తన జేబులోంచి ట్రాన్స్మిటర్‌ని తీసి ఏదో సంకేతాలిచ్చాడు. పావుగంట గడవకముందే కోటలోంచి జీప్ వేసుకుని భయంకర్ వచ్చాడు. మా ఇద్దరినీ మళ్ళీ కోటకు చేర్చారు.''

"మనకు కావలసినట్టు చటర్జీ అతడు కాడు! ఇతడు! అస లైన చటర్జీ! ఆ పేరు పెట్టుకుని శత్రువుల్లో మనను మభ్య పెట్టటానికి మనతో వచ్చి ఉండాలి!''

"అదిసరే! ఈ కొత్తరకం పరికరాన్ని ఎలా పసిగట్టావ్? వీళ్ళని శిలాప్రతిమాల్లగా నిముషంలో మార్చేశావే!'' కరుణా

కర్ ఆమెని మెచ్చుకున్నాడు.

ప్రక్క గదిలో తాము ఇంతకు ముందు సెంట్రి ఎలాగో తన కట్లు విడదీసుకున్నాడు. అ పెద్దగా అరుస్తున్నాడు. "శత్రుగూఢచారులు ఇక్కడ అందరూ రండి! అందరూ రండి!"

ఆ కేకలకు జూలీ, రమణి, కరుణాకర్, చటర్జీ ఒక్కసారే ఉలిక్కిపడ్డారు.

జూలీ గబ, గబ, అలమారు దగ్గరకు పరుగెత్తి డున్న శిరస్త్రాణాన్ని అందుకుని మిగతా ముగ్గురికి అం

నలుగురూ చేతికందినన్ని సోప్‌టాక్స్‌లాంటి అందుకున్నారు. వాటిమూత విప్పి ఫ్యూజ్‌ని కనెక్ట్ తలా ఒక పరికరం రెడీగా పుచ్చుకుని తమ అతి ఎదురు చూడసాగారు.

వారున్న గదికి రెండు వైపులనుంచీ తలుపులు సైనికులు లోపలకు దూకారు.

వారు లోపలకు వస్తూనే వారిమీద కాంతి కిర రించింది. ఎక్కడివారక్కడ శిలాప్రతిమల్లా నిలబడి ఆ గదిలో నాలుగు వేపులా నాలుగు పరికరాల్ని ఉంచి ప్రసరించే కిరణాలవల్ల. ఆ గదిలోని వారంతా శిలా ఉండిపోయారు.

ప్రతి ద్వారం దగ్గర ఒక్కొక్క పరికరాన్ని స్విచ్ ఉంచింది జూలీ! ఎవరైనా హఠాత్తుగా అటు వచ్చా శిల అయిపోయినట్టే లెక్క.

మరో ద్వారంగుండా వాళ్ళు నలుగురూ ఆ బయటకు వచ్చారు.

జూలీ నేరుగా వ్రడంగుల గదిలోని వెళ్ళింది. వా

కోటలోకి శత్రువులు వచ్చినట్టుగానీ, ఆ శత్రువులకోసం అన్వే షణ జరుగుతున్నదని గానీ, తెలుసుకున్నట్టు లేదు. వాళ్ళ పనిలో వాళ్ళు నిమగ్నులై ఉన్నారు.

టేబుల్‌మీద బొంబాయి రిజర్వుబ్యాంక్ మోడల్ తయారయి ప్రహ్మాండంగా ఉంది. ఆ మోడల్ ముందు తాజ్ మహల్‌గూడ పనికి రాదనిపించే అందంగా ఉంది.

జూలీ ఒక్క తన్ను తన్నింది. ఆ మోడల్‌ని. అది టేబుల్ మీదనుంచి క్రింద పడి ముక్కలు ముక్కలై పోయింది. వడ్రంగి పనివాళ్ళు కోపంతో తుపాకులు తీయబోయారు. ఆగంతకుల్ని ఎదుర్కొనేటందుకు.

అయితే జూలీ వదలిన కిరణం మూలంగా వాళ్ళు అచేత నంగా బొమ్మల్లా నిలబడిపోయారు.

ఏ మాత్రం కాలయాపన చేయకుండా జూలీ, ఆ హాలు దాటి, మరో గది తలుపు తెరచింది.

ఆ గదిలో నల్లని చీరలో, మేలి ముసుగులో వీరనారి కూర్చుని ఉంది. టేబుల్ ముందు ఆమెకెదురుగా భయంకర్ నిలబడి ఆమెకేదో చెబుతున్నాడు.

ఆగంతకుల్ని చూస్తూనే భయంకర్ తన బెల్టులోనుంచి రివాల్వర్ తీయబోయాడు.

అతడ్ని చూడగానే రమణికి కోపం ముంచుకొచ్చింది. తన చేతిలోని పరికరంతో కాంతి పుంజాన్ని అతడి మీదకు ప్రసరించింది. అతడు అలాగే కొయ్యబారిపోయాడు.

ఈ హఠాత్సంఘటనకు వీరనారి బెదిరిపోయినట్టుగా కనుపించింది.

"మేలి ముసుగులోని వీరనారి! ఈ నాటితో నీ ఆట కట్టు!" అని కోపంగా అరిచింది జూలీ.

"కాంతి కిరణం రహస్యం చేజిక్కిందని కులుకుతున్నా వేమో! అది నా దగ్గర పని చేయదు! చూడు! నిన్నిపుడే పాతాళ గృహానికి పంపుతాను!" అంటూ వీరనారి ఆమె టేబుల్ మీది స్విచ్‌ని నొక్కింది.

శిరస్త్రాణం ధరిస్తే ఎవరి మాటలు వినబడవు గదా, వీర నారి మాటలు తనకేలా వినిపించినాయ్ అని ఒక్క క్షణం ఆశ్చ ర్యపోయింది జూలి.

కానీ వీరనారి ముందు వైర్‌లెస్ ఉండి ఉండవచ్చనీ, శిరస్త్రాణాల్లో దాని తాలూకు రిసీవర్ ఉండటంవల్లనే, ఆమె మాటలు తనకు స్పష్టంగా వినిపించాయని గ్రహించటానికి అట్టే కాలం పట్టలేదు జూలికి.

వీరనారి టేబుల్‌మీద స్విచ్ నొక్కంగానే, జూలి పాదాల క్రిందినేల కదలుతూన్నట్టు అనిపించింది. ఇలాంటి మోసం ఏదో జరుగుతుందని ముందే ఊహించిన జూలి ఒక్క ఎగురుతో టేబుల్ అంచుని పట్టుకుని వ్రేలాడింది.

మరు క్షణంలో జూలి నిలబడిన చోటు నేలక్రుంగిపోయి క్రింద పెద్ద అగాధం ఏర్పడింది.

ఇదంతా చూస్తున్న కరుణాకర్ తన చేతిలోని పరికరాన్ని వీరనారి మీదకు ప్రసరింపజేశాడు. లేకపోతే ఆమె జూలిని అగాధంలోకి నెట్టేస్తుందేమో అని!

వీరనారి శిలాప్రతిమలా అయిపోయింది. జూలి టేబుల్ మీద స్విచ్‌ని అందుకుని దాన్ని నొక్కింది.

అగాధం మూసుకుపోయి ఎప్పటిలా నేల ఏర్పడింది.

"కరుణాకర్! ఆమె నుంచి కిరణ ప్రసారాన్ని ఆపు చెయ్ ఆమె నుంచి మనకు కొంత సమాచారం కావాలి!" అంది జూలి.

వీరనారికి తెలివి వస్తూనే మరో పన్నాగం వేసింది. ఆమె

కూర్చున్న కుర్చీకి చక్రాలున్నయ్. వాటిని త్రిప్పేసరికి కుర్చీ వేగంగా వెనక్కు జరిగింది. అంతేకాదు ఆ కుర్చీ గది దాటుకుని పోవటానికి వీలుగా, గోడలో మరో ద్వారం తెరుచుకుంది.

జూలి టేబుల్ మీదకు ఎగిరి జుట్టు దొరకబుచ్చుకుంది కానీ ఆ జుట్టు ఊడి చేతికి వచ్చింది. అది కేవలం విగ్గు అని తెలుసుకుని జూలి దాన్ని నేలకేసి విసిరికొట్టింది.

ఈ దఫా రమణి, వీరనారి మీదకు కాంతి కిరణాన్ని ప్రసరింపజేసింది.

సరిగా గుమ్మం దగ్గర చక్రాల కుర్చీ ఆగిపోయింది. వీర నారి మరోసారి గడ్డకట్టుకు పోయింది.

నలుగురు ఆమెను చుట్టు ముట్టారు. కిరణాన్ని ఉపసంహ రించాక వీరనారి ముఖానికున్న మేలి ముసుగుని లాగేసింది. జూలి.

ఆశ్చర్యం! కుర్చీలో కూర్చున్న వ్యక్తి ఆడదికాదు అందరూ అనుకున్నట్టుగా! అతడు పురుషుడు నిక్కచ్చిగా.

"అరె! ఇతడు మన శాఖ వాడే! ఏజెంట్ త్రీ జీరో!" అని అరిచింది రమణి.

జూలి అతడి ముఖంలోకి చూసింది, ఛటర్జీ పేరుతో రమణి ప్రక్కనే ఆపరేషన్ టేబుల్ మీదున్నవ్యక్తి అతడు!

అతడ్ని బంధించారు నలుగురూ కలసి! తమ గూఢచారి శాఖలో వ్యక్తే ఈ ముఠాకు నాయకుడు! స్త్రీగా వీరనారి అనే పేరుతో చెలామణి అయి ప్రభుత్వాన్ని మోసం చేస్తున్న వ్యక్తి తను పనిచేసే గూఢచారి శాఖకే అప్రతిష్ట తెచ్చిన కిరాతకుడు.

శిరస్త్రాణాలు విప్పేసి తమ బంధితుడితో ఆ గదిలోంచి బయటకు వచ్చారు గూఢచారి శాఖలోని వ్యక్తులు, రమణి,

జూలీ, ఛటర్జీ, కరుణాకర్!

అప్పటికి జూలీ వైర్‌లెస్‌లో తమ కేంద్ర కార్యాలయా
తెలియజేసింది 'వీరనారిని' ప్రాణాలతో పట్టుకున్నటుగా.

"ఛటర్జీ పేరు చెప్పి మమ్మల్నెందుకు మోసంచేశావ్
అనడిగింది రమణి, 'త్రీ జీరో' వంక చూస్తూ.

"ఆ ట్రిక్ నేను చెబుతాను విను! మనల్ని నమ్మించటా
ముఠా నాయకురాలు. కాదు, నాయకుడైన త్రీ జీరో, ఛ
ఛటర్జీ అయినట్టుగా, రమణి ప్రక్కన బంధంలో ఇరుక్కు
పడుకున్నాడు. మనం అతడే నిజంగా ఛటర్జీ అనుకుని, అత
మనతో కారులో తీసుకు వెళ్ళాం, ఇక్కడనుంచి తప్పించి.

"డ్రైవింగ్ సీట్లో కూర్చుని, కారుని అటు పోనిచ్చి, ఇ
పోనిచ్చి మనల్ని తిరిగి కోట దగ్గరికే చేర్చాడు! " జూలీ బదు
చెప్పింది త్రీ జీరోకి బదులుగా.

"ఇంతకీ ఇతడి పథకం ఏమిటని? ఈ ముఠానం
ఎందుకు తయారు చేసినట్టు!" కరుణాకర్ అడిగాడు.

ఈ దఫా కూడ జూలీయే సమాధానం చెప్పింది. "మ
ప్రొజెక్టర్‌ని ఆడించినప్పుడు తెరమీద బిల్డింగ్‌లు కనబడిన
గుర్తుందా?"

"అవును!" అన్నారు రమణి, ఛటర్జీ.

"ఆ బ్యాంకులోకి ఇతడి ముఠా జొరబడి , ఈకా
కిరణాల్ని ఉపయోగించి బ్యాంకు ఉద్యోగులందర్నీ శిలాప్రతిమల
చేస్తారు. ఆ తర్వాత లాకర్స్ తెరచి డబ్బూ, బంగారం అ
దోచేస్తారు. ఇలానే ప్రతి పట్టణంలోనూ దోపిడి చేస్తారు.
డబ్బుతో ప్రభుత్వాన్ని కూలద్రోసి, తామే నిరంకుశలుగా మ
లని త్రీ జీరో ఆశయం అయి ఉంటుంది.

"తన అనుచరులకు ప్రతి బ్యాంకు మీాదకూ ఎలాదాడి చేయాలో తర్ఫీదు ఇచ్చేందుకుగాను. బ్యాంకుమోడల్స్ వ్రడంగం వాళ్ళ చేత తయారు చేయించటంలో ప్రధానోద్దేశ్యం!"

"ఎంత కుట్ర!" అని ముక్కు మీాద ప్రేలేసుకుంది రమణి

"అంతేకాదు! ఈ పరికరాల్ని తయారు చేయటంకోసం అణుశక్తికి అవసరమయే యురేనియం అవసరం! ఈ యురే నియం కెనడా దేశం నుంచి మన దేశానికి ఏరీతిగా, ఎంత రహస్యంగా చేరవేయ బడుతుందో, మన కేంద్ర కార్యాలయం ఫైళ్ళలో మాత్రమే తెలియజేయబడి ఉంది.ఆ రహస్యాన్ని దొరక బుచ్చుకుని, మనతోటి ఉద్యోగి అని చెప్పుకోవడానికే సిగ్గ చేటు అయిన ఈ శ్రీ జీరో యురేనియం కాజేయటం మొద లెట్టాడు. దాంతోనే ఈ కిరణ యంత్రాల్ని తయారు చేయిస్తున్నాడు."

"ఈ ఎడారిలో రహస్య స్థావరం ఏర్పరచుకుని తన పథకాన్ని అమలుతో పెట్టాలని చూశాడు. కానీ ఎవడు తీసిన . గోతిలో వాడే పడతా డన్నట్టుగా, తను తయారు చేయించిన కిరణానికి తనే బందీ అయిపోయాడు." జూలీ ముగించింది.

అంతలో ఆకాశంలో హెలికాప్టర్ల మ్రోత వినిపించింది అందరి ముఖాల్లో సంతోషం వెలిగింది.

—: ఐపోయింది :—

# ప్రేతం ప్రేమ

## ఏ. వీ. మోహన్రావ్

"శాంతా! మనింటికి వచ్చేశాం! లే! లే!!" భుజంపైన తడుతూ వారు పెద్దగా అరవడం గమనించాను.

కళ్ళు నులుముకుని తెరచి చూశాను. నల్లని చిక్కటి చీకటి రాక్షసిబొగ్గు రాసులు పేర్చినట్లుంది. పదడుగుల ఎత్తున్న పాత కాంపౌండ్‌గోడ మసకగా కనుపించింది. ఇల్లుమాత్రం కనుపించ లేదు. దిగాను. లోపల్నుండి లాంతరుతో పనివాడు వచ్చాడు. వాడు, నేను, మావారు, డ్రైవరూ, కలసి కార్లో తెచ్చిన సామా నంతా దించి ఇంట్లోకిచేర్చాం.

దాన్ని ఇల్లు అని అనేందుకు నాకు నోరాడడంలేదు. పాడు పడ్డ కోటలాగుంది. చుట్టూవున్న గదుల గోడలు విరిగి పడి

వున్నాయి. మధ్యనున్న ఐదారు గదులు ఒకమోస్తరుగా వున్నాయి. కరెంటులేదు. లాంతర్లు మాత్రం వెలుగుతున్నాయి.

"ఎలావుంది మనఇల్లు?" అడిగారు వారు.

"ఇదిఇల్లా! దెయ్యాల మఠంలా వుంటేను." అన్నాను. బిక్కచచ్చిపోతూ భయంతో.

"ఛా! అవేంమాటలు, ఈ మధ్య దీన్ని ఎవ్వరూ ఉపయోగించనందువల్ల ఇలా వుండిపోయింది. మనంమకాంపెట్టాంకదూ వారం రోజులకెలా కల కల లాడుతుందో నువ్వే చూస్తావు." అన్నారు.

ఈ ఇంటి నివాసం నాకు క్రొత్తసమస్యల్ని, వింతభయాల్ని తెచ్చి పెడుతుందన్న ఊహగానమేదో నా మెదడు చెయ్యడం ప్రారంభించింది.

సామాన్లనన్నీ అక్కడపడేసి, పడకకోసం తయారు చేసిన గదిలోకి చేరాం, దాని కిటికీ తలుపులు తీసివున్నాయి. వెనక పెద్ద పెద్ద చెట్లు తలలు విరబోసుకొని నృత్యం చేస్తున్న దయ్యాల్లా వున్నాయి. కాలువ నానుకునే ఇల్లు తగలడడంతో లాకుల పైనుంచి క్రిందికి దూకే నీళ్ళు కూడా విపరీతంగా శబ్దంచెయ్య సాగాయి.

"ప్రయాణంతో అలసిపోయివుంటావ్! హాయిగా పడుకొని నిద్రపో!" అన్నారు వారు మంచమెక్కుతూ.

"భయంగా వుందండి!" ఆగలేక అన్నాను.

"ఎందుకు?"

తెలీడంలేదు! చుట్టూ దయ్యాలేవో తిరుగుతున్నట్లున్నాయి." అన్నాను వార్ని ఘట్టిగా వాటేసుకొని.

"పిచ్చిదానా! నువ్వు కాస్త పిరికిదానిలాగున్నావ్. నేను మేలుకునేవుండి నిన్ను నిద్రపుచ్చుతాను" అన్నారు.

నాకు తెలీకుండా వార్ని పట్టుకుని పోతాయేమో మానంవేసింది.

అందుకే "నేనూ మేలుకుంటాను." చెప్పాను.

ఆయనకుకాస్త చిరాకుగా, కోపంగా, అసహనంగా, తోచింది, నామాటలు, చేతలు ఆయన్ని మరీ వి బాగుండదని దిండు పైన వాలాను. కళ్ళు మూసుకున

తెల్లవారింది. నిద్రలేచాను. వారుకనిపించలేదు. దిగి హాల్లోకివచ్చాను. అక్కడ కూర్చుని సిగరేట్ కాలుస

"రా! కూర్చో! బాగానిద్రపట్టిందా?" అడిగారు

"ఊఁ!" అంటూ తలూపాను.

"దయ్యాలేమన్నా కనిపించాయా?"

"లేదు!"

"రాతంత్రా భయంగావుందని నా ప్రాణాలుతో ఇప్పుడయినా తెలిసిందా ఇక్కడ దయ్యాలు లేవని. నాక ఆనందంగావుంది." అన్నారువారు. ఆ తర్వాత, బట్టల కుని లాకులవద్దకు వెళ్ళిపోయారు.

పగలంతా ఊళ్ళోనుంచి ఎవరెవరో వచ్చారు. చూచారు. మాట్లాడించారు. వెళ్ళిపోయారు. సా కాబోతూండగా కాబోలు, నలభై సంవత్సరాల పై విధవరాలు వచ్చింది, నన్ను చూసేందుకు.

"అబ్బాయిలేడా?" అడిగింది ఆమె.

"లేరండి!" అన్నాను.

"పోనీలే! నేను నిన్ను చూడాలని వచ్చాను. రాత్రినచ కొత్తగా కాపురానికి వచ్చావు. ఈ దయ్యాల కొంపలో పెట్టావేమమ్మా? ఇక్కడికి ఊరు మైలుంది. కాడు దగ్గరేవుంది. అబ్బాయేమో పనులంటూ రాత్రుళ్ళు

సరిగ్గా ఇంటిపట్టున వుండడు. ఒక్కదానివి బిక్కు బిక్కుమని ఎలావుంటావమ్మా!'' అడిగిందామె కూర్చుంటూ.

"మీరెవరమ్మా!'' అడిగాను అర్థంగాక.

"నా పేరు పూటకూళ్ళపేరమ్మ! నిన్నటిదాకా అబ్బాయి నాతోనేవున్నాడు. తిండీ తిప్పలు నేను చూశాను.'' అందావిడ కాస్త గర్వంగా.

"మరి మీరే చెప్పలేక పోయారా?''

"చెప్పాను. చెవినిల్లుగట్టుకొని మరీ పోరాడాను. మొండి ఘటం, దయ్యాలు గియ్యాలు లేవంటాడు. కానీ ఇక్కడమాత్రం దయ్యంఉంది. ఊళ్ళోవాళ్ళు చాలా మంది దాన్ని కళ్ళారా చూశారు.

"ఆ దయ్యం ఎవరిదో తెలుసాండీ!'' అడిగాను

"ఏమోనమ్మా! నాకేం తెలుసు? నేను చూచానాపెట్టానా? ఊళ్ళో అందరూ అనుకుంటూ వుంటే చెప్పాను, అయినా మీ ఆయన పట్టుదల కాకపోతే ఊళ్ళో ఇళ్ళు కరువయినాయా?.'' దీర్ఘంతీసింది పేరమ్మ.

"ఇక్కడయితే వారిఉద్యోగానికి అనుకూలంగా వుంటుందని ఏర్పాటు చేశారులాగుంది.'' అన్నాను.

ఎందుకయినా తోడుగా ఎవర్నన్నా పెట్టుకో, అబ్బాయి రాత్రనక పగలనక తిరుగుతూంటాడు. నీకు ధైర్యంగా ఉంటుంది. ఓపికలేకుండా వున్నపుడు నాదగ్గరకు మనిషినిపంపు. కారియలో పెట్టిపంపుతాను భోజనం!'' అంది పేరమ్మ.

"అలాగేనమ్మా!'' అన్నాను.

ఆ తర్వాత ఆమెవెళ్ళి పోయింది.

పన్నెండేళ్ళ కుర్రాడొకడు వచ్చి దూరంగా నిలబడ్డాడు ముందు.

"ఎవరుబాబూ నువ్వు!" అడిగాను.

"అయ్యగారు పంపారు." చెప్పాడు చేతులు కట
నేలచూపులు చూస్తూ.

"ఎందుకు?"

"ఇక్కడ మీకు సాయంగా వుండేందుకు. చెయ్య
పనల్లా చెయ్యడానికి." అన్నాడు.

"అలాగే! నీపేరేంటి?"

"సత్తెప్ప!"

"బాగుంది.,, అంటూ వాడికి చెయ్యవలసిన పనుల
చిన్నవి పురమాయించి లోనికి వెళ్ళాను.

ఈ ఇంట్లో ఇంతకుముందు ఎవరువున్నారో కానీ
చాలా ఛండాలంగా తయారుచేశారు. తెల్లటి గోడల
మరకలు, సిగరెట్లు ఆర్పిన నల్లని గుర్తులు, తాంబూ
నమిలి ఉమ్మినట్లుగా ఎర్రటి గుర్తులు కనుపించాయి.
తెల్లసున్నం తెప్పించి వెల్ల వేయించాలని తీర్మానించు కొ

ఇల్లంతా మొత్తం ఆరుగదులు క్రింద మూడు
పైగదులకు తలుపులులేవు. సాలెగూళ్ళు పట్టివున్నాయి.
పోయిన కర్రసామాను, వాడిపారేసిన సీసాలు, పాత డ
మొదలైన చెత్తంతా పైనేవుంది. క్రింద భాగంలో
మూడు గదులే శుభ్రంగా వున్నాయి. మిగిలినవి అస
వున్నాయి.

దయ్యాలగురించి పేరమ్మ చెప్పిన, కబుర్లు గుర్తొ
ఏదైనా ఇల్లుపాతబడితే అందరూ దయ్యాల కొంపని అన
ఊళ్లో కూడా విన్నాను. అలాగే ఈ యింటి గురించి ప
చేస్తున్నారేమోనని పించింది. ముందు రోజు రాత్రి
భయపడ్డాను. ఇప్పుడు కాస్త ధైర్యం పెరిగింది.

ఇంకొంత ధైర్యంగా వుండగలనన్న ఆశకలిగింది.

అప్పచెప్పినపని పూర్తిచేసివచ్చిఎదురుగా నిల్చున్నాడుసత్తెప్ప, మరోపని చెప్పమన్నట్లు.

"సత్తెప్పా?" పిలిచాను.

కళ్ళు పెద్దవి చేసుకొని "అమ్మా" అంటూ పలికాడు.

"నీదీవూరేనా?" అడిగాను.

"అవును, ఆలాకుల దగ్గర కాపలాకాసే కామయ్య మా అయ్య. అయ్యగారు మనిషికావాలంటే మా అయ్యే చెప్పాడు, వెళ్ళి అమ్మగారికి తోడుండమని." అన్నాడు వాడు.

ఈ ప్రాంతలవాడు కాబట్టి ఈపాడుబడ్డ దయ్యాలకొంప గురించి వివరాలు వాడి ద్వారా రాబట్టవచ్చు ననుకున్నాను.

"చిన్నప్పట్నుంచి ఇక్కడే వున్నావా?" అడిగాను.

ఉన్నానన్నట్లు తలూపాడు.

"ఈ ఇంట్లో ఇంతకు ముందు ఎవరుండేవారు?"

"ఎవరూలేరమ్మా! పోయిన ఏడు ఎవరో కార్లోవచ్చారు. మా అయ్యను అడిగినారు నాల్రోజులు వుంటామని, అయ్య చెప్పాడు ఇల్లు తనదికాదని. తాళాలు మాత్రం వున్నాయి. దాని యజమాని దేశంలో లేడని మా అయ్య చెపుతుంటే విన్నాను. వాళ్ళు వందరూపాయ లిస్తామనిచెప్పి, తాళాలు తీసుకొని వెళ్ళి పోయారు. నాల్రోజులున్నారు. వాళ్ళకు ఊళ్ళోనుండి కారేజీలో అన్నం నేనే తెచ్చిపెట్టాను. సీసాలు పెట్టుకుని తాగుతూ వుండేవాళ్ళు. పాడువాసన కొట్టేది. ముక్కు మూసుకొని వచ్చే వాణ్ణి!" అన్నాడు సత్తెప్ప!

"వాళ్ళు ఎన్నిరోజులున్నారో తెలుసా?"

వారంరోజులున్నారు. తర్వాత వెళ్ళిపోయారు. ముందామె వెళ్ళిపోయింది. ఆ తర్వాత ఆయన వెళ్ళాడు నాకు పది రూపా

యలు ఇచ్చి వెళ్ళాడు.''

అలాగా!'' అన్నాను. కలసి వచ్చిన వాళ్ళు విడివిడిగా ఒకరు ముందూ మరొకరు వెనుక ఎందుకు వెళ్ళవలసి వచ్చిందో అర్థం గాలేదు. ఏదైనా ప్రణయకలహం వచ్చిందేమో ననుకున్నాను.

''ఆమె వెళ్ళేప్పుడు నీకు ఎంతిచ్చింది.?''

''నేను చూడలేదు ఆమెపోవడం! చూసివుంటే వసూలు చేసేవాణ్ణి!'' అన్నాడు సత్తెప్ప.

''బోజనం ఎక్కడ తెచ్చేవాడివి?''

''పేరమ్మ దగ్గర,''

''వాళ్ళదేవూరో తెలుసా?,, అడిగాను.

తెలీదమ్మా! మాటకు ముందు బెజవాడ పోతేగాని దొరకవు. అంటూ వుండేవాడు ఆయన.''

''వాళ్ళపేర్లు తెలుసా?.,

''తెలీదమ్మా! ఇంగ్లీషులో పిల్చుకునేవారు. కానీ ఒకటి మాత్రం నిజం. వాళ్ళు మొగుడూ పెళ్ళాలు మాత్రంకాదు. లేచొచ్చిన రకం,'' ఘుంటా పథంగా చెప్పాడు.

అంతచిన్న వెధవకు కూడా మొగుడూ పెళ్ళాలెలావుండాలో వుంటారో తెలిసినందుకు ఆశ్చర్య మేసింది.

మావారు రాత్రి ఎనిమిదింటికి వచ్చారు. వారికేసి వీధిలోకి చూస్తూ గుమ్మం పైన నిలుచున్నాను.

ఇద్దరం బోజనాలు చేశాం.

ఎవరెవరు వచ్చిందీ ఏంచెప్పిందీ అంతా ఏకరువు పెట్టాను వారికి పేరమ్మ పేరు కూడా చెప్పాను.

''ఆముండకు రెండో పనిలేదు. పనిగట్టుకొని వచ్చి పాడు కబుర్లు చెపుతుంటుంది. ఈసారివస్తే గుమ్మంలోంచే తరిమెయ్'' అన్నారు.

వారు లేచిబట్టలు తొడుక్కోవడం ప్రారంభించారు. గమనించాను.

"శాంతా! రాత్రికి బహుశా నేను రాలేను కాలవకు నీళ్ళు వదలాలి ధైర్యంగా వుండు." అన్నారు.

"నాకు భయంగా వుందండీ! వెళ్ళి త్వరగారాకూడదూ?" అడిగాను దీనంగా

"వీలైతే వస్తాను. నిద్రపట్టిందాకా కాస్త గుబులుగా వుంటుంది. ఆ తర్వాత అంతా సర్దుకుంటుంది. తెల్లారేలోగా నేనెటూ వచ్చేస్తాగా? తలుపులు ఘట్టిగా గడియ పెట్టుకొని పడుకో!" అంటూ కదిలారు.

ఏంచెప్పినా వారు ఆగరని అర్థమయ్యాక నోరుమూసుకుని చూస్తూ నిలుచున్నాను. ఆ తర్వాత వార్నిసాగనంపి లోనికొచ్చి తలుపులు బిడాయించుకుని మంచంపైన పడుకున్నాను.

పాతనవలేదో వుంటే చదువుతూండి పోయాను. అందులోనూ దయ్యాల కథలేవున్నాయి. దూరంగా విసిరేశాను. గంట పదకొండయింది. నిద్రరావటంలేదు. బలవంతంగా కళ్ళు మూసుకున్నాను.

ఏదోడబ్బాలు దొర్లిపడ్డ శబ్దమయింది. లేచి కూర్చున్నాను. వాటిని తన్నుకుంటూ బలంగా పడుతున్న కాలిఅడుగుల శబ్దం వినవచ్చింది. అల్మైరాలు తెరిచినట్లు, పెట్టెలు కదిలించినట్లు టేబుల్ డ్రాయర్లు లాగిమూసినట్లు శబ్దాలువిన్పిస్తున్నాయి. దొంగెవరన్నా లోనికి వచ్చాడేమోననిపించింది. తలుపు తీసుకుని వెళ్ళిచూద్దామనుకున్నాను. ధైర్యం చాలలేదు, సత్తెప్పను పిలుద్దామనుకున్నాను. నోరురాలేదు.

వారువుండి వుంటే బాగుండేదనిపించింది. ఆ అల్లరి చేస్తున్నది ఏదో ప్రేతమే అయివుంటుందనిపించింది. ఇలాటి

కొంపలో, ఎన్నోరోజులు సజీవుగా కాపరం చెయ్యగలననిపించడం లేదు, ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని, ఆంజనేయ దండకం చదువుకొంటూ, కూర్చున్నాను.

మళ్ళీ ఎవరో కదలిన శబ్దమైంది.

తలుపులు మూసి వుంచానుగాబట్టి దొంగయితే లోనికి రావడం అసాధ్యం దయ్యమయితే తలుపుల్తో పనేలేదు. ఆగదిలో పనిముగించుకొని నా గదికి వస్తుందేమోనని గోడకానుకుని. చీకటిని చీల్చిచూస్తున్నాను.

తలుపులోంచి, పల్చటి తెల్లబట్టల్లోవున్న అందమైన స్త్రీ ఆకారం లోనికి రావడం కనుపించింది. తలంతా విరబోసుకొని వుంది. పొడవాటి నల్లటి వెంట్రుకలు, భుజాలపైగా ముందుకు పడి ఛాతీ భాగాన్ని కప్పి వేస్తున్నాయి. కళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి.

నాకళ్ళు మెల్లగా ఆదయ్యం కాళ్ళకేసి తిరిగాయి. పాదాలు ముందుకున్నాయోలేదో చూచేందుకు. చీరకుచ్చెళ్ళు పూర్తిగా కప్పివేసివున్నాయి పాదాల్ని. నాకేం కనుపించలేదు.

నాకు గుండెపోటు ఎక్కువయింది. శరీరం చెమటలుపట్టు కొచ్చింది. ఏడుపు తెలీకుండానే వచ్చింది.

అరచేతుల్తో కళ్ళురెండూ ఘట్టిగా మూసుకుని భోరుమని ఏడ్చాను. అంతే తెలుసునాకు. ఆదయ్యం ఏమయిందీ తర్వాత తేలీదు.

మళ్ళీ కళ్ళు తెరిచేసరికి నాతల మావారి తొడలపైవుంది.

"ఎలావుంది శాంతా?" అడిగారు ఆప్యాయంగా.

"మీరు చెప్పాలి! నేనుబ్రతికున్నానా"

ఛీ! అవేంమాటలు, లక్షణంగా వున్నావ్!"

"ఇలానన్ను ఆదయ్యం ఎన్నోరోజులు వుండనివ్వదు. మీరు

లేకుండా వుండటం గమనించి వచ్చిపైనబడి పీక్కుతిని తీరు తుంది'' అన్నాను లేచికూర్చుంటూ.

ఆయన మాట్లాడకుండా నాకు సపర్యలు చేయసాగారు.

ఆయన పెట్టి తెచ్చిన వేడివేడి కాఫీ ఇద్దరం సేవించాము.

తెల్లవారిందాకా జాగారం చేశాం మేలుకునే.

రాత్రి నిద్రసరిగా లేక పోవడంతో కాస్త ఆలస్యంగాలేచాను ఇంట్లోవారు కనిపించలేదు. వంటగదిలోకి వెళ్ళిచూశాను. ఫ్లాస్కులో కాఫీ పోసివుంచారు కాలకృత్యాలు తీర్చుకొని కాఫీ త్రాగాను.

సత్తెప్ప హాజరుగా వచ్చినిలుచున్నాడు.

డబ్బులిచ్చి, ఊళ్ళోకెళ్ళి కూరగాయలు తెమ్మనాను. సంచీ తీసుకుని వాడు వెళ్ళిపోయాడు.

నేను వంటింట్లో పనిచేసుకుంటూవుండి పోయాను.

బయట జీపు ఆగిన శబ్దమైంది.

ఇంజనీరుగారొచ్చారేమోననుకుంటూ ముందు గదిలోకి వచ్చాను.

మావారుముందూ, వారివెనుక బుర్రమీసాలు త్రిప్పుకుంటూ లావుపాటి పొట్ట ఊపుకుంటూ వస్తున్న పోలీసు ఇన్‌స్పెక్టర్ కనుపించాడు.

''శాంతా! కాఫీ తీసుకురా!'' అరచారుమావారు.

గబగబ కాఫీ కలిపి రెండుకప్పులు పోసుకుని వచ్చాను గదిలోకి.

''నా భార్యశాంత!'' అంటూనన్ను పరిచయం చేశారు. నమస్కరించాను.

''ఇన్‌స్పెక్టర్‌రాయుడుగారు?'' అన్నారు మావారు వార్ని చూపించి.

"కూర్చోవమ్మా!" అన్నాడాయన.

"నేను కూర్చున్నాను."

మిస్టర్ సుధాకరం! బెజవాడలో పేరు పడ్డ కంట్రాక్టరు కనకయ్య గారమ్మాయి కమల సంవత్సరం క్రితం అంతర్ధానమైంది. ఆమె ఆచూకీకోసం ఇన్నాళ్ళు ప్రయత్నించాం. దొరకలేదు. ఆమెను వాళ్ళ యింటికెదురుగా వుండే సుబ్బారావనే జులాయి వెధవ లేవదీసుకుపోయి వుండొచ్చన్న అనుమానంతో అతన్ని అరెస్టుచేశాం. తనకేమీ తెలీదంటూ మొత్తుకున్నాడు. ఆమె ఫోటోలు పేపర్లోవేశాం. ఎవ్వరూ ఆచూకీ చెప్పలేకపోయారు. అంటూ ఆగాడు రాయుడు.

"అయితే నాకెందుకు చెప్తున్నారీ గొడవ?" అడిగారు మావారు.

"ఆమెలాంటి మనిషి మందపాటి కొచ్చినట్లు, కొన్నాళ్ళు ఈ బంగళాలోనే మరొక మగాడితో వున్నట్లు రెండు నెలల క్రితం ఆచూకీ వచ్చింది. దాని నిజానిజాలు కనుక్కుందామని వచ్చాను.,, అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేనా! నాభార్య ఇక్కడికొచ్చి రెండ్రోజులయింది. ఈ ఇంటితాళాలు నాదగ్గర పనిచేసే కామయ్యదగ్గరుంటాయి. వాడే నన్నిక్కడ వుండమన్నాడు. మీరుకావాలంటే ఇల్లంతా సొదా చేసుకోండి!" అన్నారువారు.

"థాంక్స్!" అంటూ లేచిలోనికి వెళ్ళారు. నేను అక్కడే వుండిపోయాను. మావారు మాత్రం వెంటవెళ్ళారు. గంట తర్వాత తిరిగి గదిలోకి వచ్చారు.

"సుధాకరంగారూ! ఈ ఇంట్లో ఏదైనా హత్యజరిగి వుంటుందని మీ కనిపించిందా?" అడిగాడు రాయుడు.

నాకు దయ్యంగురించి చెప్పాలనిపించింది. నోరునొక్కు

కున్నాను. పోలీసులతో ఎందుకైనా కాస్త జాగ్రత్తగా వుండడం అవసరమని.

"ఆ అని నాకేం అనిపించలేదండీ!" అన్నారువారు.

"వస్తాను, మీ సర్వెంట్ కామయ్యను కలుసుకోవాలి! కాస్త వెంటరండి!" అంటూవార్ని వెంటబెట్టుకొని వెళ్ళిపోయారు. మావారిరాకకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను.

సత్తెప్ప కూరలు తెచ్చాడు. అన్నితీసి లోపల పెట్టుకొని మళ్ళీవచ్చి కూర్చున్నాను. సత్తెప్ప నిలుచునే వున్నాడు.

"పోలీసులొచ్చార్రా!" అన్నాను

"ఎందుకమ్మగారూ!" అడిగాడు వాడు.

"ఎవరో అమ్మాయి కనపడలేదట. ఆమె ఇటువేపువచ్చిం దేమోనని వాకబు చేస్తున్నారు. ఆమె ఫోటో కూడా తెచ్చారు. మీ నాన్నదగ్గరకు వెళ్ళారు." అన్నాను

వాడు ఏంమాట్లాడలేదు.

"ఇంతకుముందిక్కడ దిగారనిచెప్పావే, వాళ్ళలోని అమ్మాయి ఫోటోచూస్తే మళ్ళీగుర్తు పట్టగలవా?" అడిగాను.

"ఒక్కదెబ్బకు గుర్తుపడతాను. ఆమె కళ్ళు, ముక్కు, మెడ నవ్వు, మొత్తం గుర్తేనమ్మగారూ!" అన్నాడు హుషారుగా

అంతలోనే మావారు రావడం చూశాను.

"కామయ్య కలిశాడా?" అడిగాను ఆతృతగా,

"కలిశాడు! ఫోటోచూపించాం?" అందులోని అమ్మాయిని వాడు చూడలేదన్నాడు. ఊరంతా ఆ ఫోటో చూపించాడట రాయుడుగారు. ఎవ్వరూ చూడలేదన్నారట. కానీ ఆ ఫోటోలో వాళ్ళిద్దరూ రైలుదిగగా చూశానని స్టేషనుమాస్టరు చెప్పాడట.

అంతా అయోమయంగావుంది.'' అన్నారు.

నాకావిషయంలో ఉత్సహించచ్చి పోయింది.

''సరే రండి!'' లోనికి అన్నాను.

సత్తెప్పకు ఆరుబైట చెట్లక్రింద పడిన చెత్తంతా చిమ్మ మని పురమాయించాను.

అర్థరాత్రి 'ధన్'మని శబ్దమైంది. భయంగా లేచికూర్చు న్నాను. మా వారుగుర్రుపెట్టి నిద్రపోతున్నారు. తట్టిలేపాను, లేచిఏమిటని అడిగారు.

''జాగ్రత్తగా వినండి ఎదో పడ్డట్టు ధన్‌మని శబ్దమయింది ఆ దయ్యం రాత్రికూడా ఇదే టయిమ్‌కు వచ్చింది. అక్కడేదో వెతుకుతుంది. ఆ తర్వాత ఇక్కడికొస్తుంది.'' అన్నాను రహ స్యంగా వారిచెవిలో నోరుపెట్టి.

''నీ మొహం! ఉండు వెళ్ళిచూసొస్తాను.'' అంటూ మంచం దిగారు.

వద్దంటూవెళ్ళి కాళ్ళకు అడ్డంపడ్డాను. ఆయనకు వెళ్ళి చూసిరావాలనివుంది. నేను మాత్రం ససేమిరా వీలులేదన్నాను. విసుగ్గా వచ్చి మంచంపైన కూర్చున్నారు.

నేను మాత్రం వార్ని అనుకుని కూర్చుని గుమ్మం కేసి చూడసాగాను ముందురోజు రాత్రిలాగే నా గదిలోకి దయ్యం వచ్చింది. తెల్లటి బట్టలు కట్టుకొంది, జుట్టు విరబోసుకుంది కళ్ళు జ్యోతుల్లా వెలుగుతున్నాయి.

''ఏమండీ! వచ్చింది.'' అన్నాను మెల్లగా దయ్యంపైన దృష్టినిలిపి.

''ఏమిటి?'' అడిగారు వారు ఎప్పటిలాగే విసుగ్గా.

''దయ్యమండీ! అదిగో చూడండి!'' అంటూ గుమ్మంకేసి చూపించాను.

వారు మంచంమీద ముందుకు జరిగి చూశారు.

"నీమొహం! ఈ గదిలో చీకటితప్ప మరేం కనుపించడం లేదు. దయ్యం గదిలోకాదు నీ మదిలో వున్నట్లుంది. అర్థంలేని భయాల్తో నా నిద్రపాడుచేశావ్!" అన్నారు కోపంగా

వారా మాటలంటూన్నప్పుడు నా కళ్ళముందు దయ్యం నిలుచునేవుంది. ఆమె ముఖంకేసి నిశితంగా చూశాను. అందులో ఏవిధమైన భావంలేదు. శూన్యంగావుంది చూపులు మాత్రం నన్ను శల్యపరీక్ష చేస్తున్నట్లున్నాయి. కనురెప్పలు మనకులా మూతపడటంలేదు. అంతకుముందుదాకా కలిగినభయంస్థానంలో ఒకవిధమైన ధైర్యం చోటు చేసుకుంది.

మావారు విసుగెత్తి అటుతిరిగి పడుకున్నారు.

నేను మంచందిగాను. దయ్యందగ్గరకు వెళ్దామని అడుగు వేశాను .ఆ దయ్యం అడుగు వెనక్కివేసి తలుపునానుకొని నిలుచుంది.

"ఎందుకు ఇలా వెంటబడి వేధిస్తున్నావ్? నీకేంకావాలి?" అడిగాను.

ఆమె ముఖంలో విషాదఛ్ఛాయలు అలము కోవటం గమనించాను. కళ్ళు ఆర్ద్రమయినాయి. ముక్కుపుటాలు లావెక్కాయి. ఆ దయ్యం పెద్దగానవ్వి వెనక్కి వెళ్ళిపోయింది. నేను వెంటాడబోయి ధామ్మని తలుపులకేసి తలకొట్టుకొన్నాను దిమ్మ తిరగటంతో! "అమ్మా" అని గావుకేక పెట్టాను' ఆ అరుపుకు లేచివారు నా దగ్గరకొచ్చి నిలబడ్డారు.

"ఏమయింది? ఆ దయ్యం కొట్టిందా?" అడిగారు.

"లేదు! నేను చూడకుండా తలుపుకేసి తలమోదుకున్నాను,,

"ఏం పిచ్చిపటిందా?,,

"కాదండీ! దయ్యం ఎందుకో కన్నీళ్ళు పెట్టుకుంది.

ఓదారుద్దామని వెళ్ళబోయాను. అంతే! తలుపు తెరిగింది."
చెప్పాను.

"దయ్యాలంటే! భయపడే నువ్వు వాటికళ్ళు తుడుద్దామని బయలుదేరావా? పరవాలేదు. ఇకనేమ రాత్రిళ్ళు ఇంట్లోపడుకో కున్నా నీకేంభయముండదు.,, అన్నారు వ్యంగ్యంగా మావారు.

నేనేం జవాబు చెప్పకుండా వచ్చి మంచంపైన వాలాను.

మళ్ళీఇద్దరం పడుకున్నాం.

ఆ దయ్యం ఈ ఇంటిని వదలకుండా ఎందుకిలా తిరుగు తుందాని ఊహించసాగాను. ఏదైనా ఇష్టమైనవస్తువుండి దాన్ని ఎవరూ కాజేయ్యకుండా కాపలా కాచుకుంటూ వుందేమోనని పించింది. పైగదుల్లో రాత్రిళ్ళు ఎందుకు శబ్దాలవుతున్నాయో తెలుసుకునేందుకు తెల్లవారాక ఓమారు వస్తువులన్ని కదిలించి చూడాలని పించింది. ఆయన్ను అనుకుని పైనచెయ్యి వేసు కుని, పడుకుని కళ్ళుమూసుకున్నాను. నాకు తెలీకుండానే నిద్ర పట్టింది.

తెల్లవారిందాకా నాకు ఏవిధమైన అవరోధం కలగలేదు. హాయిగా నిద్రపోయను.

"బాబయ్యా !" అంటూ వచ్చాడు కామయ్య ప్రొద్దున్నే.

మా వారులేచి వెలుపలికి వెళ్ళి నిలబడ్డారు.

"ఘోరం జరిగింది బాబు!" అన్నాడు.

"ఏమిట్రా? ఏమయింది?"

"మా బుడ్డోడిని ఎవరో కాళ్ళు చేతులు కట్టి గడ్డివాములో వేసి తగలెట్టారు దొరా! లేక లేక పుట్టినబిడ్డ, మగబిడ్డ!" గుండెలుపగిలేలా ఆర్తనాదం చేశాడు.

నా కడుపు తరుక్కు పోయింది.

సత్తెప్ప పని చేసింది రెండుదినాలే అయినా నాకు చాలా ఆత్మ

యుణ్ణి పోగొట్టు కున్నట్లుంది.

"ఎక్కడ జరిగిందిది, పోలీసులకు కబురు చేశావా?" అడిగాను.

"లేదుతల్లీ లేదు! తిన్నగా ఇక్కడికే వచ్చాను." అన్నాడు కామయ్య.

"ఏమండీ! అతనుబాగా కృంగిపోయి వున్నాడు. మీరు వెళ్ళి పోలీసుల్ని పిలుచుకుని రాగూడదూ—"అడిగాను.

మారు మాట్లాడకుండా వెళ్ళి పోయారు.

కామయ్యను మాటలతోనే ఊరడించాను.

అరగంటలో మావారు రాయుడిగార్ని వెంటబెట్టు కొచ్చారు.

కామయ్య జరిగిందంతా రాయుడికి చెప్పాడు. వినిచూస్తు పోయాడు. అంతకు ముందురోజా తను ఫోటో చూపించడం, అమెను తను చూచానని చెప్పడం, గుర్తొచ్చింది.

ఆ పసిబాలుడి హత్యకూ, కమల అంతర్ధానానికీ, కారకుడొకడే అయివుండాలని పించింది రాయుడికి కమలను గుర్తుపట్టిన మిగిలిన వాళ్ళకు్కూడా కనువిప్పు కలిగించేందుకే అలా ఆపసివాణ్ణి దారుణంగా హత్య చేసివుండాలని పించింది.

ముగ్గురూ జీప్ఎక్కారు. కామయ్య దారి చూవుతూంటే రాయుడు డ్రైవింగ్ చేసుకుంటూ పోయాడు.

లాకులకు అరమైలు క్రింద మందపాటి పొలమేరల్లో వున్న గడ్డికువ్వలో నల్లటి నుసి కనుపించింది. మధ్యగా పరుశు ప్రీతి కాబడిన ఎముకలు మాత్రం మిగిలిన సత్తెప్ప కాయందర్శన మిచ్చింది.

"అసలేం జరిగింది! రాత్రి మీవాడు ఇంటికి రాలేదా?"

"లేదుబాబు! అమ్మగారు వచ్చింది. మొదలు అక్కడి కెళ్ళి వడుకుంటున్నాడు. అటువంటిది ఇంతాదాకా

ఎందుకు వచ్చారు ఏం జరిగిందో అర్థం కావటంలేదు!'' కామయ్య అన్నాడు.

''సుధాకరంగారూ వాణ్ణి మీారు చూశారా?'' అడిగాడు రాయుడు.

''బయట వరండాలో పడుకోమని దుప్పటిఇచ్చి, నేను లోనికొచ్చి పడుకున్నాను. ఆతర్వాత కామయ్య అరుపులకే నిద్రలేచాను. అంతాకన్నా నాకింకేం తెలీదండి!'' చెప్పాడు సుధకరం!

అందరూ తిరగి ఇంటికి వచ్చారు.

రాయుడుగారు నన్నడిగారు సత్తెప్పగురించి.

నాకేం తెలీదని చెప్పాను. నిజంగా నాకేం తెలీదు కాబట్టి.

''రాత్రి ఇక్కడే పడుకున్నాడని చెప్పారు. ఎవరయినావచ్చి సత్తెప్పను తీసుకోని పోయివుండాలి. మీాకే విధమైన శబ్దం వినరాలేదా?'' అడిగాడు రాయుడు.

లేదంటూ అడ్డంగా తలూపాం.

''ఎందు కయినా మంచిది. మీారు తగిన జాగ్రత్తలో ఉండండి! సతెప్పను అతిదారుణంగా ఎవరు చంపిందీ వాకబు చేసి ఉరికంభమెక్కిస్తాను త్వరలోనే!'' అంటూ రాయుడు గారు బయలు దేరివెళ్ళి పోయారు.

''ఏమండీ!'' పిలిచాను వార్ని.

ఏమిటన్నట్లు చూశారు.

''మనఇంట్లో రోజూ తిరుగుతున్న దయ్యం గురించి చెప్తే బాగుండేదేమో ననిపిస్తుందండీ రాయుడిగారికి, దీంతో పాటు దాని అంతుకూడా తేల్చు కుంటారువారు'' అన్నాను.

''వాళ్ళు పోలీసులు. మంత్ర గాళ్ళుకాదు. పైగా ఆదయ్యే నేదో నీకు కనుపిస్తుంది తప్ప, నా జోలికి రావడంలేదు. ఆడ

పోలీస్తు వస్తే తప్ప కనుపించదేమో?'' అన్నారు నవ్వుతూ.

ఆ విషయం చెప్పి లాభం లేదని అంతటితో మాను కున్నాను. వారు లాకుల దగ్గరకు వెళ్ళి పోయాక నేనేం చెయ్య వలసిందీ ముందుగానే నిర్ణయించుకున్నాను.

ఇంటిపని మొదలెట్టాను.

నా ఆలోచనలు రకరకలుగా పోతున్నాయి.

సత్తెప్ప దారుణమరణకాండ నన్ను కుదిపి వేసింది.

ఆ కమలెవరోగానీ, పోలీసువాళ్ళని నానాతిప్పలు పెడుతూంది.

ఆమె, ఈ దయ్యాల కొంపలో ఎవరితోనో లేచొచ్చి, ఎలావుండిందో, ఎంత సుఖమనుభవించిందో అర్థంకాలేదు.

పోలీసుల దగ్గరున్న ఫోటోల్లో, అందరూ కమలను పోల్చు కుంటున్నారు. వాళ్ళ అనుమానం మీద తెచ్చిన సుబ్బారావు ఫోటోచూసి పెదాలు విరుస్తున్నారు. అంటే ఆమె వెంట వచ్చిన వ్యక్తి వేరెవరో అయివుండాలి, వాళ్ళిద్దరూ ఇక్క డ్నుంచి ఎటో వెళ్ళి వుండాలి తప్ప గాలిలో కరగిపోయేందుకు అవకాశంలేదు.

ఇంత పెద్ద ఊర్లో ఎవ్వరూ ఆ విషయంలో సరయిన ఆచూకీ ఇవ్వలేక పోవడం విచిత్రంగా వుందనిపించింది.

మా ఇంట్లో తిరిగే దయ్యం సంగతి గుర్తొచింది.

ఓ మారు పైకి వెళ్ళి చూసి రావాలనుకున్నాను. దయ్యాలు పగటి పూట తిరగవని ఎవరో చెప్పుకుంటుంటే విన్నాను. నేను చిన్నప్పుడు.

వార్ని సాగనంపి లోనికొచ్చాను.

నిరిగి పోయిన మెట్లెక్క సాగాను.

కళ్ళకు బూజు అడ్డంగా వచ్చింది. దాన్నంతా చేత్తో

ప్రక్కకు నెట్టేసి పైకిచేరడం పెద్ద పనయింది.

మెట్ల కెదురుగా నున్న గదిమాత్రం ఒక మోస్తరుగానుంది.

తలుపులు తెరచి వున్నాయి ఆ రెండు ప్రక్కలా గదులు పైకప్పులుకూలి పోయున్నాయి.

ఎండకు ఎండి, వానకు తడిసిన తలుపుల్ని మెల్లిగా వెనక్కి నెట్టాను.

అ గదికి కిటికీలుగానీ, వెంటిలేటర్లుగానీ లేవు.

సాలెగూళ్ళు, బూజు, గదినిండావున్నాయి. వెనక్కి వెళ్ళి చిన్నలాతరు వెలిగించుకుని వచ్చాను, ఒక్కొక్కవస్తువునీ కదలించి చూడసాగాను. మధ్యలో నాకో అనుమానం వచ్చింది. రాత్రిళ్ళు పందికొక్కులేవైనా తిరుగుతుంటే చెక్కపెట్టెలు, డబ్బాలు కదలి శబ్దమయినాయేమోననిపించింది. ఎందుకయినా మంచిదని అన్నీకదలించిచూశాను. జాగ్రత్తగా సర్దిపెట్టి, అందంగా అమర్చి గది మధ్యభాగం ఖాళీచేశాను.

నాకేవింతవస్తువూ కనుపించలేదు. తలుపులు యధా విధంగామూసి తాళం కప్పవేసి, వచ్చేశాను.

గంటచూస్తే నాలుగయింది. పనిలో కాలం తెలియలేదు అంతసేపు నేనాగది సర్దుతూవుండి పోయానని తెలిశాక ఆశ్చర్యం వేసిందికూడా.

రాత్రికి ఏవిధమైన శబ్దం ఆగదిలోంచి వచ్చేందుకు వీలు లేదు. మనిషెవ్వరూ లోనికి పోలేరు! తాళం వేశాను కాబట్టి. మళ్ళీశబ్దమయితే అది ఖచ్చితంగా దయ్యంపనే అయివుండాలి.

స్నానంచేసి, వంటముగించి కూర్చున్నాను.

మళ్ళీ చీకటిపడింది. నిన్నటిలా ఇవాళభయం పుట్టలేదు. మావారు వచ్చారు. భోజనంచేశారు.బట్టలు తొడుక్కుంటూ వుంటే అడిగాను ''వెలుపలికి వెళ్తున్నారా''అని.

"ఆఁ! ఇవాళ వెళ్ళకతప్పదు. లాకులు ఎత్తించాలి. అన్నారు ప్రాధేయపడుతున్నట్లు.

నేనేం మాట్లాడలేదు.

"పనికాగానే వస్తాను. తలుపులు గడియపెట్టుకో. ధైర్యంగావుండు." అంటూ వెళ్ళిపోయారు.

మళ్ళీ ఒంటరిదాన్నయి పోయాను

పన్నెండుగంటలదాకా నిద్రరాలేదు. మేలుకునే వున్నాను పైగదిలో శబ్దాలు ప్రారంభమయినాయి.

పరుపు క్రిందపెట్టిన టార్చి తీశాను. మెల్లగావెళ్ళి గది తలుపులు తెరచి ప్రక్కగది వద్దకు వెళ్ళాను. లైటువెలిగించాను మధ్యాహ్నం నేను వేసినతాళం కప్పవిరిగి క్రిందపడివుంది తలుపుల దగ్గరకంటూవెళ్ళి వెట్టాను. రాలేదు. అంటేలోపల్నుంచి గడియవేసి వుండాలనిపించింది.

దయ్యాలు తాళంకప్పలు పగలగొట్టే కథనాలు నేనెప్పుడూ వినలేదు. లైటార్పిమూలగా చీకట్లో నిలబడ్డాను, లోపల సామాన్లు అటూ ఇటూ కదిలిస్తున్న శబ్దం అవుతూనే వుంది అరగంటసేపు నిలుచున్నాను. తలుపులు తెరచు కున్నాయి. నల్లటిముసుగులోవున్న ఎత్తైన మానవాకారం వెలిపలికొచ్చింది.

"దొంగ! దొంగ!" అరిచాను పెద్దగా.

ఆ ఆకారం నాపైకి వచ్చింది. నేనులైటు పైకెత్తాను దాని తలపైన బలంగాకొడదామని, ఆకారం చేతులు రెండూ నాగొంతు చుట్టూ బిగుసు కున్నాయి. లైటుక్రిందపడి పోయింది. నేను కూడా కుప్పలాకూలి పోయాను. నన్నలాగేవదిలేసి ఆకారం వెలుపలకు వెళ్ళిపోయింది.

నేను తేరుకునేందుకు అరగంట పట్టింది. నేనుచూసిన ఆకారం దయ్యాంది కాదు. మనిషిది. అందులో ఏ విధమైన

సందేహంనాకు లేదు. రోజూవచ్చి వెతుకు తున్నాడామనిషి. దేని కోసమయి వుంటుందాని ఆలోచించసాగాను

రాక్షసి బొగ్గు పొడి చేసిచల్లినట్లు చీకటి చిక్కగా అలుము కునివుంది. ఆ ఆకారం మెట్లమీదుగా వెళ్ళినట్లు శబ్దంకాలేదు. మరెటునుంచి వచ్చిందో చూడాలనిపించినా భయంతో ఆ ప్రయత్నం మానుకొని క్రిందికి వచ్చేశాను. తలుపులు గడియ పెట్టుకొని కూర్చున్నాను.

ఆడ దయ్యంతో అల్లాడుతుంటే తోడు దొంగలు కూడా బయలుదేరినందుకు బాగా భయంపుట్టింది.

నిద్రపోకుండా కళ్ళలో ఒత్తులేసుకుని కూర్చున్నాను.

మావారు వేకువఝామున వచ్చారు. తలుపుతట్టారు. తీసి వారిగుండెల పైన పడ్డాను.

"ఏం జరిగింది శాంతా? ఎందుకలా ఇదయిపోతున్నావ్? నన్ను గట్టిగా పొదివి పట్టుకుని అడిగారు.

జరిగింది చెప్పాను.

"అయితే మనం వెంటనే రాయుడుగార్ని కలుసుకుని విష యాలు వివరించడం మంచిది. ఇంటికి ఘట్టి కాపలా పెడతాడు" అన్నారు.

"మనం ఆ దొంగ చిక్కిందాకా పోనీ ఊర్లో ఎక్కడన్నా వుందాం!,, అన్నాను.

"అలాగే!,, అన్నారు.

ఇద్దరం బయలుదేరాం ఊళ్ళోకి

స్టేషన్‌లో రాయుడు కూర్చుని వున్నారు. రకరకాల ఫైళ్ళు పేపరు కటింగులు ముందేసుకుని కూర్చున్నారు.

మావారు నన్ను చెప్పమన్నారు.

మళ్లీరాత్రి నేను గమనించిందంతా చెప్పాను. దాంతోపాటు

అంతకు రెండు మూడు దినాలనుండి కనుపించిన దయ్యం సంగతి కూడా చెప్పాను.

ఆయన తదేకంగా అంతావిని డైరీలో ఏవేవో రాసుకున్నారు. ఆర్రాత్రి నేనుచూసిన దొంగ ఆకారాన్ని బాగాగుర్తు చేసుకుని, వివరంగా చెప్పమన్నారు. గుర్తున్నంతవరకు చెప్పాను.

అంతలో వెలుపల జీపొచ్చి ఆగింది.

అందులోనుండి ఇద్దరు పోలీసులు ఒకతన్ని వెంటబెట్టు కొచ్చారు.

"నన్నెందుకిక్కడకు రప్పించారు?" వస్తూనే కోపంగా అడిగాడు అతను.

"మిస్టర్‌సుబ్బారావ్! పనుండి రప్పించాను, నువ్వెంత అమాయకంగా నటించినా, కమలను తీసుకొనినువ్వు ఇక్కడికొచ్చి నట్లు సాక్ష్యం దొరికింది. ఇప్పటికయినా నిజం ఒప్పుకో. కమల నేంచేశావుచెప్పు," అన్నాడు రాయుడు.

నేను అతన్ని పరిశీలనగా చూశాను ఎక్కడనో చూచిన గుర్తు. బాగా అతను నన్ను చూశాడు. గుర్తుపట్టి నట్లున్నాడు. మొహం తక్కున క్రిందకు దించుకున్నాడు.

నాకుగుర్తొచ్చింది. స్కూల్‌ఫైనల్‌లోఅతను నాక్లాస్‌మెట్. అందర్నీ అల్లరిపెట్టేవాడు, ఆడపిల్లలకు పేర్లుపెట్టి, అడ్డమైన సంబంధాలు అంటగట్టి గోడలపైన రాయించి నానా గొడవ చేసేవాడు.

"మిస్టర్! నీపేరుసుబ్బారావుకదూ!"అడిగాను.

అతను మాట్లాడలేదు.

అవునమ్మా! అతనిపేరు సుబ్బారావే. ఇంటిపేరు ఈతముక్కల. నీకు తెలుసా ఇతను.

"నాతోపాటు చదువు కున్నాడు."

కం(టాక్టర్ కనకయ్యకుమార్తెను ఇతనే లేవదీసుకు వచ్చా డని, కంప్లయింటు చేశారు. అరెస్టు చేశాను. తనకు ససేమిరా తెలీదంటున్నాడు. అన్నాడురాయుడుగారు.

"అలాగా!" అంటూ మావార్ని (పక్కకుపిలిచి, రహస్యం చెవిలో చెప్పాను. అసలు ఆతనికి మగతనం లేదన్న విషయం మా వూర్లో అందరికీ తెలుసనీ, మాస్నేహితురాలు వనజమ పెండ్లాడితే, ఆమె శోభనం నాటి మొదటిరా(త్రి పారిపోయి పుట్టింటికి వచ్చిందని.

ఆయన వెళ్ళి ఆ విషయం రాయుడిగారి చెవిలో ఉదారు సుబ్బారావును రిమాండ్ రూంకు పంపించేశారు. ముగ్గురం కూర్చున్నాం.

"మీారు చెప్పిన (క్రొత్త సమాచారం నా పనిని ఇంకా చిక్కుల్లో పడేసిందమ్మా!" అన్నారు రాయుడుగారు.

"తెలిసిన విషయాన్ని బట్టి చెప్పాను." అన్నాను.

"ఆల్‌రైట్! మీారు ఊళ్ళోనే వుండండి. నేను ఆ యింటికి కాపలాగా నలుగురు కానిస్టేబుల్సును పంపుతాను" అన్నారు రాయుడుగారు.

"అంత భయంగా ఏమీాలేదు లెండి! మీారెటూ మాకు తోడుగా పోలీసుల్ని పంపుతామంటున్నారుగా? అక్కడే వుంటాం!" చెప్పారు మావారు

నాకు వొళ్ళు మండింది. పనులంటూ ఆయనేమో రా(త్రిళ్ళు ఇంటిపట్టున వుండరుగాబట్టి భయపడే (పసక్తి వారికి లేదు. ఆ బాధంతా పడుతున్నది నేను. రాయుడిగారి ముందు మంకు పట్టు పట్టి మా వార్ని చిన్న బుచ్చడం ఇష్టం లేక మౌనంగా వుండిపోయాను.

ఆ తర్వాత ఇద్దరం ఇంటికి బయలుదేరాం

నన్ను ఇంట్లో వదిలేసి మావారు మళ్ళీ లాకుల దగ్గరకు వెళ్ళారు. పనులు చక్కబెట్టుకుంటూ వున్నాను.

"అమ్మాయి! శాంతా! ఏంచేస్తున్నావ్?" అంటూ వచ్చింది పేరమ్మ.

"ఏముంది? మామూలు పనే!" అన్నాను.

"దయ్యాలు ఏమంటున్నాయి."

"అవీ, నేనూ' బాగా కలిపిపోయాం!" అంటూ అంతకు ముందు జరిగిన సంఘటనల గురించి చెప్పి, ఆ కమలతో పాటు వచ్చిన మనిషి ఎవరో, ఎవరూ చెప్పలేకపోతున్నారు. ఈ వూరి నుండి వాళ్ళిద్దరూ తిరిగి వెళ్ళినట్లు ఎవ్వరు కూడా ఖచ్చితంగా చెప్పలేకపోతున్నారు." అన్నాను.

"ఇంతకు ముందే నేను స్టేషనుకు పోయివచ్చాను. అక్కడ అబ్బాయిని చూపించి ఇతనేనాని అడిగారు. అతను కాదు. ఆ మాటే చెప్పాను." అంది పేరమ్మ.

"రోజూ నీ దగ్గరకు సత్తెప్ప కారీయర్ తీసుకెళ్ళేందుకు వచ్చేవాడు కదూ! ఈ ఇంట్లో దిగినవాళ్ళ గురించి ఏమైనా చెప్పాడా?"

అస్తమానం త్రాగే వాళ్ళని, ఆమె చిరాకుగా, కోపంగా, వుండేదని, అతనితో అయిష్టంగా ఇక్కడకు వచ్చినట్లుందనీ చెప్తుండేవాడు. కానీ ఆ మాటలు నాకు నమ్మకంలేదు. ఇష్టం లేకుంటే ఇంతదూరం పరాయిమగవాడి వెంట పడుచుపిల్ల ఎలా వస్తుంది. వీడు కుర్ర సన్యాసి వీడికంతే అర్థమయివుంటుందనుకున్నాను." అంది పేరమ్మ.

"ఇంకా ఏం చెప్పాడు?" అడిగాను ఉత్సాహంగా.

"వాడికి డబ్బులు బాగా పడేసేవాడట. మర్చిపోయాను. వాడికో పర్సుకూడా ఇచ్చాడట అతను. దాన్ని జాగ్రత్తగా

చూచుకునేవాడు సత్తెప్ప. నేను చూశాను. వల్లటితోలు పర్సది అందులో ఫోటో ఏదో వుందిగూడా ఆఁ! గుర్తొచ్చింది! ఫోటో ఎవరిదిరా అంటే పర్సు ఇచ్చిన అయ్యగారిదేనన్నాడు." అంది పేరమ్మ.

నాకు ఉత్సాహం ఎక్కువైంది. రాయుడిగారికి ఆ ఫోటో విషయం తెలిస్తే వెతుకుతారు. దొరికిందంటే ఆ గంతకుడిని నిమిషాలమీద పట్టుకోగలడనిపించింది.

మావారొచ్చాక పేరమ్మ చెప్పిన వివరాలు చెప్పి రాయుడు గార్ని కలుసుకొని రమ్మని చెప్దామనుకున్నాను.

పేరమ్మ కాఫీ త్రాగి, నాకు ధైర్యం చెప్పి వెళ్ళిపోయింది.

సత్తెప్ప హత్యకు కారణం నాకు అర్థమైంది. వాడి దగ్గ రున్న పర్సులోవున్న తన ఫోటో సంపాదించుకోవడానికి ఆగంత కుడు వచ్చివుంటాడు. దాన్ని తిరిగి తీసుకున్నా, ఎప్పుడో ఒక ప్పుడు బ్రతికుంటే వాడు గుర్తుపడతాడన్న భయంతో హత్య చేసి వుంటాడనుకున్నాను.

అలాంటప్పుడు కామయ్య కూడా అతన్ని చూశాడు. స్టేషను మాస్టరు చూశాడు. వాళ్ళిద్దర్నీ ఎందుకు వదిలేసి నట్లు. సత్తెప్పకు విధించిన దండన చూసి భయపడి వాళ్ళు నోరు మూసుకుని వుంటారన్న ఆలోచనలో పడ్డాడేమోనని పించింది.

సాయంత్రం వాకిట్లో కుర్చీ వేసుకుని కూర్చున్నాను.

ఎదురుగా వున్న చెట్లు కనిపించాయి. అన్నీ బాదర బంధీ గా పెరిగి వున్నాయి. నాలుగైదు కొబ్బరి మొక్కలు కూడా నాటి వున్నాయి. వాటల్లో ఒకటి ఎండిపోయివుంది. దాన్ని తీయించేద్దామనుకున్నాను.

అంతలో కామయ్య వచ్చాడు.

నిషి బాగా నీరసించిపోయి వున్నాడు. కొడుకు పోయిన విచారం అతన్ని అమితంగా క్రుంగదీసి వుండాలనిపించింది.

"ఏంకావాలి? కామయ్యా!" అడిగాను.

"అయ్యగారు లాకుల దగ్గర వున్నారమ్మా! ఇన్‌స్పెక్టరు గారు కూడా అక్కడే వున్నారు. మధ్యాహ్నం నుంచి తిరుగుతున్నారిద్దరూ. ఫ్లాస్కులో కాఫీ పోయించుకురమ్మన్నారు." అన్నాడు కామయ్యా.

కాఫీ డికాక్షను కూడా లేదు. వెంటనే కలిపి ఇచ్చేందుకు. వెళ్ళి నీళ్ళను మరగబెట్టాలి. అంతా అయ్యేసరికి అరగంటన్నా పడుతుంది. ఈలోగా ఆ కొబ్బరి మొక్క పీకిపారెయ్యమని పురమాయించి లోనికి వెళ్ళాను.

రెండుసార్లు మధ్యలో వచ్చి చూశాను.

కామయ్య గునపంతో తవ్వుతున్నాడు.

కొబ్బరి మొక్క పట్టుకుని గుంజి లాగి వెలుపల పారేశాడు. ఆ విసురులో దాంతో పాటు రెండు ఎముకలు కూడా ఎగిరిపడ్డాయి బయట.

"అమ్మగారూ! అమ్మగారూ!!" అంటూ కేకేశాడు,

"ఏమిటి కామయ్యా!" అంటూ పరుగెత్తుకొచ్చాను.

"ఇందులో ఏదో అస్థిపంజరం వుందమ్మా! అన్నాడు.

నేను వెళ్ళి చూశాను. మనిషి తాలుకు పుర్రె కనుపించింది. ఇంకాస్త లోనికి గొయ్యి త్రవ్వమన్నాను. కామయ్య మళ్ళీ పలుగు పుచ్చుకున్నాడు. పది నిముషాలు చుట్టూ త్రవ్వి, పెద్ద అస్థి పంజరాన్ని తీసి వెలుపల వేశాడు.

"అర్జంటుగా వెళ్ళి ఇన్‌స్పెక్టర్ గార్ని, మావార్ని పిల్చుకురా! కాఫీ ఇక్కడే త్రాగుతారు." చెప్పాను.

ఉరుకులు పరుగులపైన వెళ్ళాడు కామయ్య.

అరగంటలో అంతా చేరిపోయారు.

చేతి ఎముకల్ని కదలకుండా అంటిపెట్టి కొన్ని వున్నాయి గాజాలు; మెళ్ళో బంగారు లాకెట్ వుంది.

ఊళ్ళోనుండి పోలీసులు జీప్ తెచ్చారు. అస్థి పంజరాన్ని అందులో లోడ్ చేశారు. ఆగుంట ఇంకా త్రవ్వించారు. మరే వస్తువు కనిపించలేదు. కానీ వెండి తాయత్తు చిక్కింది.దాన్ని చూడగానే కామయ్య "ఇది మా సత్తెప్పది బాబు!" అంటూ బోరుమని ఏడ్చాడు.

"అయితే ఇందులోకెలా వచ్చింది?" అడిగాను నేను.

"అదే అయోమయంగావుంది!" అన్నారు మావారు.

రాయుడుగారు ఆలోచిస్తున్నారు. ఎవ్వరితోనూ మాట్లాడ లేదు. పోలీసులు మాత్రం అస్థిపంజరాన్ని మెల్లగా జీప్‌లోకి ఎక్కించారు.

రాయుడుగారు వెళ్ళి జీపెక్కారు.

అదికదిలి వెళ్ళిపోయింది. .

నేనూ, కామయ్యా, మావారూ మిగిలాం.

"ఇక్కడ హత్య జరిగింది! అదిమాత్రం ఖాయం!" అన్నారువారు.

"అందుకే రాత్రిళ్ళు దయ్యంతిరగటం!" అన్నాను నేను

"ఇంకరాదా దయ్యం! అస్థిపంజరం తీసేశారుగా!,,

"అది ఆ కమలదేమోనండీ!,, అన్నాను.

"కావచ్చు!," అంటూ లోనికిదారి తీశారు మావారు.

కామయ్యకు ధైర్యంచెప్పి పంపి, నేను లోనికివచ్చాను.

మధ్యాహ్నంమంతా తిరుగుతుండి పోయారు. కామయ్య

చెప్పాడు ఎక్కడెక్కడ తిరిగారు?,, అడుగుతూ కూర్చున్నాను.

"రాయుడుగారు అసాధ్యులు! సత్తెప్పను హత్యచేసిన దుర్మా

ర్గుడు ఎలావచ్చి వుంటాడో తెలుసుకొనేందుకు లాకులపైనుండి దాటి, అల్లినగరం తీసుకెళ్ళాడు, అక్కడ వాకబుచేశాం. ఆ సాయంత్రం బస్సులో భీమపురంనుండి ఒకతను దిగాడట. అతను తిన్నగా ఊరుదాటి పొలాలపైన పడ్డాడట. నల్లపాంటు వేసుకుని, తెల్లచొక్కా తొడుక్కుని వున్నాడట. చేతులో చిన్న పెట్టె వుందట.అదేమనిషి రాత్రిఒంటిగంటకువచ్చి బస్‌స్టాండులో ఆగివున్న బస్‌లో పడుకున్నాడట. డ్రైవర్లూ, కండక్టర్లూ, చూశారట అతన్ని. వాళ్ళిద్దరికోసం కబురుచేసి తిరిగి వచ్చేశాం,, అన్నారు.

పేరమ్మ చెప్పిన పర్సు సంగతి చెప్పాను.

విని''ఇందాకే ఆయనకుచెప్తే బాగుండేది!,, అన్నారు.

''తర్వాతవెళ్ళి చెప్పండి. వాడి తాయెత్తు ఆ గుంటలో దొరికింది. అంటే హత్యసంగతి సత్తెప్పకు తెలీకున్నా ఆగంతకుడు అతనిచేతే గుంటత్రవ్వించివుంటాడు. ఆ తర్వాత చీకటిపడ్డాక శవాన్ని తనేస్వయంగా గుంటలోవేసి పూడ్చి వుండాలి!'' అన్నాను

''నువ్వో పెద్ద డిటెక్టివ్‌లా తయారవుతున్నావ్?,, అన్నారు నవ్వుతూ.

నేను క్రైమ్‌సాహిత్యం తెగచదివేదాన్నని వారికి చెప్పడం ఇష్టంలేక ఊరుకున్నాను.

మేమిద్దరం టిఫిన్ చేస్తుండగా మళ్ళీ ఏదోజీప్ వచ్చిఆగిన శబ్దమయింది.

ఇద్దరం లేచి వెలుపలికొచ్చాం!

పోలీస్ వాన్‌కనిపించింది. అందులోనుండి కెమెరావెుళ్ళో వేసుకున్న సూట్‌వాలా లిదరు పోలీసులు ఇంకా ఇదరు సూట్లు వేసుకొన్న వ్యక్తులు దిగారు.

''మిస్టర్ సుధాకరం!'' మావారి ముందుకొచ్చి అన్నాడు

కెమెరామెన్.

"అవును!" మావారు చెప్పడం వినిపించింది.

"ఆ అస్థిపంజరం తీసిన గుంటను ఫోటోలు తీసుకునెందుకు వచ్చాం. వీరు వ్రేలిముద్రలనిపుణులు." అంటూ ప్రక్కనున్న వార్ని చూపించాడు.

మావారు అందర్నీ వెంటబెట్టుకెళ్ళారు.

నేను ఎదురుగా నిలుచున్నాను.

వ్రేలి ముద్రలు తీసుకునే వాళ్ళు నాదగ్గర కొచ్చి మాకు ఇబ్బంది కాకుంటే కాస్త మా వెంట వచ్చి ఇల్లంతా చూపించగలరా?" అడిగారు.

మాట్లాడ కుండా వెంట వెళ్ళాను.

దొంగలుపడ్డ ఆరు మాసాలకు కుక్కలు మొరిగినట్లు ఇప్పుడొచ్చి వ్రేలిముద్రలు దొరుకుతాయన్న ఊహ వాళ్ళకేలా కలిగిందో నాకు తట్టలేదు.

కిడికీల అద్దాలు, గోడలు, మొదలైన అన్నింటిపైన రకరకాల పౌడర్లుచల్లి, లావుపాటి అద్దాలుపెట్టి వెతుక్కోసాగారు. ఎక్కడా వాళ్ళకు ఏ వ్రేలిముద్రలూ కనుపించలేదు.

అందరం కొయ్యమెట్లెక్కి పైకి వెళ్ళాం.

స్టోర్‌రూం తలుపు తెరచాను. అందులో జొరబడ్డారు. పదినిముషాల తర్వాత వెలుపలికొచ్చారు. రెండోఅతను రాబోతూ ఆగి, తలపైకెత్తి చూశాడు. మెల్లిగా చెయ్యిపెట్టి లాగాడు.

తను తీసిన వస్తువును తీసి నాకూ, అతని సహచరుడికీ చూడమన్నట్లు చూపించాడు.

చూడగానే నాకు కళ్ళు తిరిగాయి. ఎర్రటి రక్తం ఎండిపోయిన ఏడంగుళాల కత్తి అది.

బహుశా దాంతోనే ఆగంతకుడు హత్యచేసి వుండాలని

అందరం అకనున్నాం.

అందరం క్రిందికొచ్చాం. ఆ కత్తిని మావారుకూడా చూశారు.

పోలీసుబలగం అంతా జీపెక్కి వెళ్ళిపోయింది.

"మొత్తానికిక్కడ దారుణమైన హత్య జరిగినట్లుంది." అన్నారు వారు.

"ఇంకా అనుమానిస్తున్నారేమిటి? నాకు ఆ దయ్యం కనుపించగానే ఇటువంటి ఘోరమేదో జరిగివుండాలనిపించింది. ఆదే నిజమయింది." అన్నాను.

" అసలు ఆ అమ్మాయిని ఎవరు తీసుకొచ్చిందీ ఇంతాదాకా తెలియలేదు. తీసుకొచ్చి హత్య చెయ్యవలసిన అవసరమేమొచ్చిందో అంతకన్నా అమోమయంగా వుంది!" అన్నారు వారు.

"ఆ రాయుడుగారు పరిశోధిస్తున్నారుగా; త్వరలోనే తేలిపోతుంది." అన్నాను నేను.

మళ్ళీ రెండురోజులు ఏవిధమైన సంఘటనా జరగకుండా మామూలుగా నడిచిపోయాయి. ఆరెండు రాత్రిళ్ళు దయ్యం మాత్రం కనుపించలేదు. మకాం మార్చిందేమోననుకున్నాను.

మూడోరోజు ప్రొద్దున్నే, మావార్నీ నన్నూ రమ్మని వార్తవచ్చింది పోలీస్ స్టేషనుకు.

ఎకాయెకిన బయలుదేరి వెళ్ళాం.

కంట్రాక్టరు కనకయ్యను పరిచయం చేశాడు రాయుడుగారు మాకు. ఆయనవెంట ఒక అందమైన యువకుడూ, మరో స్త్రీ వున్నారు. ఆమె బహుశా కనకయ్య భార్య అయివుండాలని ఊహించాను.

రిమాండ్‌లో వున్న సుబ్బారావును కూడా పిల్చుకురమ్మని హెడ్‌కానిస్టేబుల్‌కు చెప్పాడు రాయుడు. అతనూ వచ్చాడు.

కూర్చోమని కుర్చీ చూపించాడు. అందరం కూర్చున్నాం.

రాయుడుగారు గొంతు సవరించుకుని చెప్పటం ప్రారంభించారు.

"కనకయ్యగారి కుమార్తె కమల దారుణంగా ఈ వూరికి దూరంగావున్న పాడుబడ్డ బంగళాలో హత్యగాబడింది. అందుకు సాక్ష్యంగా ఆమె ఆస్థిపంజరం, దాంతోపాటు దొరికిన గాజులు లాకెట్ వున్నాయి. ఆమె ఎవరో పురుషుడితో ఈ వూరు వచ్చింది. అతనెవరయిందీ మాకు ఇంతదాకా తెలియలేదు. ఎంతో ప్రయత్నించాం. ఏమేమో చేశాం. మా పరిశోధన మొదలెట్టినచోటే వుండిపోయింది.

హత్యజరిగిన తీరును ఎముకలపై కత్తిచేసిన గాట్లను బట్టి ఊహించగలిగాం ఒకటిగాదు, దాదాపు పదిపోట్లు పడ్డాయి. అంతకక్ష అతనికి ఆమెపై ఎందుకు కలిగిందో అర్థంకాలేదు.

ఆమె గతచరిత్ర తోడాం. సుబ్బారావుపై ఆమెకు విపరీతమైన ప్రేమ. అలాగే సుబ్బారావు చెల్లెలు సుభద్రకు కమల అన్నయ్య ఆనంద్‌పైన ప్రేముంది." అంటూ ఆగాడు రాయుడు.

ఆనంద్ కొద్దిగా ఇబ్బందిగా కుర్చీలో కదలటం గమనించాను.

"ఇక్కడ ఆనంద్‌ను కొన్ని ప్రశ్నలడుగుతాను" అంటూ రాయుడు అతనివైపుచూసి.

"సుభద్ర చావుకు కారణం తెలుసా?" అడిగాడు.

"ఆమెనాకు తెలియదు." అన్నాడు ఆనంద్.

"గుడ్! నీకూ తెలీదు ఆమెకు అబార్షన్ చేయించిన

చెప్పింది. చూపించింది" అన్నాడు రాయుడు.

"ఏమిటీ?"

"మారుపేరుతో సుభద్రభర్తగా నువ్వు సంతకంచేసిన డిక్లరేషన్ ఫారమ్. నీ ఫోటో ఆమెదగ్గర ఆల్బంలో దొరికింది. నీవల్లే సుభద్ర చనిపోయినవిషయం సుబ్బారావుకి బహుశా తెలిసుంటుందనుకుంటాను." అన్నాడు రాయుడు.

"దానికీ, మా అమ్మాయి చావుకీ సంబంధమేమిటి?" అడిగాడు కనకయ్య

"ఉందిగాబట్టే ఈ వ్యవహారాలన్నీ వెలుపలకు లాక్కురావలసివచ్చింది." అన్నాడు రాయుడుగారు.

నాకు వింటూంటే చాలా ఉత్సాహంగా ఉంది.

"వాట్ మిస్టర్ సుబ్బారావ్ నిజమేనా?"

సుబ్బారావ్ మౌనంగా తలవంచుకున్నాడు.

"కమల తనను ప్రేమిస్తుందనీ తనంటే పడిచస్తుందనీ కూడా సుబ్బారావుకు తెలుసు. అతనికి తన చెల్లెలి చావుకు కారకుడైన ఆనంద్ పైన పగ తీర్చుకోవాలనిపించింది. సుభద్ర పైన అతనికున్న ప్రేమ అపారం. అందుకే ఆమెకు అన్యాయం చేసిన ఆనంద్ పై అపారమైన ద్వేషంకూడా కలిగింది. అందుకు తగిన పథకం తయారుచేశాడు. దాన్ని మేముచెప్పడంకన్న అతనేమాకు చెప్పడం ఉచితం." అంటూ ఆగాడు.

సుబ్బారావు తలెత్తకుండా కూర్చున్నాడు.

మేమంతా వినేందుకు చెవులు రిక్కించుకొనివున్నాం

"చెప్పు" అన్నాడు రాయుడు.

సుబ్బారావు తల వంచేసుకున్నాడు. అతని కళ్ళనిండా నీళ్ళునిండడం నేను గమనించాను.

"నాకు సుభద్ర చావుసంగతి ఎవ్వరూ చెప్పలేదు. ఆమె దయ్యంగామారింది. ప్రతిరాత్రి నాగదికివచ్చి బోరున ఏడు

న్చొకూర్చుంది. ఆమెకు ధైర్యం చెప్పాను కమలక్కూడా అలాంటి స్థితినే తేవాలని నిర్ణయించుకున్నాను. అందుకునేను అప్రయోజకుణ్ణి. దాంతో నా సేహితుడైన అశోక్‌ను సాయం కోరాను.

కమల శీలం కాజెయ్యమని మాత్రమే చెప్పాను. పెళ్ళాడు తానని కమలకు ఆశపెట్టి, ఈ వూరి వెలుపలున్న బంగళాకు వచ్చి ఎదురు చూడమని చెప్పాను. నేనొచ్చి కలుసుకుంటానని చెప్పాను. నా బదులు అశోక్‌ను పంపాను.'' అంటూ ఆగాడు సుబ్బరావు.

పగ తీర్చుకొనేందుకు అతను అనుసరించదలచిన మార్గం వినగానే నాకు భయం పుట్టుకొచ్చింది.

''ఆ అశోక్ పెద్ద దొంగ. రెండుసార్లు జైలుకెళ్ళాడు. అమ్మాయిలతో ఆడుకునే జులాయి వెధవ.'' అన్నాడు రాయుడు.

''కానీ అతను స్కూల్ ఫైనల్‌దాకా నాతో చదివాడు. అతని ధైర్యాన్ని ఎప్పుడు మెచ్చుకునే వాణ్ణి. అతనికంతా చెప్పాను. ఎలాగైనా కమలను పాడు చెయ్యమని ప్రోత్సహించాను. ఒప్పుకున్నాడు. అతన్ని వేరే దారిన బంగాళాకు పంపాను. ఆ తర్వాత ఏమయింది నాకు తెలీదు.'' అన్నాడు సుబ్బరావు.

కనకయ్య కళ్ళు ఎరుపెక్కాయి. కోపంగా పైకి లేచాడు.

రాయుడు అతన్ని అదిమి కూర్చోపెట్టి ''అతని చెల్లెలికి జరిగిన అన్యాయం ఒకమారు మీరు తలచుకోండి. మీ ఆవేశం చల్లారుతుంది.'' అన్నాడు రాయుడు.

బల్లపైన టెలిఫోన్ మ్రోగింది.

రాయుడు అందుకొని రెండు నిముషాలు మాట్లాడి ''గుడ్!'' అన్నాడు ఫోన్ పెట్టేసి మా అందరి వైపు చూసి ''అశోక్ దొరికాడు. గాంబ్లింగ్ డెన్‌లో వున్నాడట. అతను

నేరాలు ఒప్పుకున్నాడు.''చెప్పాడు.

''సత్తెప్పను కూడా అతనేనా చంపింది? '' అడిగాను నేను

''అవును. తన్ను గుర్తుపడతాడనీ' తన ఫోటో పోలీసులకి స్తాడనీ భయపడి చేశాడు! '' చెప్పాడు రాయుడు.

''అతను కమలను హత్య చెయ్యవలసిన అవసరం ఏమొచ్చింది? '' అడిగారు మావారు.

''ఆమె బహుశా అశోక్‌ను చూడగానే బిక్కచచ్చి వుంటుంది. తనెందుకువచ్చిందీ. సుబ్బరావు ఎందుకు పంపింది చెప్పి వుంటాడు. ఆమె ప్రతిఘటించి వుంటుంది. దాంతో అతనికి కొపమొచ్చి వుంటుంది. ఆమెను భయపెడదామని కత్తి తీసి వుంటాడు, కమల కలయబడి వుంటుంది.తన్ను తాను రక్షించుకోవడానికి ఆమెను హత్యచేసి వుంటాడు శవాన్ని పూడ్చేసి పెట్టి వచ్చిన దారినే పారిపోయి వుంటాడు.'' అన్నాడు రాయుడు.

అందరం లేచాం.

నేనూ, మావారు ఆ రాత్రికే ఇల్లు ఖాళీచేశాం,

—: ఐపోయింది :—

# ఖైదీ సీరియల్

## (పదమూడవ భాగము)

"మనం తప్పించుకుకెళ్ళేందుకు ఉపయోగిస్తాయని తెచ్చావనుకున్నాను, తుపాకుల్ని. నువ్వుకూడా వాళ్ళతో దొంగతనాని కెళ్ళాందుకని చెప్పాక నిరుత్సాహంగాక మరేమవుతుంది." అంది డెల్లా.

"వీళ్ళనుంచి మంచితోనే మనం వీడ్కోలుపుచ్చుకుందాం.ఆనాయకుడికిచాలా వరకు మనభాషనేర్పాను. రెండుమూడు దొంగతనాల్లోసాయంచేస్తే చాలు. అతను మనల్ని అనవసరంగా ఇక్కడుంచడు. చెప్పివెళ్ళవచ్చు. అప్పుడుకూడా ఎలావెళ్ళాలి? ఎక్కడికి వెళ్ళాలి? అన్నసమస్యలుంటాయి. అతనిసాయం మనకా సమస్య బహుశాలేకుండాచేస్తాయేమో ఎవరుచూశారు." అనునయంగా అన్నాను.

"వద్దు! వద్దు! ఇక్కడే అడ్డమైన ఆకులుతింటూ ఖైదీల్లా పడివుందాం!" అందిడెల్లాకోపంగా.

ఆమెతో వాదించి లాభంలేదనిపించింది. తెచ్చినతుపాకులు మూలగావెపెట్టివెళ్ళిపడుకున్నాను విశ్రాంతి తీసుకుందామని.

డెల్లామెల్లగా వచ్చి నాప్రక్క కూర్చుంది.

"అయితే వాళ్లతోనువ్వు రాత్రికిసముద్రం పైకిపోతున్నావా?" "అడిగింది. "ఆ! రమ్మన్నారు!" అన్నాను.

"రాజ్‌సముద్రంమీద దొంగతనాలు ఎంతదారుణమైనవో, భయంకరమైనవో నాకన్నా నీకెక్కువతెలుసు. షిప్‌లోవున్నవాళ్ళు తిరగబడి కాల్పులు సాగిస్తేనాదురదృష్టంవల్లనీకేమయినాజరిగితే? ఆలోచించు. తోడు నువ్వున్నావన్నధైర్యంతో నున్నాను. ఆతోడు లేదనితెలిశాక ఈ మూక నన్నెలా చిత్రహింసల పాలు జేస్తుందో ఆలోచించు. దయచేసి నామీద ప్రేమతోకాకున్నా, కనీసం కరుణతోనైనా నీప్రయాణం మానుకో!" అందిడెల్లా.

"అదెలాసాధ్యం! మంచితో మనల్నిఖైదు చేశారు. రానంటే బలవంతంగానైనా తీసుకెళ్ళేశక్తివాళ్లకుంది." అన్నాను నేను.

"అంతగా అతను పట్టుపడితే నన్నుకూడా తీసుకెళ్లు. చావు బతుకుల్లో కలసివున్నట్లన్నా వుంటుంది." అందిడెల్లా.

"అదిఅడుగుతాను!" అన్నాను.

తృప్తిగానిట్టూర్పు వదలందిడెల్లా. నేను మెల్లిగా కళ్ళు మూసుకున్నాను. నాకన్నాముందే డెల్లా నిద్రలోకొరిగిపోవడం గమనించాను.

ఆమెనుమొదటిసారి చూచినసంఘటన గుర్తొచ్చింది. అపుడు తాజాగా విరిసిన రోజాలా వుండేది. ఎండ, వానా, గాలీ, రకరకాలయిన తిండీ, నడక, అధైర్యంఅన్నీప్రోగయి ఆమెఅందాన్ని సగం చేశాయి. నేనుఎలాఉన్నాము చూసుకుందా మనుకున్నాను. అక్కడెక్కడా అద్దంకనుపించలేదు. బహుశా నేనుకూడాబాగా మారిపోయివుంటాననపించింది.

రాత్రికి దొంగతనానికి పోయినప్పుడు షిప్‌లో ఎక్కడైనా అద్దంకనుపిస్తే నామొహంనేను చూసుకోవాలన్నకోరిక కలిగింది. రెండు గంటలతర్వాతలేచాను. అప్పటికేడెల్లా లేచివెళ్లిపోయింది

వెలుపలకు. మాకు కట్టినగుడిసెకు వెనుకవేపు చిన్నసీళ్ల గుంట వుంది. మా కాలకృత్యాలు తీర్చుకునేందుకు, స్నానపానాదులు ముగించుకునేందుకు, నీళ్ళు త్రాగేటందుకు దానిపైన ఆధార పడివున్నాం.

స్నానం ముగించుకొస్తూ కనుపించిందిడెల్లా. అబట్టల్లో, తల విరబోసుకొని, మర్మావయవాల్ని పెద్దఆకుల్తో కప్పుకొని, వెలుతురును బీల్చుకుంటూ వస్తూంటే, ఆమెగూడా అడవి మనిషిలా కనుపించింది. వాళ్లకూ, డెల్లాకు ఒక్కటేతేడా వాళ్ళు కాస్త భయంకరంగా వుంటారు. ఈమె అలావుండదు.

"ఏమిటలా క్రొత్తగాచూస్తున్నావ్? అడిగింది.

"క్రొత్తగాకనుపించే అందాల్ని క్రొత్తగానేచూడాలి!"అన్నాను

"నేనుచెప్పిందీ గుర్తుందా? మరచిపోయావా?"

"ఎలామరుస్తాను. గుర్తుంది." అన్నాను.

"నువ్వు వెళ్ళేప్పుడు ఒకతుపాకీ ఇక్కడవుంచి వెళ్లు!"

"ఎందుకు?"

"అతను పట్టినపట్టు విడువకుండానువ్వు రావలసిందేననీ,నన్ను తీసుకురావద్దనీ అంటే, కనీసం ప్రాణరక్షణకన్నా ఉపయోగి స్తుందది".

"అలాగే! అయినా ఆపరిస్థితిరాదు అతన్ని వొప్పించగలను." అన్నాను నేను కూడానీళ్లగుంటవైపు దారితీస్తూ.

నాపనులన్నీ ముగించుకునేసరికి చీకటిపడింది.

డెల్లాకుధైర్యంచెప్పి, గూడెంకు బయలుదేరాను కాలినడకన. కొంతదూరంవెళ్ళేసరికి నాకెదురుగా ఒకస్త్రీ పరుగెత్తుకురావడం కనుపించింది. ఆమె వెనుక దూరాన ఏదో జంతువు తరుము కుంటూ వస్తూంది.

ఆమెవచ్చి నన్ను ఘట్టిగా పట్టుకుంది.

వాళ్లభాషలోనే అడిగాను ఆమెను. ఎందుకలా పరుగెత్తుతున్నావని.

కట్టెపుల్లలకోసం తనుఅడవిలోకి వచ్చాననీ, అడవిపందొకటి వెంటపడిందనీ భయపడి పరుగెత్తుకొస్తున్నాననీ చెప్పింది. అంతలోనే ఆకుల్ని తొక్కుకుంటూ గలగలశబ్దంచేస్తూ దగ్గరలోకి వచ్చేసిందా పంది.

తుపాకీపై కెత్తాను. గురిచూసి, టక్కున ట్రిగ్గర్‌నొక్కాను చీకటిని మెరుపుల్తో చీల్చుకుంటూవెళ్ళి పంది తలకు తగిలింది.

గుండు తగలగానే పల్టీలుకొట్టింది. తుపాకీగుండు కలిగించినబాధకు, దానివొంటికున్న ముళ్ళునిక్క బొడుచుకుని వున్నాయి అదిమనుషుల్ని వాటితో గీకినాచాలు చర్మం చినిగి, మాంసపు కండలు తెగి, ఎముకలువిరిగి, నిముషాల్లో ప్రాణాలు పోతాయి.

పందిమళ్ళా లేచింది. నావైపు వచ్చేందుకు ప్రయత్నంచేస్తున్నట్లుతోచింది. మళ్ళా గన్‌పై కెత్తాను. గురిచూశాను. రెండడుగులుముందుకు వేశాను. భయంతో బిక్కచచ్చిన ఆడని స్త్రీ నన్ను ఘట్టిగా అదిమి పట్టుకొవడంతో ముందుకు అడుగు వెయ్యడానికి ఆమె బరువును కూడాలాగవలసి రావడంతో ఆయాసంవేసింది.

ట్రిగ్గర్ నొక్కాను. మరోగుండు దూసుకుపోయింది. ఈ మారు పొట్టకు రంధ్రంపొడిచింది నేను విడిచిన గుండు. ఆడవి పంది కుప్పకూలి పోయింది. ఎడంచేత్తో మెడను కరచుకున్న ఆమెచేతుల్ని తోసేశాను.

ఎత్తైన ఆమె అచ్ఛాదన లేని వక్షోజాలు నా వీపుకు గుచ్చుకున్నాయి. రక్తంలో చార్జర్ పెట్టినట్లు కరెంటు పుట్టింది. అయినా తమాయించుకొని వెనక్కుతిరిగాను. ఆమె

సిగ్గుతో కళ్ళుదించుకొనివుంది.

అంతకు ముందు పున్నమి రాత్రినాడు ఆడవాళ్ల గూడెంకు డెళ్లాకోసం వెళ్ళినప్పుడు, ఆగూడెంలోవున్న అందర్నీబాగానేచూశాను. కానీ ఇప్పుడు నాముందున్న స్త్రీకనుపించ లేదు వాళ్లలో. వేరేగుంపుకు చెందిన మనిషేమోనన్న అనుమానంకలిగింది. ఆమెనడిగాను. నాబాషవిని ఆశ్చర్యపోయి "నీకెలాతెలుసు మా భాష!" అంది.

"నేర్చుకున్నాను. ఇంతకూనువ్వు ఎవరిముఠాకు సంబంధించినదానివి?"అడిగాను. ఏదో పేరుచెప్పి,ఆముఠాలో వున్నానంది.

అదీవిలోనున్న మూడుముఠాల్లో ఆమెనాకు సంబంధించిన ముఠాలోనిదికాదని తెలుసు. అంతకుముందు యుద్ధంజరిగిన ఎదుటవాళ్లకు సంబంధించిన మనిషాలేక, ఈ రెండుగాక, మూడో ముఠాలూకాని ఆలోచించాను. అమెనెలా అడగాలో అర్థంగాక ఆలోచించసాగాను.

"నువ్వున్నముఠా ఈమధ్య యుద్ధంచేసిందా?" అడిగాను.

"చేసింది. కొద్దిరోజులక్రితం. ఎందుకు? అడిగిందామె.

"ఊరికే! నువ్వువరితాలూకో తెలుసుకుందామని అడిగాను, అన్నాను.

"నువ్వుచాలా బాగున్నావు." అంటూ ఠక్కున నాపైకురికికౌగిలించుకుని, ఎముకలు విరిగేలా, నాశరీరాన్ని తనబాహుబంధంలో బిగించింది.

బలవంతంగా ఆపట్టు విడిపించుకుని దూరంగా జరిగాను

"ఎందుకలా తోసేస్తావ్?" అడిగిందికోపంగా.

"మీరు అడవిమనుషులు మీతోచాలా జాగ్రత్తగా వుండాలి లేకుంటే మీముఠా, నాముఠాఒకటై గొంతుకోస్తారునన్ను," అన్నాను.

''ఇక్కడెవరూలేరుగా! మావాళ్లకు తెలీదులే!'' అందిచిన్నగా

''అయినాసరే! నువ్వు వెంటనేవెళ్లిపో!'' కోపంగాఅరిచాను.

''వెళ్లను. నీమీద నాకు ఇష్టంగావుంది. అదితీరాకేపోతాను. అందిమొండిగా.

నాకుభయంతోపాటు కోపంకూడాపుట్టుకొచ్చింది. ప్రక్క నెవరన్నా మాగూడెంమనిషి వుండివుంటే బాగుండుననిపించింది

''నీతోనాకు అనవసరం. నేనువెళ్తున్నాను.'' అన్నానుముందు కు కదుల్తూ.

ఆమె టక్కుననాకు అడ్డంగాపడి రెండు కాళ్లుబందించిపట్టు కుంది. గుంజాకున్నాను. లాక్కున్నాను. ఎలాగైనా ఆపట్టు తప్పిం చుకునిపారిపోవాలని ప్రయత్నించాను. ఆమెది ఉడుంపట్టు విడి పించుకోవడం నావల్లకాలేదు ఇకలాభంలేదని తుపాకీపైకెత్తి, ఆ మెతలకు గూరిపెట్టాను.

''మర్యాదగావదులు! లేకుంటే ఆపందిని కాల్చినట్లు నిన్నూ కాల్చి చంపుతాను.'' అన్నాను బెదరిస్తూ.

''చంపెయ్! నేను మాత్రంవదలను. నేనుచచ్చాక మాగూడెం వాళ్లుఎటూ వస్తారు. ఎలాచచ్చింది చూస్తారు. తుపాకితో కాల్చి చంపే తెలివివున్న మనిషివి నువ్వొక్కడివేనన్న విషయం సుల భంగా తెలుసుకుంటారు. ఆతర్వాత విూనాయకుడితో విష యాలుచెపుతారు. అతనుకూడా నిన్నుకాపాడలేడు. ఇలాంటి విష యాల్లో మేమంతా ఒక్కటే. చంపెయ్!'' అంది ధైర్యంగా.

అడకత్తెరలో ఇరుక్కున్నట్లయింది.

నాకెటూతోచలేదు. చీకటి దట్టంగా పేరుకుని పోయింది. నాకోసంనాయకుడూ, అతని అనుచరులూ ఎదురుచూడటం ప్రారంభిస్తారు. ఒకవేళనేను రాకుంటే కంగారుపడి నామకాం కువెళ్తారు. డెల్లాకునేను బయలుదేరివెళ్ళి చాలా సేపయిందని

# సప్లిమెంట్ పోటీ-9

43,44,45,46,47 అంకెలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జతపరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.

|  |  |  |  |  |
|---|---|---|---|---|
|  |  |  |  |  |

మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనవచ్చును.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు జులై 75 నెల మాస పత్రికలో చూడండి.

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖ చిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చు.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20/- లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్‌డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులు కానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాస పత్రికలో ప్రచురించబడతాయి.

—ఎడిటర్.

చెప్తుంది. దాంతోవాళ్ళు నాకేమయిందోనని వెతుక్కుంటూ బయలుదేరి ఇటువైపుగా వస్తారు. వచ్చినేను వాళ్ల తాలూకు ఆడమనిషితో ఒంటరిగా వుండటం చూశారంటే......

ఆపైన ఆలోచించలేక పోయాను.

నాకంటూ ప్రత్యేకంగా ఒక ఆడమనిషి వుందనీ, ఆమెను నావెంట తెచ్చుకున్నాననీ, మాజాతినియమం ప్రకారం ఆమెను తప్పమరెవ్వరినీ తాకగూడదనీ చెప్పాను. అంతావిని, తనపట్టు మరింత ఘట్టిచేసింది తప్పనన్ను వదలలేదు.

వాళ్లఇలాకా మనుషులు ఏక్షణంలోనైనా వచ్చేప్రమాదంవుందనీ, నాకోసం ఆత్రుతగా ఎదురు చూస్తుంటారనీ, దయచేసి వదలి పెట్టమని నచ్చచెప్పే ప్రయత్నంచేశాను.

నేను చెప్పే కొద్దీ ఆమెపట్టుదల ఎక్కువైంది.

అప్పటకి దాదాపు పదిహేనునిముషాలనుంచి మాఇద్దరిమధ్య గొడవ జరుగుతూంది. ఇకపాడిగించి లాభంలేదనిపించిది. అడవి మనిషి. అందులో ఉద్రేకంతో మత్తెక్కివుంది. ఆమెకు సాంప్రదాయం, మంచీ, అనేవేవి అర్ధమయ్యేట్లుగానీ, పదిమంది కంట పడితే ఎదురొచ్చే ప్రమాదభయముగానీ లేవని తోచిందినాకు.

అరక్షణంకళ్ళుమూసుకుని అలోచించాను.

మనస్సుకు, మనస్సాక్షికీ, వ్యతిరేకంగా, కేవలంనాప్రాణాల్ని నేను కాపాడు కోవడంకోసం, ఆమెను అతితొందరగా వదిలించుకోవడంకోసం, ఆమెకోరిక తీర్చేందుకు నిర్ణయించు కొన్నాను.

''నీకోరిక తీరుస్తాను! లే!'' అన్నాను.

లేడిలాఒక్కగెంతులొ లేచి నిలుచుందినాముందు. నాచేతుల్ని ఆమెచేతుల్తో ఘట్టిగాపట్టుకుంది.

అరగంట తర్వాత నన్ను అయిష్టంగా వదలిల్లిందామె. ఆమె

చెట్లల్లో కలసి పోయాక నేను మెల్లగా వెనక్కివచ్చి తుపాకీ తీసుకొని దారిపట్టాను.

నేను చంపినపంది వెల్లికిలా పడివుందక్కడే!

"నేను గూడెంచేరేసరికి జనమంతా ఆయుధాలతో సన్నద్ధులై వున్నారు. "ఏమిటింత ఆలస్యమైంది.?" అడిగాడు నాయకుడు

" వొంట్లో బాగాలేదు. నీరసంగావుంది. మీతోరాలేనను కుంటాను. " అన్నాను

" ఇవ్వాళ నువ్వుతోడు వున్నావని ఆనందంగావుందిమాకు. నువ్వు చెయ్యవలసిందేమీ లేదు. నడవలేకుంటేచెప్పు నావాళ్ళు మోసుకొస్తారు." అన్నాడు నాయకుడు.

"అదికాదు?"

నామాటకు ఎదురుచెప్పవద్దు. నీకోరికలెన్నో తీర్చాను. వెంట తోడుగా రమ్మంటున్నాను." అన్నాడు నాయకుడు.

నాకూడా ఆవిషయంగురించి వాదనపొడిగించడం ఇష్టం లేకపోయింది.

"డెల్లా ఒంటరిగా వుండాలక్కడ. నేనుఇలా వెళ్తున్నానని చెప్తే భయపడింది. నన్ను మానెయ్యకుంది. అదివీలుగాకుంటే తన్ను వెంటతీసుకువెళ్లమంది. అందుకేకాస్త వెనుక అడుగు వేశాను." అన్నానునేను.

"ఆమె గురించి కంగారు పడకు. మీకుకాపలాగా వుంచిన మనుషుల్నినిన్నవచ్చెయ్య మన్నాను. వాళ్లనుపంపుతాను."అన్నాను.

"అయినా ఆమెకు తృప్తిగావుండదు నాకుసముద్రంలో ఏ మన్నా జరుగుతుందేమోనన్న భయంతో తల్లడిల్లి పోతుంది. అందుకే నావెంటరావాలని పట్టుబట్టింది". అన్నాను.

"స్త్రీప్రాణాలకు ఏవిధమైన భయంలేదు. అవసరమైతే నాము త్తామెత్తాన్ని బలిపెడతాను. ఆడవాళ్ళుమనతో రాకూడదు. అది

మంచిదికాదు.'' అన్నాడు నాయకుడు.

నేను ఆలోచనలో పడ్డాను.

''ఆమెకు అక్కడ వుండడం భయంగావుంటే మా ఆడ వాళ్ల గూడెంకు పంపిస్తాను. మన మొచ్చిందాకా అక్కడ వుంటుంది.'' అన్నాడు నాయకుడు.

అలాంటి సూచనకు డెల్లా ఒప్పుకోదని నాకు తెలుసు. అయినా అలా చెయ్యడం మంచిదనిపించింది. ఒంటరిగా వుండి పిచ్చి పిచ్చి ఆలోచనలు చేసుకుంటుందెమోనన్న అపనమ్మకం కూడా నాకు వుంది.

అలాగే చేద్దాం! మనం బయలుదేరుదాము ఎంత టైమ్ వుంది.'' అడిగాను.

ఆకాశం కేసి చూసి, నాకు ఒక నక్షత్రాన్ని చూపిస్తూ అది అక్కడ్నుంచి రెండు బారలు పైకి పోయాక కదులు దాం అన్నాడు.

అతనితో చెప్పి ఇద్దరు అడవి మనుష్యుల్నితోడు తీసుకొని నా గుడిసెకు తిరిగి వచ్చాను. డెల్లాకు జరిగిందంతా చెప్పి, ఒంటరిగా వుండేందుకు, అష్ట కష్టాలు పడి ఒప్పించాను. ఆమె ఆడవాళ్లున్న గూడెంకు వెళ్లడానికి వెనుకంజ వేసింది. అక్కడా, ఇక్కడా ఒంటరిగానే వుండడమవుతుంది. కాబట్టి సాయంగా ఇద్దరు మనుషుల్ని వదలివెళ్లిమని చెప్పింది. నావెంట వచ్చిన మనుషులిద్దర్నీ ఆమెకు చూపించి, వాళ్లు చేయవలసింది, చెప్పి, వదలి వేశాను అక్కడే. తిరిగి గూడెంకు బయలుదేరి వచ్చాను.

(సశేషం)

